# చతుర

ఫిబ్రవరి 2016
రూ. 15/-



అమీ జాక్సన్
సౌందర్య రహస్యం ..122

★ అక్కినపల్లి సుబ్బారావు
నవల
ఆవలి అంచు .... 6

★ కాలాతీతం
ఆంట్ జూలియా
అండ్ ది స్క్రిప్ట్‌రైటర్ .... 114

జన్మదిన
ప్రత్యేక
సంచిక

# ఈ అశ్వశిరస్సులు.. పర్యాటక ఉష్షస్సులు

వారేవ్వా!

స్కాట్లండ్‌లోని ఫాల్‌కిర్క్ సిటీలోని హెలిక్స్ పార్క్‌లో ప్రపంచంలోనే అతిపెద్ద గుర్రపు ఆకారాలు కొలువుదీరాయి. ప్రపంచ స్థాయిలో పర్యాటకులను ఆకర్షించేందుకోసం తల నుంచి మెడవరకు ముప్పై మీటర్ల ఎత్తుగల ఈ అశ్వాలను సృజించారు. ఒక్కో గుర్రం ఆకృతి మూడువందల టన్నుల బరువుంటుంది. వీటి తయారీలో తుప్పు పట్టని ఇనుము వాడారు. గుర్రాలకు ఖ్యాతి గాంచిన స్కాట్లండ్ చరిత్రను, అక్కడి జానపద కథల్లోని అద్భుత అశ్వాలను దృష్టిలో పెట్టుకుని ఆండీ స్కాట్ అనే జగత్ప్రసిద్ధ కళాకారుడు 2013లో వీటినిక్కడ ప్రతిష్ఠించాడు.



# భామనే.. సత్యభామనే..!



☛ మిస్ టీన్ వరల్డ్, మిస్ లివర్‌పూల్ వంటి అనేక టైటిళ్లను గెలుచుకుంది.. అంతే! సినీ అవకాశాలు వెతుక్కుంటూ వచ్చాయి ఆ బ్రిటిష్ భామను.. ఇంతకీ ఎవరా చిన్నది? ఆమె సౌందర్యరహస్యాలేంటి?

☛ చీరకట్టు సొగసులు..

☛ రథసప్తమి ప్రత్యేక వంట..

చలో పేజీ నెం. 122

– సంపాదకులు

## త్వరలో చతురలో..!

బంకిం చంద్ర ఛటోపాధ్యాయ

**చంద్రశేఖర్**

(బెంగాలీ అనువాద నవల)

.....................................

అలపర్తి రామకృష్ణ

**జీవనలిపి**

.....................................

శ్రీకళ అబ్బరాజు

**ప్రేమించి పెళ్లి చేసుకో**

# మనసున ఉన్నదీ...

★ కన్నెగంటి అనసూయ నవల 'కొత్తగా రెక్కలొచ్చెనా..!' బుర్రకథ నేపథ్యంతో ఆరంభమై స్వలింగపర్క బాధితురాలి గాథతో కొనసాగింది. ఆత్మవిశ్వాసంతో ముందుకెళ్తే అవరోధాలనెన్నింటినైనా అధిగమించొచ్చన్న ముగింపుతో ఆసాంతం పాఠకునికి పూర్తిస్థాయి సంతృప్తి కలిగించింది. 'ఆదర్శ శిఖరాలు' పరిచయం పూర్తి నవల చదవాలనే తృష్ణను పెంచింది.

*– వి. భవానీశంకర్, సికింద్రాబాద్*

★ కన్నెగంటి అనసూయ 'కొత్తగా రెక్కలొచ్చెనా..!' నిజంగా విలక్షణ నవల! పాత్రల తీరుతెన్నులు నేటి ఆధునిక సమాజానికి అద్దం పడుతున్నాయి. ముఖ్యంగా బుర్రకథ గురించి, నేటి సమాజంలో ఎయిడ్స్‌లా విజృంభిస్తున్న సెక్స్ విపరీత పోకడల గురించి చాలా సమాచారం సేకరించారు రచయిత్రి. రాఘవన్‌గారి సమాధానాలు ఎంతో ఉపయోగకరంగా ఉంటున్నాయి. చతురకత 'సారాజకీయం' తమాషాగా ఉంది. 'భామనే.. సత్యభామనే..!', లంచాల మీద 'చమత్'కారం' చాలా బాగున్నాయి.

*– కలశపూడి వెంకటశ్రీనివాస్,*
మల్కాజిగిరి, హైదరాబాద్

★ సామాజిక ప్రయోజనం సాధించిన నవల 'కొత్తగా రెక్కలొచ్చెనా..!'. చివర్న ప్రముఖుల అభిప్రాయాలు వివరించడం కొసమెరుపు. 'ఆదర్శ శిఖరాలు' పరిచయం బాగుంది. సకినాలతో సంక్రాంతి అనుభూతిని కలిగించింది జనవరి చతుర.

*– వీ. హైమవతి,* మంచిర్యాల

★ మదిని ఆకట్టుకునే గులాబీ అందాల ముఖచిత్రంతో వెలువడిన చతుర విషాద చాయలను నింపింది. సునంద లాంటి నరరూప రాక్షసులుంటారని కలలో కూడా అనుకోలేదు. అవనిజలాంటి ముక్కుపచ్చలారని అమ్మాయిల జీవితాలలో ఇంకా ఎన్నున్నాయో అనిపించింది. నవల చదివిన సునందలాంటి వాళ్లకు కనువిప్పు కలుగుతుందని, తద్వారా అవనిజలాంటి వాళ్లు రక్షించబడతారని ఆకాంక్ష.

*– కరణం శివానందరావు,* కర్నూలు

★ 'కొత్తగా రెక్కలొచ్చెనా..!' ఆద్యంతం ఆసక్తిగా చదివింపజేసింది. 'కొత్తగాలి' శీర్షిక ద్వారా కొత్త కలాల వెలుగులు పాఠక లోకంలోకి ప్రసరిస్తున్నాయి. 'చతురంగం' మెదుడుకు పదును పెట్టేలా ఉంది. చతుర ప్ర.జ. ఆధ్యాత్మిక సందేహాలు తీర్చే కరదీపికలా ఉంది.

*– రాంపల్లి పద్మజారాణి,*
హైదరాబాద్

★ మరుగున పడిపోతున్న కళలకు తిరిగి ఊపిరి ఊదినట్లనిపించింది నవల ఆద్యంతం చదివాక. పాత్రల చిత్రణపరంగా చూస్తే బలమైన వ్యక్తిత్వాలతో ఏ పాత్రకాపాత్రే ఎంతో అద్భుతంగా ఉంది. 'కొత్తగాలి' కవితలు చిన్నవైనా భావ స్ఫోరకంగా ఉంటున్నాయి. 'అక్షరం'లో ప్రముఖుల మాటలు అమృత గుళికల్లా ఉన్నాయి. ఒత్తిడిని తగ్గించుకునేందుకు చూపిన పరిష్కారాలు ఎంతో ఉపయుక్తంగా ఉన్నాయి.

*– పెబ్బిలి హైమావతి,* విశాఖపట్నం

★ కన్నెగంటి అనసూయ నవల 'కొత్తగా రెక్కలొచ్చెనా..!' నేటి ఆధునిక వాతావరణంలో జరిగిన కథలా సాగింది. కొత్తగా రెక్కలు కావు.. కొత్తగా కోరలు వచ్చాయి. సునంద పాత్రకు సరైన శిక్ష వేయకుండా చంపేశారు. ఆమెను చట్టానికి అప్పజెప్పి ఉంటే ఇంకా బాగుండేదనిపించింది. వినాయకచవితి గురించి బాగా విశ్లేషించారు. మొత్తానికి మంచి దృశ్యకావ్యాన్ని అందించారు.

*– పక్కి శ్రీదేవి,* విజయనగరం

★ నవలలోని అవనిజ పాత్ర గుండెలను పిండేసింది. సమాజంలో సునందలాంటి చీడ పురుగులను ఏరివేయాలన్నంత ఆవేశం కలిగింది. 'చిటికెలో రుచిగా.., చిట్కాలక్ష్మి' ఉపయోగపడే విధంగా ఉన్నాయి. శరీరాన్నే కాన్వాస్‌గా మార్చుకున్న కళాకారులు అబ్బురపరిచారు.

*– యమ్. జమిలాబేగం*

సంపుటి -39,
సంచిక - 1
457వ సంచిక,
పేజీలు : 132, ఫిబ్రవరి 2016

# చతుర



★ ముఖచిత్రం: నీహారిక
★ రెండో కవరు : వారెవ్వా!
★ పుస్తకాలంకరణ : రాజు యాట



'నేను ఇండియా వెళ్తాను. ఇక అక్కడే ఉండిపోదామను కుంటున్నాను' అమెరికాలో స్థిరపడ్డ కృష్ణారావు తన కూతురు, కొడుకుతో చెప్పాడు.

"డేడీ! అక్కడికెళ్ళి నువ్వేం చేస్తావు? ఒక్కడివీ ఎలా ఉండగలవు? నువ్వు ఇలాంటి దారుణమైన నిర్ణయం తీసుకోవని అనుకుంటున్నాం" ముక్తకంఠంగా చెప్పారు కొడుకు, కూతురు.

"తాతా నువ్వు మకాం మారిస్తే ఎలా? మా సెలవుల్లో నీతో గడపడం సాధ్యపడదు. ఉయ్ విల్ మిస్ యు! నువ్వు లేని లోటు మాకు బాగా కనిపిస్తుంది. అంత దూరం వెళ్లిపోతే నిన్ను ఎలా చూస్తాం?" మనవలు ఆప్యాయంగా అన్నారు.

ఆ తర్వాతేమైంది? ఇంతకీ కృష్ణారావు పిల్లలను వదిలి తనొక్కడే ఇండియా రావాలని ఎందుకనుకున్నాడు? ఆద్యంతం ఆసక్తిగా సాగే **అక్కినపల్లి సుబ్బారావు** కౌటుంబిక నవల **ఆవలి అంచు** 6వ పేజీలో..

# ఆవలి అంచు

- అక్కినపల్లి సుబ్బారావు



బొమ్మలు : అనంద్

'మేం రీనో పట్టణానికి వెళ్తున్నాం! మాతో వస్తారా?' అమెరికాలో కొడుకు వినోద్ దగ్గర ఉన్న రామారావును అడిగేడు పరమేశ్వరరావు.

ఆలోచించి చెబుతానని ఆయనతో చెప్పి వచ్చేశాడు రామారావు. 'వినోద్ ఏమంటాడో?' అనుకుంటూనే భార్యతో పరమేశ్వరరావుగారి ప్రతిపాదన గురించి చెప్పేడు.

"అవ్వ! జూదశాలకా? మీకేం మతిపోలేదు కదా! ఈ వేళ జూదశాలంటున్నారు. రేపు బార్‌కి వెళ్లి డేన్స్‌లంటారు. మీరింకా చిన్నవాళ్లు అనుకుంటున్నారా? నన్ను మాత్రం వదిలేయండి బాబు! మీ ఇష్టం! మీరు కావాలంటే వెళ్ళి రండి" అంది వైదేహి కోపంగా.

ఆ తర్వాతేమైంది? వినోద్ అంగీకరించాడా? ఇంతకీ రామారావు దంపతులు రీనో పట్టణానికి వెళ్లారా? రెండుదేశాల నడుమ నలిగే ఇద్దరు సోదరుల మనోవిశ్లేషణ అక్కినపల్లి సుబ్బారావు కౌటుంబిక నవల **ఆవలి అంచు** చతుర జన్మదిన సంచిక ప్రత్యేక కానుక!





నే ప్రాణం పోసి పెంచిన మొక్కల్ని నరికేస్తుంటే ఊరుకోను, మీ ప్రాణాలు తీస్తానన్నట్లుగా కళ్ళలోంచి నిప్పుల్ని కురిపిస్తున్నాడు సూర్యుడు. కొలిమి తిత్తిలోంచి బైటికి వస్తున్న వేడి గాలి సూర్యుని తాపానికి తట్టుకోలేక చెట్టు నీడకి పరిగెత్తింది. మే నెల ఆఖరి వారం రోహిణీకార్తె ప్రభావం తీవ్రంగా ఉండడంతో బంగారం రంగు ఎండ తెగ మెరుస్తోంది. అధునాతనంగా కట్టిన మూడు గదులున్న ఇంట్లో ముందరగదిలో కూర్చున్న కృష్ణారావు లేచి ఫేన్ స్విచ్ నొక్కాడు. విద్యుత్ లేనందున 'ఇన్వర్టర్' మీద పనిచేస్తున్న ఫేన్ మొరాయిస్తూ వేగం అందుకుంది. గదంతా వేడిగాలితో నిండి ఉన్నా, గాలిలో ఎక్కువ తేమ ప్రభావం వలన కృష్ణారావు శరీరంలోంచి ఉబికిన చెమట బనియన్‌ని వదలడం లేదు. ఇబ్బందిగా బనియన్‌ని సరిచేసుకుంటూ తెరచి ఉన్న కిటికీలోంచి బైటకి చూసేడు కృష్ణారావు. పసుపు నీళ్ళ రంగులో ఉన్న ఎండని చూసి 'ఎండ తీవ్రంగా ఉందే!' అనుకుంటూ కుండలో ఉన్న చల్లని నీళ్ళని తాగి, కడుపు చల్లపడడంతో కిటికీకి ఉన్న పరదాని కాస్త పక్కకి నెట్టి తిరిగి బైటకి దృష్టి సారించేడు. బొంగరంలా గిరగిరా తిరుగుతూ, తన ఆకృతిని మార్చుకుంటూ, దగ్గరగా ఉన్న చెట్లరెమ్మల్ని, కాగితపు ముక్కల్ని, చిన్న చిన్న గుడ్డపీలికల్ని, ఎండిపోయిన బరువు లేని ఆకుల్ని, కావలసినన్ని ఇసుక రేణువులని ఎగరేస్తూ, శబ్దం చేసుకుంటూ తన ఇంటివైపే వచ్చేసింది సుడిగాలి. 'లోపలికి వెళదామా?' అని ఆలోచించేలోగా కృష్ణారావు శరీరం నిండా దండిగా ఇసుక రేణువులని చిలకరించి ఇంటిని దాటి వెళ్ళిపోయింది. కంటి రెప్పలని ఆడించి, కళ్ళలో ఇరుక్కున్న ఇసుకరేణువులని విదుల్చుకుని, మండిపోతున్న కళ్ళని నులుము కుంటూ, వెళ్ళిపోయిన సుడిగాలి వేపు చూసేడు కృష్ణారావు. తన చిన్నతనంలో పెద్దవాళ్ళు ఏవేవో చెప్పి పిల్లల్ని అనవసరంగా భయపెట్టేవారు. అందులో సుడిగాలి ఒకటి. 'సుడిగాలిలో నిలబడి కాగితం చించితే రక్తం కారుతుంది. జాగ్రత్త! దానిలో దెయ్యం ఉంది!' అనేవారు. అప్పట్లో పెద్దవాళ్ళని ఎదురు ప్రశ్నవేసే ధైర్యం ఎవరికీ ఉండేదికాదు. ఆ బూటకపు నమ్మకాల్ని ఎదిరించేవారు కాదు. ఒక్కసారిగా పాతరోజులు గుర్తొచ్చాయి.

"సుడిగాలి గురించి పెద్దలు చెప్పింది నేను నమ్మను" అని తనంటే..

"అయితే వెళ్లు! దానిలో నిలబడి కాగితం చించు!" అంటూ శారద సవాలు విసిరింది.

తను సంశయించి స్పందించేలోగా, పరిగెత్తి వెళ్ళిన సుడిగాలి వేపు, తన వేపు మరోసారి పరీక్షగా చూసి పగలపడి నవ్వింది శారద. ఆ నవ్వు తన సంశయం చూసో? లేక తన పిరికితనం చూసో? తను ఆనాడు ఊహించలేదు.

లెఖ్ఖల మాస్టారి కూతురు శారద.

వేసవి సెలవుల్లో లెఖ్ఖల ట్యూషన్ కోసం మధ్యాహ్నం మూడుగంటలకి తను మాస్టారింటికి సైకిల్ మీద వెళ్ళేవాడు. నవనవలాడుతున్న చేతితో కుండలోంచి నీళ్ళు అందిచ్చిన శారదని గమనిస్తూ అలనాడు ఎన్నోసార్లు తాగిన ఆ చల్లని నీళ్ళ రుచి ఈనాడు, ఇన్నేళ్ళ తర్వాత కూడా మరచిపోలేదు తను. కుండలోంచి నీళ్ళు తీస్తున్నప్పుడు ఆమె చేతికి ఉన్న గాజుల శబ్దమో? లేక గ్లాసుని మధ్యవేలు, బొటకన వేళ్ళతో సుతారంగా అందించిన భంగిమో? ఇప్పుడు తను వివరించలేడు. ఆ దృశ్యం చెరపలేని మధుర జ్ఞాపకం! ఆనాడు అది ఒక సమ్మోహనాస్త్రం!

ఆలోచనలు శారద మీదకి మళ్లబోతుంటే బయట గాలి శబ్దం ఎక్కువయింది. మరో సుడిగాలి వచ్చేలా ఉందని గ్రహించి,

కిటికీ తలుపు మూసి కుర్చీలో చతికిలపడ్డాడు కృష్ణారావు. తీయని శారద ఆలోచనల్ని చెదరగొట్టి వెళ్ళింది సుడిగాలి.

చాలాకాలం, తను ఏదైనా నిర్ణయాన్ని తీసుకోవాలంటే తెగ ఆలోచించేవాడు.

'కృష్ణారావు ఏపనీ తొందరపడి చేయడు. నిదానంగా ఆలోచించే చేస్తాడు' అనేవారు చాలామంది.

అది అర్ధసత్యమన్న సంగతి తనకి తెలుసు. తనకంటే ఒక క్లాసు తక్కువలో ఉన్నా, కామేశ్వరరావు మాస్టారు లెఖ్ఖల ట్యూషన్ చెప్పేటప్పుడు శారద కూడా ఇతర విద్యార్థులతో కూర్చుని లెఖ్ఖలు చేసేది. ఒకరోజు మాస్టారు లెక్క చేయమని చెప్పి ఇంటి లోపలికి వెళ్ళారు.

తీవ్రంగా ఆలోచిస్తూ, లెక్క చేయడంలో తను నిమగ్నుడై ఉన్నపుడు 'పదమూడు పదిహేడ్లెంత?' అనడిగింది తన పక్కన కూర్చున్న శారద.

ఒక్కసారి ఆలోచనల్లోంచి పొలమారి, తెప్పరిల్లి "రెండు వందల పదకొండు" అన్నాడు తను.

నోటికి చెయ్యి అడ్డుపెట్టుకుని గుంభనంగా నవ్వింది శారద.

అప్పుడు అర్థమయింది తను చెప్పిన జవాబు సరయింది కాదని.

"నిదానంగా గుణకారం చేసి, పప్పులో కాలువేసేరు" అంటూ మాస్టారి కోసం ఎదురుచూసింది శారద.

'ఎన్నిసార్లు తను ఈ 'నిదానం' పదాన్ని తన జీవితపు నిఘంటువుల్లోంచి తీసివేయాలని ప్రయత్నించేడు. హూ! అది సాధ్యపడలేదు' అనుకుంటూ చేతి వాచీ వేపు చూసేడు కృష్ణారావు.

ఈ వేడి ప్రతాపం తగ్గడానికి ఇంకో రెండుగంటల వ్యవధి ఉందని చెబుతూ గడియారం మూడుగంటలు చూపిస్తోంది. 'విజయనగరం వెళ్ళి పాలు తెచ్చుకోవడానికి చాలా సమయముంది' అనుకుంటూ ఏం చేయాలో స్ఫురించక అలసటతో కళ్ళు మూసుకున్నాడు కృష్ణారావు.

**కాలిఫోర్నియా:**

బాగా చేదుగా ఉన్న కాఫీ తాగేక, స్వచ్ఛమైన గాలి కావాలని మెదడు వేధిస్తుంటే చెప్పులు తొడుగుకుని బైటకి వచ్చిన రామారావుని చల్లని గాలి తాకింది. మే నెల ఆఖరివారం. ఇప్పుడు ఇండియాలో వేడి తీవ్రంగా ఉంటుంది. కానీ ఇక్కడ కాలిఫోర్నియాలో ఎండలో తీక్షణత ఉన్నా ఉష్ణోగ్రత బహుశా పద్దెనిమిది- ఇరవై మధ్య ఉంటుందేమో! పాదచారుల బాట పక్కన ఉన్న వివిధ రకాల చెట్ల నుంచి వస్తున్న గాలి మత్తెక్కిస్తూ శరీరాన్ని తాకుతుంటే చెంపలని రాసుకున్నాడు రామారావు.

"నాన్నా! జాగ్రత్త! ఈ సంవత్సరం మామూలు కంటే ఉష్ణోగ్రతలు నాలుగైదు డిగ్రీలు తక్కువగా ఉన్నాయి. గాలి మార్పు మిమ్మల్ని ఇబ్బందిపెట్టే ప్రమాదం ఉంది. నడకకి బైటకి వెళ్ళేటప్పుడు సరయిన దుస్తులు, జోళ్ళు వేసుకోండి!" అంటూ కొడుకు వినోద్ హెచ్చరించేడు.

తెరలు తెరలుగా వస్తున్న సువాసనను ఆఘ్రాణిస్తూ, పరాకుగా నడుస్తూంటే కాస్త ఎత్తుగా ఉన్న కాలిబాటని పాదం బలంగా తాకింది. అయినా కింద పడిపోకుండా తమాయించుకున్నాడు. రక్తం ఉబకలేదు కానీ కాలి బొటనవేలు నొప్పితో తీవ్రంగా

### కొత్తగాలి...

**బంధువులందరూ**
**సంతోషపెట్టేవారే!**
**కొందరు రావడం మూలంగా!**
**మరికొందరు వెళ్లడం మూలంగా!**

– బిక్కునూరి రాజేశ్వర్,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

అరిచింది. 'ఛ! సరయిన జోళ్ళు వేసుకో కుండా నడకకి రావడం పొరపాటే!' అను కుంటూ నడక వేగం తగ్గించేడు.

శబ్దం చేసుకుంటూ స్కేటింగ్ బల్లమీద రామారావుని దాటివెళ్ళేడు ఒక పద్నాలు గేళ్ళ కుర్రాడు. నల్లని, నున్నని తారు రోడ్డుమీద తెల్లని దుస్తులతో ఒక అంగుళం వెడల్పున్న సైకిల్ చక్రాల మీద దాదాపు ముప్ఫయి-నలభై కిలోమీటర్ల వేగంతో దూసుకెళ్లింది ఒక జవ్వని.

'ఆమె వయస్సు ఎంత ఉంటుందబ్బా?' అని ఊహించేలోగా ఆమె అదృశ్యమ యింది. ఉల్లాస వాతావరణం ఉత్సా హంగా వ్యాయామం చేయమని ఎలుగెత్తి అరుస్తుంటే ఇంటి నుంచి బయలుదేరే ముందర "నడకకి వెళ్దాం వస్తావా?" అన డిగేడు తను భార్య వైదేహిని.

"ఈ ఉదయమా? మీకేమైనా పూనకం వచ్చిందా?" అంది ధర్మపత్ని.

"గతంలో సాయంకాలం నడకకి రమ్మని పిలిస్తే, 'ఇప్పుడా? కరెంటు ఎప్పుడు వస్తుందో? ఎప్పుడు పోతుందో? ఇడ్లీలకి పిండి రుబ్బాలి!' అంటూ రోజులు దాటవే సేవు. దాని ఫలితం కొంత ఇప్పుడు చవి చూస్తున్నావు" అన్నాడతను.

"గడిచిన దాని గురించి అనుకుని ఏంలాభం?" అంది వైదేహి.

"అందుకే బయలుదేరు!" అన్నాడు.

"చలిగా ఉన్నట్లుంది! రేపు చూద్దాం!"

"నీ ఖర్మ!" అంటూ బయటికి వచ్చేడు.

'ఇందాక వైదేహితో తను ఎప్పుడూ వాడని పదాన్ని వాడేనే..' అనుకుంటూ కుంటుకుంటూ నడక కొనసాగించేడు రామారావు. చిన్నరోడ్డు మీద నుంచి మౌరీ రోడ్డు మీదకి వచ్చేసరికి చల్లని గాలి పెరిగింది. రెండు చేతులతో రెండు చెవు లని అదుముకుంటూ అడుగులు వేయసా గేడు రామారావు. మౌరీరోడ్డు మీద నాలుగు వీధులు నడిచేలోగా రెండు 'స్టార్ బక్స్ కాఫీ' దుకాణాలని దాటేడు. మరో రెండడుగులు వేసి ఫ్రీమాంట్ ఎవెన్యూ దగ్గర మూడో 'స్టార్‌బక్స్' దుకాణం కని పించగానే 'ఒక కప్పు కాఫీ తాగుదామా?' అనిపించింది. 'అన్నింటి కన్నా చిన్నసైజు గ్లాసు కాఫీ కొనుక్కుందామన్నా దాని ఖరీదు రెండు డాలర్లు. ఎందుకొచ్చిన ఖ ర్చు? చప్పున నడక ముగించి ఇంటికి చేరి వైదేహిని మంచి కాఫీ ఇవ్వమని అడగొ చ్చు' అనుకుని వెనుతిరిగేడు రామారావు.

కావాలనుకోకపోయినా, చెప్పిన మాట వినకుండా రామారావు దృష్టి 'స్టార్‌బక్స్' దుకాణం మీద నిలిచింది. పెద్దపెద్ద గ్లాసు లతో, తినుబండారాలతో రెస్టారెంట్ బైట వేసిన స్టీల్ కుర్చీలలో కూర్చుని అందరూ కాఫీ తాగుతున్నారు.. కాదు వాళ్ళు ఆస్వా దిస్తున్నారనిపించింది రామారావుకి. ఒక్కో క్క బల్లదగ్గర ఉన్న కుర్చీలలో ఆసీనులయి జంటలు, గ్లాసుకి ఉన్న మూత కంతలోంచి రెండు పెదిమలని గుండ్రంగా కలిపి కాఫీని పీలుస్తున్నారు. నోటిలో ఊరుతున్న లాలాజలం ఆశలని తుత్తునియలు చేసి మొహాన్ని బలవంతంగా రెండో వైపు తిప్పుకొని మౌరీ వీధిలో నడక వేగం పెంచేడు రామారావు. అదిగో లోగన్‌వీధి! తరువాత ఫార్‌తెల్ వీధి.. వెన్వెంటనే వచ్చేదే వినోద్ ఇల్లు ఉన్న వీధి. తరువాత మంచి కాఫీ అనుకుంటూ, ఒకపక్క ఆ స్టార్‌బక్స్ కాఫీ తాగలేదని మథనపడుతూ, మంచి కాఫీ అందజేయ బోతున్నానని నో టికి ఆశపెడుతూ ఇంటిని సమీపించేడు రామారావు.

తలుపు తెరచిన వైదేహితో "తొందరగా ఒక కప్పు స్ట్రాంగ్ కాఫీ ఇయ్యి!" అన్నాడు.

రెండు నిమిషాల తరువాత వైదేహి అందించిన కాఫీ చప్పరించగానే వెగటు చేదు ఒళ్లంతా వ్యాపించింది.

"ఇదేమిటి?" అనడిగేడు రామారావు గొంతు పెగల్చుకుని.

చతుర సంగతులు

## పిల్లలను మరచిన తల్లిదండ్రులు

తల్లిదండ్రులకి తమ బిడ్డలు ప్రాణం. అయినప్పటికీ కొందరు తల్లిదండ్రులు తమ బిడ్డలని మర్చిపోయిన అనేక సందర్భాలు ప్రపంచంలో ఉన్నాయి!

★ ఆరిజోనా రాష్ట్రంలోని గిల్బర్ట్‌లో ఓ తల్లి రెండునెలల బిడ్డని షాపింగ్‌కార్ట్‌లో మర్చిపోయి వెళ్లింది. తన మరో ఇద్దరు పిల్లలతో ఇంకో షాపులో ఉండగా పోలీసులు కనుగొన్నారు.




★ ఫ్రాన్స్‌కి చెందిన ఓ కుటుంబ సభ్యులు తమ మూడేళ్ల పాపను రెస్ట్‌స్టాప్‌లో మర్చిపోయి 93 మైళ్లు వెళ్లాక కానీ గుర్తించలేదు. వాళ్లు తక్షణం పోలీసులకి ఫోన్ చేశారు. ఓ వ్యక్తి వాళ్లు వచ్చేదాకా ఆ పిల్ల దగ్గర ఉన్నాడు.

★ టర్కీలో ఓ జంట సన్‌బాతింగ్ చేస్తుండగా వారి పదినెలల కూతురు నెల్డా, ఉన్న చిన్నరబ్బర్ పడవ తేలుతూ సముద్రంలోకి వెళ్లిపోవడం గమనించలేదు. ఓ టర్కిష్ కోస్ట్‌గార్డ్ ఆ పాపని రక్షించాడు.

★ ఇజ్రాయెల్‌లోని బెన్ గురియాన్ విమానాశ్రయంలో ఓ జంట నాలుగేళ్ల కూతుర్ని మర్చిపోయి మిగిలిన నలుగురు పిల్లలతో విమానం ఎక్కి వెళ్లిపోయారు. పైలట్ ప్రకటించేదాక వాళ్లు గుర్తించలేదు. అదృష్టవశాత్తు ఆ పాపకి తన తల్లిదండ్రుల పేర్లు, తామెక్కడికి వెళ్తున్నారో తెలియడంతో ప్రమాదం తప్పింది.

★ మసాచుసెట్స్‌కి చెందిన ఓ తండ్రి క్విన్ అనే ఊళ్లో తన కారులో ఏడాది కూతుర్ని మర్చిపోయి, రైలు ఎక్కేశాడు. 35 నిమిషాల తర్వాత గ్రహించి పోలీసులకి ఫోన్ చేశాడు.

★ లాంగ్ ఐలండ్‌కి చెందిన ఓ తండ్రి తప్పతాగి, మూడేళ్ల కూతుర్ని సబ్‌వే శాండ్‌విచ్ షాప్‌లో మర్చిపోయి వెళ్లిపోయాడు. ఓ కస్టమర్ గమనించి పోలీసులకి తెలిపింది.

★ న్యూయార్క్‌లోని ఓ తండ్రిని దుండగులు తుపాకీతో దోచుకునే ప్రయత్నం చేస్తే, తన మూడేళ్ల కూతుర్ని వదిలి పారిపోయాడు. సీసీ కెమెరా ఫుటేజ్ బట్టి ఆ పాప ఎవరితో వచ్చిందో గ్రహించి తండ్రికి అప్పగించారు.

"డికాక్షన్ కోసం తెచ్చిన కాఫీ పొడి అయిపోయింది" అంటూ భర్త చేయబోయే విమర్శలకి ఆస్కారం ఇవ్వకుండా వంటింటిలోనికి నడిచి తిరిగి టెలిఫోన్ అందుకుంది వైదేహి.

'ఆఫ్టరాల్ రెండుడాలర్ల ఖర్చుకి వెనుకాడవలసిన అవసరం ఏముంది తనకి?' అనుకుంటూ రుసరుసలాడేడు రామారావు.

"చింత చచ్చినా పులుపు చావలేదన్నట్లు.. రిటైరయి రెండేళ్ళయినా ఇంకా తానేదో పెద్ద ప్రొఫెసర్‌నన్న ఫోజు కొడుతుంటూరులే" అంటూ వైదేహి టెలిఫోన్‌లో ఎవరితోనో నవ్వుతూ చెబుతోంది.

ఇండియాలో ప్రతీనెల తన ఖాతాలో దాదాపు నలభైవేల రూపాయలు పెన్షన్ డబ్బు పడుతుంది. రెండు డాలర్లు అంటే దాదాపు నూరు రూపాయలు పెట్టి కాఫీ కొనుక్కుని తాగే అర్హత, తాహతు తనకి ఉన్నాయి. కానీ ఇక్కడ రెండు డాలర్లు పెట్టి కాఫీ కొనుక్కోవడానికి తను వెనుకాడాడు. ఇక్కడ తన కంటూ డాలర్లలో ఆదాయం లేకపోవడం ఒక కారణం. తను ఇండియా నుంచి తెచ్చుకున్న వెయ్యి డాలర్లలో తన దగ్గర ఇప్పుడు మిగిలి ఉన్నవి కేవలం వంద డాలర్లు మాత్రమే కావడం రెండో కారణం.

'వినోద్! నాకు ఖర్చుకి డాలర్లు కావాలి'

అనడిగితే వినోద్ ఇస్తాడు ఏమీ సంకోచించకుండా. కానీ యథాలాపంగా 'ఏమి ఖర్చు నాన్నా?' అంటే? ఛ! వినోద్‌ని డబ్బు అడగాలన్న ఆలోచనే తనకి నచ్చడం లేదు. ఈ దేశానికి వచ్చేటప్పుడు 'దూరపు కొండలు నునుపు' అన్నట్లు, అమెరికాలో ఉన్న ఇబ్బందులు తనకి తెలిసిరాలేదు. 'తరతరాలుగా నెలకొన్న సంప్రదాయపు ఆనవాయితీ తనని ఈ దేశం తీసుకువచ్చింది. ఇక్కడి ఒడిదొడుకుల్ని తట్టుకోవాలి' అనుకున్నాడు రామారావు. ఒడిదొడుకులు తట్టుకోవడానికి ధైర్యం అవసరం! కానీ తనలో ఆ ధైర్యం ఉందా? భయపడుతూనే మరొక గుక్క కాఫీ తాగేడు. 'కాఫీ చల్లారిపోయింది, వేడి చేస్తావా?' అని వైదేహిని అడగబోయి 'ఈ దిక్కుమాలిన కాఫీని మళ్లీ వేడి చేసి తాగడమా?' అని లేచి కసిగా కాఫీని సింక్‌లోనికి గిరాటేశాడు రామారావు. గంటక్రితం చక్కని ఆహ్లాదకరమైన వాతావరణాన్ని అనుభవించిన తను ఇప్పుడెందుకు మల్లగుల్లాలు పడుతున్నాడు? దీనికి నేపథ్యం రెండు డాలర్లు! కేవలం రెండు డాలర్లు! అని సరిపెట్టుకున్నా 'వెధవ మనస్సు గింజుకుంటోంది' అనుకుంటూ సోఫాలో చేరబడి కళ్ళుమూసుకుని మగత నిద్రలోకి జారేడు.

'ఎప్పుడూ వాడి సంగతే ముందర చూస్తారు! నన్ను పట్టించుకోరు' అంటూ అరిచేడు తను, ఒక దీపావళినాడు. తండ్రి జానకిరామయ్య ఇద్దరికీ బట్టలు తెచ్చి వాటిలో ఏది కావాలో కృష్ణారావు అన్నయ్యని ముందర ఎంచుకోమని అడిగినందుకు తనకి ఒళ్ళుమండింది.

'వాడు నీకంటే పెద్దకదా? ఇద్దరి బట్టలు ఒకే ధరవి. నీకు అన్యాయం ఏం జరిగింది?' అంది తల్లి.

'ఫరవాలేదు నాన్నా! వాడినే ముందర ఎంచుకోనియ్యండి!' అని కృష్ణారావు అన్నయ్య అనడంతో వాతావరణం చల్లబడింది. కృష్ణారావు అన్నయ్య తనని చాలా సార్లు సమర్థించేడు, ఆదుకున్నాడు.

"నే స్నానం చేసి వస్తాను. అంతలోగా స్టవ్ మీదుంచిన కూర మాడిపోకుండా ఒకసారి కలపండి. నిద్రకేం ఎప్పుడయినా పోవచ్చు" అంటూ వైదేహి కుదపడంతో తెలివి వచ్చింది రామారావుకి.

"అరనిమిషం కుర్చీలో నడుం వాలుస్తారో? లేదో? గురకపెడుతూ నిద్రపోతారు" అంటూ స్నానాల గదిలోనికి వెళ్ళింది వైదేహి.

కృష్ణారావు అన్నయ్య తనకంటే దాదాపు మూడేళ్లు పెద్ద. ఇండియాలో ఇంజినీరింగ్ పూర్తిచేసి స్కాలర్‌షిప్ రాగానే పైచదువుకి అమెరికా వెళ్లిపోయాడు. ఇంటర్‌మీడియట్ పూర్తిచేసిన తనని, అక్క వనజని వదిలి అన్నయ్య హఠాత్తుగా అమెరికా వెళ్లిపోవడం వెనుక కారణం ఎవరికీ అంతుపట్టలేదు. స్కూల్‌మాస్టర్‌గా పనిచేస్తున్న తండ్రికి అది పెద్దదెబ్బే! భార్య లేకపోయినా, ఉడకని అన్నంలా ఉన్న ఇంటిని సమర్థంగా నెట్టుకువచ్చేడు నాన్న అని గతాన్ని నెమరు వేసుకుంటుంటే..

"మళ్లీ నిద్రపోయేరూ?" అంటూ వైదేహి తలకి తువ్వాలు చుట్టుకుని స్నానాల గది లోంచి బైటికి వచ్చింది. తరువాత వంట గదిలోనికి వెళ్లి గరిటెతో కూరని కదిపింది. ఒక నిమిషం తరువాత హాల్‌లోనికి వచ్చి ఫేన్ వేగం పెంచి, తలకి చుట్టుకున్న తువ్వాలు ఊడతీసి మెల్లిగా జుత్తుని తుడుచుకుంటుంటే..

"కృష్ణారావు అన్నయ్య ఎలా ఉన్నాడో?" అన్నాడు రామారావు.

"నేను ఇంకా రిటైరవలేదు. రిటైరయిన మీకు అంతా తీరుబడే. కూర పాడయితే కోడలు 'మాడు వాసన వచ్చిందత్తయ్యా, వేడిసెగని కూర వండేరు కాబోలు' అంటూ చెప్పకుండా వంకలు పెడుతుంది" అంటూ మూతి విరిచి తల తుడుచుకోసాగింది

# జైలు పాలైన జంతువులు!

చతుర సమాచారం

తప్పుచేస్తే, మనుషుల్ని జైల్లో నిర్బంధిం చడం మనకి తెలుసు. కానీ ప్రపంచంలో కొన్ని దేశాల్లో పోలీసులు జంతువుల మీద కూడా నేరం మోపి బంధించడం విశేషం!

★ జనవరి 2013లో ఓ పిల్లి ఓ జైల్లోకి గోడ దూకి ప్రవేశించింది. దాని పొట్టకి ఓ సెల్‌ఫోన్‌ని అమర్చి దుండగులు జైల్లోని తమ సహచరుడి కోసం పం పారు. ఇది గమనించిన పోలీ సులు ఆ పిల్లిని అరెస్టు చేసి జైల్లో పెట్టారు! ఇది స్పెయి న్‌లో జరిగిన సంఘటన.



★ ఇండియన్ పోలీసులు 2010లో, పాకి స్థాన్ నుంచి వచ్చిన పావురాన్ని అరెస్టు చే శారు. రహస్య ఉత్తరం తీసుకొచ్చిందన్న అను మానంతో గూఢచర్యం నేరం మోపారు.

★ జూన్ 2013లో ఓ పోలీసు కారుని, 12 గొర్రెలు గిట్టలతో తన్ని సొట్టలు చేసినందుకు ఇండియన్ పోలీసులు వాటిని అరెస్టు చేశారు. 'సొసైటీ ఫర్ ప్రివెన్షన్ ఆఫ్ క్రూయెల్టీ టూ ఏని మల్స్' సంస్థ వాటిని విడుదల చేయించింది.

★ 2008లో మెక్సికో లోని చియాపాస్ అనే చోట ఓ గాడిద ఇద్దర్ని తన్ని గాయపరిచింది. దాన్ని జైల్లో పెట్టి, 420 డాలర్లు పరిహారం ఇచ్చేదాకా దాని యజమానిని వదల్లేదు.

★ నైజీరియాలో శాంగో ఓటా అనే చోట డేయో అనే పిల్లవాడు తన స్నేహితుడు అజీజ్ సలాకోని పగిలిన సీసాతో పొడిచి హత్య చేశాడు. పోలీసులు వచ్చేస రికి అక్కడ హతుడి రక్తంతో తడిసిన ఒక ఆవు తప్ప ఇంకెవరూ లేరు. దాంతో పోలీసులు ఆ ఆవును హత్యానేరం కింద అరెస్టు చేశారు. పరి శోధన జరిగిన తర్వాత నిజం తెలిసి దాన్ని వదిలేశారు.

★ ఆస్ట్రేలియాలోని 'మ్యూజియం ఆఫ్ కాంటెంపరరీ ఆర్ట్' ఆవరణలో గల చెట్ల పూలని తినేసినందుకు పోలీసులు 'గౌరీ' అనే పేరుగల ఓ గొర్రెని అరెస్టు చేశారు. కోర్టులో జడ్జి ఆ కేసును కొట్టేస్తూ యజమాని జిమ్ 440 ఆస్ట్రేలియన్ డాలర్లు చెల్లించాలని ఆదేశించాడు.

వైదేహి.

"నీళ్లలో తడిసిపోయిన డైరీలో అన్నయ్య మొబైల్ నెంబరు ఉంది. కానీ ఏం లాభం? ప్రకాష్‌కైనా ఫోన్ చేసి వాళ్ల నాన్న నెంబరు కనుక్కోవాలి"

"ఇప్పుడు అర్థాంతరంగా మీ అన్నయ్య నెంబరు ఎందుకేమిటి? "

రామారావు సమాధానమీయకుండా పాత ఎడ్రస్సుల పుస్తకం తిరగేయసాగేడు

"మన పొలంలో మంచి ఇల్లే కట్టుకున్నా రట కదా? " అడిగింది వైదేహి.

"మనం దానిని అన్నయ్యకి అమ్మేసేక అదింకా మన పొలం ఎందుకవుతుంది? "

"మీరు కోడిగుడ్డుకి వెంట్రుకలు పీకు తారు. మీతో వాదించడం అనవసరం" అంటూ వైదేహి చేతిలో ఉన్న తడితువ్వా లుని బలంగా విదిలించి, పడక గదిలోకి వెళ్లి తలుపేసుకుంది.

'మనం ఎలాగూ దానిలో ఏమీ పండిం చుకోలేం! దానిని అమ్మేస్తే ఎంతోకొంత వస్తుంది' అంది వనజక్క.

తనూ ఆమెతో ఏకీభవించేడు. తనకి, వనజకి ఆ పొలం అమ్మే ఉద్దేశం ఉందని కృష్ణారావు అన్నయ్యకి చెప్పారు.

'మీరు ధర నిర్ణయిస్తే నేను కొనుక్కుం టాను' అన్నాడు. వాకబు చేసి తనూ, వనజా ధర నిర్ణయించి చెబితే ఆ పైకం

ఇచ్చి కృష్ణారావు అన్నయ్య కొనుక్కు న్నాడు. దమ్మిడీ ఆదాయం లేని భూమి నుంచి ఎంతోకొంత వచ్చినందుకు వైదేహి ఆనాడు ఎంతో సంతోషం వ్యక్తపరచింది. ఈమధ్య ఇండియాలో భూముల ధరలు బాగా పెరిగేయని విన్న దగ్గర నుంచి 'మీ అన్నయ్య చాలా చవకగా కొనేశాడు అని వైదేహి బాహాటంగా అంటూ ఆ పొలం అమ్మకాన్ని తప్పుబడుతోంది' అనుకుంటూ ఎడ్రస్ పుస్తకాన్ని మడిచి కళ్లు మూసుకు న్నాడు రామారావు.

**ఇండియా:**

పగలంతా ఎండలో మండిపోయిన సూర్యుడు, నివురుగప్పిన నిప్పులా కృత్రిమ శాంతాన్ని ప్రదర్శిస్తూ కొండల మధ్య ఇరు క్కుపోయేడు. అతని కోపం గురించి విన్న మేఘాలు ఆమడ దూరంలో భయంతో కదలకుండా పేరుకున్నాయి.

సాయంకాలం ఆరుగంటల ముప్ఫయి నిమిషాలు చేతిగడియారం చూపిస్తుంటే పడమటిదిక్కున ఉన్న బాల్కనీలో కూర్చు ని ఆకాశాన్ని పరికించేడు కృష్ణారావు.

సూర్యుడు శాంతించి, విశ్రమించడానికి వెళ్లేక వద్దామని చీకటి తటపటాయి స్తోంది. రెండు చేతులకి, పాదాలకి దోమల బారినుంచి తప్పించుకోవడానికి 'ఓడోమాస్' రాసుకున్నా దోమలు కృష్ణా రావు మొహం చుట్టూ తిరుగుతూ కాస్త రక్తం పీలుద్దామని ప్రయత్నిస్తున్నాయి. ఎండాకాలంలో దోమలు ఉండవంటారు. కానీ అది నిజం కాదు అనుకుని దోమల్ని విదిలిస్తూ కుంగుతున్న సూర్యుడి వైపు దృష్టి నిలిపేడు. అలుపు లేకుండా, నిరం తరం దర్శనమిస్తున్న ఆయన కృప వలనే కదా ఈ ప్రపంచం బతుకుతోంది! చెట్లు, చేమలు, జీవరాశుల జీవనానికి ఆయనే కదా ఆధారం అనుకుంటూ ఎప్పటిలాగే అబ్బురపడ్డాడు కృష్ణారావు.

'తాంబూలం వేసుకున్నా నా నాలిక పూర్తిగా పండలేదు చూడు' అంటూ చిన్న పిల్ల నాలిక బైటికి పెట్టి చూపించిన రంగులా ఉన్న సూర్యుడు కొండల కిందికి క్రమేణా దిగుతుంటే చీకటి అలముకోవడం మొదలుపెట్టింది. విజృంభించిన దోమల తాకిడికి తట్టుకోలేక ఇంటిలోపలికి వచ్చి.. మందంగా, పేలవమైన కాంతితో వెలుగు తున్న బల్బ్‌ని చూడగానే అది ఇన్వర్టర్ మీద నడుస్తోందని అర్థమైంది. పెద్దసైజు ఇన్వర్టర్ పెట్టించుకోవడం వలన, కరెంట్ కోత ఉన్నా, ఏడెనిమిది గంటలు తనకి ఇబ్బంది కలగదు. ముప్ఫయి ఏళ్ల పైచి లుకు అమెరికాలో నివసించి రెండేళ్ల క్రితం ఇండియా తిరిగి వచ్చిన తనకి కొన్ని సమ స్యలు ఎదురయ్యేయి. అందులో విద్యుత్ కోత ఒకటి. అలాంటి చిన్న చిన్న సమస్య లకి ముందరే పరిష్కారం కనుక్కున్నాక తను ఇండియాకి మకాం మార్చేస్తున్నా నంటే కొడుకు ప్రకాష్, కూతురు శైలజలకి నచ్చలేదు.

'డేడీకి కాస్త పిచ్చెక్కింది.. హి ఈజ్ క్రేజీ. అక్కడ ఏం ఉందని వెళ్దామనుకుం టున్నాడు? యూ నో! అక్కడ తాగడానికి సరయిన నీళ్లు లేవు, పీల్చడానికి మంచి గాలి కూడా ఉండదు' అన్నాడు ప్రకాశ్.

'ఐ ఫుల్లీ ఎగ్రీ విత్ ప్రకాష్! నేను అన్న య్యతో పూర్తిగా ఏకీభవిస్తాను వాట్ డేడ్? ' అంది శైలజ, ముగ్గురి మధ్య నడి చిన కాన్ఫరెన్స్‌లో.

'అక్కడికి నే వెళ్లడం ఏమీ ఆశించి కాదు. మీరిద్దరూ నాలుగు రోజులు సెలవు పెట్టి ఇక్కడికి రండి! మనం చర్చిద్దాం!' అన్నాడతను.

'డేడీ! ఇల్లు మరమ్మతులు చేయిస్తు న్నాను. అరవైవేల డాలర్ల ఖర్చు. యూ నో! మనం దగ్గర ఉండి చూస్తే తప్ప ఏదీ సవ్యంగా జరగదు. ఇప్పుడు నేను ఎలా రాగలను? ' అన్నాడు ప్రకాష్.

'మా ఇంట్లో ఇద్దరు టీనేజర్స్ ఉంటే

అ
క్ష
రం

మొదటి విజయం సాధించిన తర్వాత
అలక్ష్యం చేయకండి
రెండో ప్రయత్నంలో అపజయం ఎదురైతే
మొదటి విజయం అయాచితంగా లభించిందని
అనేందుకు చాలామంది ఎదురు చూస్తుంటారు

– అబ్దుల్ కలామ్



వాళ్లని వదిలేసి ఎలా వస్తాను? డేడ్! నా పరిస్థితి అర్థం చేసుకో! అందరికీ అర్థమవవు నా ఇబ్బందులు' అంది శైలజ.

ప్రకాష్, శైలజలకి ఇబ్బందులున్నాయి. అవి ఎలాంటివి? అని తను బేరీజు వేయదలచుకోలేదు.

'డేడీ! నువ్వు త్వరలో ఏ దారుణమైన నిర్ణయమూ తీసుకోవని అనుకుంటున్నాం' అన్న మాటలతో కాన్ఫరెన్స్ ముగిసింది.

వాళ్లకి తెలిసిన ఆనవాయితీ ప్రకారం, పిల్లల్ని తల్లిదండ్రులు వదిలి దూరం వెళ్లిపోకూడదు. తన ప్రతిపాదన దానికి భిన్నంగా ఉండడంతో అది వాళ్లకి నచ్చకపోయినా ఆ ప్రతిపాదన వాళ్లలో తీవ్ర సంచలనం కలిగించిందని తను అనుకోలేదు. కానీ ప్రకాష్‌కొడుకు వినయ్, శైలజ కొడుకు ఉత్తమ్ "తాతా నువ్వు మకాం మారిస్తే ఎలా? సెలవుల్లో నీతో గడపడం ఎలా? ఉయ్ విల్ మిస్ యు! నువ్వు లేని లోటు మాకు బాగా కనిపిస్తుంది' అన్నారు ఆప్యాయంగా.

'అంతదూరం వెళ్లిపోతే నిన్ను ఎలా చూస్తాం? ' అనడిగేరు.

ఈవేళ ఆధారంగా మనం 'రేపు' గురించి అంచనా వేస్తాం. కానీ మనం 'ఆ రేపు'కి వెళ్లేసరికి ఆ రేపు మన అంచనాకి భిన్నంగా కొత్త రూపు ధరించవచ్చు ఇదే మీ కొత్తవిషయం కాదు. 'రేపు' గురించి అంచనా వేయకుండా ఇండియా వచ్చేడు తను. జ్ఞానం రాగానే తను అమెరికా వెళ్లిపోయేడు! అక్కడే చాలాకాలం జీవితం గడిచింది. ఇండియాలో జీవితం ఎలా ఉంటుంది? వదిలేసిన గతంతో తను ఏమైనా చేతులు కలపగలడా? ఏమీ ఆశించి రాలేదు అనుకుంటుంటే 'ఎలా ఉంటుందో? ' అన్న ఉత్సుకత ఆశించడం కాదా? అన్న ప్రశ్న ముందర నిలుచుంది. సరైన సమాధానంకోసం తడుముకుంటుంటే హఠాత్తుగా మొబైల్ మోగింది.

"ఈవేళప్పుడు తనకి ఫోన్ చేసే వారెవరు ఉంటారు? " అని ఆశ్చర్యపోతూ మొబైల్ చేతికి తీసుకున్నాడు.

"నేను బజాజ్ కంపెనీ నుంచి మాట్లాడుతున్నాను. మీకు ఇన్సూరెన్స్ గురించి, అందరికీ ఉపయోగపడే స్కీమ్‌ల గురించి.." అని వివరించబోతుంటే టక్కున కట్ చేసేడు కృష్ణారావు.

వెధవ ఎడ్వర్టయిజ్‌మెంట్ కాల్స్! 'స్వర్గానికి వెళ్లినా సవతి పోరు తప్పలేద'న్న సామెతలా అమెరికా వదిలినా ఇవి నన్ను వదలడం లేదనుకుంటుంటే ఇరవైరోజుల క్రితం చెన్నై విమానాశ్రయంలో జరిగిన సంగతి జ్ఞాపకానికి వచ్చింది. విమానాశ్రయంలో తను కూర్చున్న కుర్చీ వెనుక ముగ్గురు మాట్లాడుకుంటున్నారు. వాళ్ల సంభాషణలో అక్కడక్కడా బూతులు దొర్లుతున్నాయి.

'గురూ! ఉదయం లేదు.. మధ్యాహ్నం లేదు... రాత్రి లేదు.. ఈ లం...కులకి. మొబైల్‌లో ఎడ్వర్టయిజ్‌మెంట్‌లు దంచేస్తున్నారు! తెగ విసుగొస్తోంది'

'వాటిని బ్లాక్ చేయమని కంపెనీని అడక్కపోయారా? '

'అదీ చేసేను గురూ! కానీ పూర్తిగా

నివారణ లభించలేదు. కొత్త నెంబర్లతో కాల్స్ వస్తున్నాయి. గతంలో వచ్చిన కాల్ నెంబర్లని ఆపగలం కానీ కొత్తగా మొలుచు కువస్తున్న వాటిని ఆపలేం కదా? అంటూ కంపెనీ చేతులు దులిపేసుకుంది'

'గురూ! ఇదే అమెరికా అయితే 'మన స్తాపం', 'వల్లకాడు' 'వశిందిబ్బ' అంటూ ఏవేవో కారణాలు చెప్పి దావా వేయవచ్చు ఎంచక్కా! కాసిన్ని డాలర్లు వస్తాయి'

'నీ మొహం! అక్కడా ఉన్నాయి ఇలాంటి ఇబ్బందులు. వాటికి తోడు సవా లక్ష మోసాలు. ఇది నీకు చెప్పేనా? ఈమధ్య, మా మామయ్య అమెరికాలో అన్నకొడుకు దగ్గరకు వెళ్లేడు. కొడుకు, కోడలు ఆఫీసుకు, మనవడు, మనవరాలు స్కూళ్లకు వెళ్లేరు. మా మావయ్య గోళ్లు గిల్లుకుంటూ టెలివిజన్ చూస్తుంటే టెలి ఫోన్ మోగిందట. మనుష్యులతో మాట లాడడానికి ముఖం వాచిపోయి ఉన్న మా మామయ్య ఫోన్ ఎత్తేడట'

'నేను ఇన్‌కంట్యాక్స్ ఆఫీసు నుంచి ఫోన్ చేస్తున్నాను. మీరెవరు?' అన్నది వినిపించి మా మామయ్య తన గురించి చెప్పేడు. 'మీ అబ్బాయి ప్రభుత్వానికి వెయ్యి డాలర్లు బాకీ ఉన్నాడు. ఇప్పటికి రెండు నోటీసులు పంపేం! జవాబు రాలేదు. ఈవేళే చివరి గడువురోజు. ఈవేళ డబ్బు కట్టకపోతే పోలీసులు మీ ఇంటికి వస్తారు' అన్నారట అవతలి వైపు నుంచి.

'మా అబ్బాయి ఆఫీసుకి వెళ్లేడు. అతని నెంబర్ ఇస్తాను' అన్నాడట మామయ్య.

'మీ అబ్బాయి నెంబర్‌కి ఫోన్ చేసేం! ఎవ్వరూ ఫోన్ ఎత్తలేదు'

'మరి ఇప్పుడెలా?'

'మీ దగ్గర క్రెడిట్ కార్డు కానీ డెబిట్ కార్డు కానీ ఉంటే ఆ వెయ్యి డాలర్లు కట్టొచ్చు. ఆ నెంబర్లు చెప్పండి! మీ అబ్బాయి క్రెడిట్‌కార్డు నెంబరు ఇచ్చినా సరే. మీ అబ్బాయికి పోలీసు బాధ ఉండదు' అన్నారట.

మా మామయ్య దగ్గర క్రెడిట్ కార్డు లేకపోవడంతో 'నేను మా అబ్బాయితో మాటలాడతాను' అని ఫోన్ పెట్టేసేడు. 'గురూ! వెళదామా?' అన్నాడు రెం డోవ్యక్తి.

'వెళ్దాంలే గురూ! ఊc! తరువాత ఏం జరిగిందట?'

'అదో పెద్ద రాకెట్‌రు గురూ! క్రెడిట్ కార్డు నెంబర్లు సంపాదించి, వాటిని ఇంట ర్నెట్ మీద అమ్ముకునో, దానిమీద సా మాన్లు కొనుగోలు చేసో క్షవరం చేస్తారు'

'నిజంగా!? ఎన్ని సినిమాలు చూసినా నాకు ఆ ఇంగ్లీష్ యాస అర్థమవదు. మీ మామయ్య ప్రొఫెసర్ కాబట్టి అర్థం చేసు కున్నారు! అమెరికన్లు కూడా ఇలాంటి మోసాలు చేస్తారా?'

'అందరూ మోసాలు చేస్తారు. కానీ మా మావయ్య దగ్గర క్రెడిట్ కార్డు కూపీ లాగ డానికి ప్రయత్నించిన వ్యక్తి ఇండియన్ అట! ఇలా ఇండియన్ కుటుంబాలకి ఫోన్ చేసి భయపెట్టి డబ్బు రాబట్టే ప్రయత్నం చేసేది చాలా శాతం మనవాళ్లేనట! ఇది ఈ మధ్యని ఎక్కువయిందిట! మనవాళ్లు ఎలాగైనా తెలివైనవాళ్లు గురూ! పద! పద!' అంటూ మిగతా ఇద్దరినీ లేవదీసేడు. గేట్ వేపు వెళ్తున్న ఆ ముగ్గురినీ గమనిం చేడు తను.

మంచి దుస్తులు ధరించి, అధునాతన మైన కేబిన్ సూట్‌కేసులతో వెళ్తున్న ఆ వ్యక్తుల వయస్సులు బహుశా ముప్ఫయి ఐదేళ్ల దరిదాపులో ఉంటాయేమో! చదువు కున్నవాళ్లలాగే ఉంది వాళ్ల వాలకం. కానీ వాళ్ల సంభాషణలో అపసవ్యం కనిపిం చింది తనకి. అమెరికన్లు మోసం ఎక్కు వగా చేస్తారని మొదట వ్యక్తపరచిన వ్యక్తి, ఆఖరికి ఆ మోసం ఇండియన్లు చేస్తారని తెలిసేక 'మనవాళ్లు ఎలాగైనా తెలివైన

## చిన్న విషయాలు - పెద్ద భయాలు

చతుర సమగుటు

మనిషికో రకం భయం ఉంటుంది. విమానం ఎక్కడం, బొద్దింకలు, బల్లులు ఇలా అనేక భయాలు. కానీ చాలామందికి ఉండే భయాల గురించి బర్కిలీ యూనివర్సిటీ విద్యార్థులు చేసిన అధ్యయనం ఇది.

**ట్రాఫిక్ జామ్:** కొందరు ట్రాఫిక్ జామ్‌లో శాంతంగా కూర్చోగలరు. కానీ చాలామందికి ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుంటామనే భయం ఉంటుంది. దాహం, ఆకలి అనిపిస్తుంది. ఆ సమయంలో కోపం కూడా వస్తుంది.



**పబ్లిక్ స్పీకింగ్:** పది మంది ముందు నిలబడి మాట్లాడడానికి భయపడే వారు ఎందరో. చుట్టూ మనుషులు ఉంటే, మాట్లాడటం తెలిక కానీ, వేదిక మీది నుంచి ప్రేక్షకులని చూస్తే చెమటలు పోస్తాయి.

**పార్టీవేర్:** పార్టీకి ఏం తీసుకెళ్ళాలి అనే వత్తిడి చాలామందిలో ఉంటుంది. తను వేసుకెళ్ళేది అందరికీ నచ్చుతుందా? ఎబ్బెట్టుగా ఉంటుందా అనే భయం కలుగుతుంది. ఇందుకు కారణం, అందరి కంటే తన డ్రస్సే గొప్పగా ఉండాలనే వాంఛ!

**విమానంలో చప్పుళ్ళు:** విమానంలో ప్రయాణించేప్పుడు గేర్స్, తలుపులు, ఫ్లేప్స్, చక్రాలు మొదలైనవి చేసే చప్పుడుకి చాలా మంది భయంతో బిగుసుకుపోతారు.

**తేనెటీగలు:** తేనెపట్టుని చూడగానే చాలామంది భయంతో దూరం జరుగుతారు. ఎంత దూరంలో ఉన్నా తేనెటీగలు కుడతాయనే భయం ఎక్కువమందిలో కలుగుతుంది.

**రేష్:** చర్మం మీద దద్దుర్లు రావడం లేదా ఎర్రబడడంలాంటివి కనిపిస్తే ఏదో ప్రాణాంతక వ్యాధి వచ్చిందని చాలామంది భయపడతారు. ఇంటర్నెట్‌లో ఆరోగ్య విషయంలో అధికంగా సెర్చ్ అయ్యే అంశం ఈ రేష్‌లే!

**మంచు, వర్షం:** వాహనం డ్రైవ్ చేసేవాళ్ళు రోడ్డు మీద వర్షం పడ్డా, మంచుపడ్డా చక్రాలు జారి కంట్రోల్ తప్పుతాయని భయపడతారు.

వాళ్లు గురూ' అంటూ ప్లేటు ఫిరాయించేడు. అమెరికన్లు చేస్తే మోసం, ఇండియన్లు చేస్తే అది 'తెలివి' కింద ఎలా మారుతుంది?

'ఇతరుల గురించి పట్టించుకోకు! నీ సంగతే నువ్వు చూసుకో!' అన్న ధోరణి తను అమెరికాలో చాలాకాలం చూసేక, దానికే అలవాటు పడిన తనకి ఆ ముగ్గురి గురించి ఆలోచించాలని లేదు. కానీ ఆ ముగ్గురు ప్రదర్శించిన ద్వంద్వ ప్రవృత్తి, నేరాన్ని ఖండించకపోవడంతో వాళ్ల మీద తనకి దురభిప్రాయం ఏర్పడింది. అది ఎంత సమంజసమో తనకి తెలియదు. ఇండియాలో జీవనసరళి చూద్దామని వచ్చిన తనకి ఇది ఒక చిన్న అనుభవం' అనుకుంటుంటే..

బయట ఉన్న వేడిగాలి బలంగా తలుపుల మీద బాదుతూ లోపలికి వస్తానంటుంటే తలుపులు కిటికీలు వేయడంతో లోపల బందీ అయిన చల్లని గాలి 'ఆ వేడి గాలిని లోపలికి రానీయకు!' అంటూ కృష్ణారావుని వాటేసుకుని బతిమిలాడింది.

చల్లగాలి స్పర్శని అనుభవిస్తూ కళ్లుమూసుకున్నాడు.

బయట చిక్కని చీకటి, ఆకాశాన్ని, భూమి మీదున్న చెట్టుచేమల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

బెడ్రూంలో లైటు వెలుగుతోంది. వంట



గదిలో పనిమనిషి చేసిన చపాతీలు, కూర ఆహ్వానిస్తున్నా, ఆకలిగా లేక లేచి తినాల నిపించలేదు కృష్ణారావుకి. కళ్లు మూసు కుని మళ్లీ గతంలోకి జారేడు.

'ఇంజనీరింగ్ చదువుకి వెళ్తున్నావట కదా?' అనడిగింది శారద.

'అవును! వచ్చేనెల పదో తారీఖున ఖర గ్‌పూర్‌లో ఉండాలి'

'ఖరగ్‌పూర్ చాలాదూరం కదూ! దగ్గరలో ఇంజనీరింగ్ కాలేజీలు లేవా?'

'ఐఐటీల నుంచి డిగ్రీ తీసుకున్న విద్యా ర్థులకు భవిష్యత్తు బాగుంటుంది' అన్నాడు తను. ఖరగ్‌పూర్ ఐఐటిలో సీటు వచ్చిం దని, త్వరలో చేరబోతున్నానని మాస్టారుకి తెలియపరచి తిరిగి వస్తుంటే శారదతో జరిగిన సంభాషణ అది.

శారద ఏమనుకుంటుందోనని ఆమె వేపు పరీక్షగా చూసేవాడు కాదు. శారద తనని పరీక్షగా గమనిస్తుందని తనకి తెలుసు. అయినా అదోరకమైన పిరికితనం ఆమెని గమనించనిచ్చేది కాదు. అప్పుడు తన వయస్సు కేవలం పదిహేడేళ్ళు!

నాలుగేళ్ళు గడిచేయి.



తను 'రాబోయే రోజుల' గురించి ఉత్సాహపడి ఊహించింది బోల్తాపడడంతో వర్జీనియా యూనివర్సిటీలో స్కాలర్‌షిప్ రాగానే ఎవరినీ సంప్రదించకుండా అమెరికా వచ్చేశాడు. శుభఘడియల కోసం ఎదురుచూస్తున్న వనజని, ఇంజినీరింగ్ కోర్సు చేయడానికి తయారవుతున్న రామారావుని, ఆర్థిక భారంతో కుంగిపోతున్న తండ్రిని వదిలి అమెరికా వచ్చేడు తను. 'స్వార్థపరుడు', 'పిరికివాడు' 'తనదారి తను చూసుకున్నాడు' అని అందరూ తనని వేలెత్తి చూపిస్తారని, చూపించేరని తెలుసు. 'పిరికితనం' తనలో ఉన్న మాట నిజమే కానీ, తను అమెరికా రావడానికి నూటికి నూరుపాళ్ళు కుటుంబానికి సహాయపడదామనే! ఎప్పుడో బొంబాయిలోనో, ఢిల్లీలోనో ఉద్యోగం చేస్తూ ఆర్థికంగా తను కుటుంబాన్ని ఆదుకునే దానికంటే అమెరికా వెళ్తేనే ఎక్కువ సహాయం చేయగలననిపించింది. ఊహించిన దానికి భిన్నంగా కుటుంబాన్ని వదిలేసినందుకు తండ్రి ఎంత బాధపడి ఉంటాడో, అది ఆయనని ఎంత కుంగతీసిందో! తండ్రిని తలుచుకున్న కృష్ణారావు కళ్ళలోంచి చెమ్మ

ఉబికింది. టేబుల్ మీదున్న టిష్యూ పేపర్ తీసుకుని కళ్ళు ఒత్తుకుని తిరిగి ఆలోచనలో పడ్డాడు కృష్ణారావు.




***కాలిఫోర్నియా:***

ఇంటర్నెట్‌లో ఇండియాలో నడుస్తున్న రాజకీయాలు, విశృంఖలంగా జరుగుతున్న అత్యాచారాల గురించి మనస్సు కుంచించుకుపోతూ చదువుతుంటే..

"ఎంతసేపూ ఆ కంప్యూటర్ పట్టుకుంటారు, లేకపోతే కడుపు పట్టుకుంటారు. ఒక మాటామంతీ లేదు. పని ఎక్కువై నేను, పనిలేక గోళ్ళు గిల్లుకోలేక మీరు అలసిపోతున్నాం! వచ్చి ఈ దొండకాయలు తరగండి" అంది వైదేహి.

ఏం సమాధానం ఇవ్వాలో స్ఫురించక, జోళ్ళు వేసుకుని ఇంట్లోంచి బైటపడ్డాడు రామారావు. ఈవేళ దొండకాయలు తరగండి అంది, రేపు ఇంకేమంటుందో! దొండకాయలు తనెప్పుడూ తరగలేదు. అయితే అదేమీ బ్రహ్మవిద్య కాదు, తను సునాయాసంగా తరగగలడు.

'మీకేమీ పనిలేదు! వచ్చి దొండకాయలు తరగండి!' అనే బదులు 'ఏవండీ! ఒకేసారి రెండు మూడు పనులతో సతమతమవుతున్నాను. కాసిన్ని దొండకాయలు తరగరూ!' అంటే తను చప్పున రంగంలోనికి దూకేవాడు. ఆఫ్టరాల్ దొండకాయలు!

కొడుకు దగ్గర ఉండడానికి తనూ, వైదేహి ఇష్టపడే వచ్చేరు. ఇక్కడ ఉంటున్నప్పుడు ఇంట్లో ఏదోవిధంగా సాయపడాలి. కానీ తాము చేస్తున్న సహాయమేమిటి? వైదేహి ఇంటిలో వంట బాధ్యత తీసుకుంది. తనూ, వైదేహి ఇంటికి కాపలా కాస్తున్నాం. ఛ! అలా ఎందుకనుకోవాలి? కొడుకు, కోడలు ఉద్యోగరీత్యా వెళ్ళడం, మనవడు స్కూల్‌కి వెళ్ళడంతో ఇల్లంతా ఖాళీ! తాము ఇంట్లో తచ్చాడుతుంటే లారీలలో వచ్చి ఇంట్లో సామాన్లు ఎవ్వరూ పట్టికెళ్ళలేరు.

తను ఇంజినీరింగ్‌లో ప్రొఫెసర్‌గా పనిచేసినా భిన్నాల కూడికల గురించి బోధించబోతే 'తాతగారూ! మీరు చాలా స్పీడ్‌గా స్టెప్స్ వేస్తున్నారు. అంత త్వరగా చేస్తే నాకు అర్థమవదు' అన్నాడు అనంత్. ఖంగుతిన్నాడు తను. ఇంగ్లీషు సరేసరి! 'యాస' 'యాస' అని ఒకటే పగలపడిన వ్వడం. పోనీ ఇండియాలోలా కూరగాయలు తెద్దామా? అనుకుంటే దానిలో రెండు చిక్కులున్నాయి. ఒకటి కూరగాయలు మోసుకురావాలి? ఏ కూరలు నచ్చుతాయో కొడుకు, కోడలు చెప్పరు! తనకి తట్టదు! అదీకాక 'మేం ఆర్గానిక్ కూరలే కొంటాం' అంది కోడలు ఉష ఒకసారి. ఆ 'ఆర్గానిక్' కూరల ఖరీదు ఎక్కువ. 'వినోద్! కూరలు తెస్తాను డబ్బు ఇయ్యి' అని తను అడగలేదు. ఇండియాలో తనకి వచ్చే పెన్షన్ డాలర్లలో లెఖ్ఖ వేస్తే దాదాపు ఆరువందలు. కానీ రూపాయలు డాలర్లలోకి మారవు. అవి అమెరికా దృష్టిలో దాదాపు చిల్లరపెంకులు. మరి ఎలా అని మథనపడి అడుగులు వేస్తుంటే కడుపులోనొప్పి మొదలవుతోంది. వెంటనే వెనుదిరిగి ఇల్లు చేరుకుని తలుపు తట్టేడు.

"చేతకాని వాడికి చేటడంత శౌర్యం-అన్నట్లుగా అప్పుడే వచ్చేసేరేం? " అంటూ తలుపు తెరిచిన వైదేహి, భర్త మొహం చూసి దండకం చదవడం ఆపింది.

కడుపులోంచి వెలువడుతున్న 'గుడగుడ' శబ్దాన్ని, నొప్పిని అదుపులో ఉంచడానికి రామారావు స్నానాల గదిలో ఉన్న మందుల కేబినెట్ తెరచి ఎదురుగా కని పించిన 'జెలోసిల్' మందుసీసా అందుకు న్నాడు. సీసాలో రెండు చెమ్చాల కంటే ఎక్కువ మందు లేకపోవడం చూసి, ఒక చెమ్చా తాగి, బైటకి వస్తూ మరో డోస్‌తో ఈ మందు అయిపోతుంది. తరువాత ఎలా? తనకి 'జెలోసిల్' మందు గతంలో బాగా పనిచేసింది. తనతో తెచ్చుకున్న నాలుగు బాటిల్స్‌లో ఇది ఆఖరిది. ఇలాంటి మందు ఇక్కడ దొరుకుతుందా? ప్రిస్క్రిప్షన్ లేకుండా ఇస్తారా? ఇంటర్నె ట్‌లో ఈ సంగతి ఆరా తీయాలి. రోజూ తను నడిచే దారిలో దాదాపు అరమైలు దూరంలో 'సి.వి.ఎస్. ఫార్మసీ' బోర్డు చూసేడు. అక్కడ మందు దొరికితే కొని తెచ్చుకోవచ్చు. దొరకకపోతే ఇంకా దూరం వెళ్ళాలి. తను అంతదూరం నడచి వెళ్ళగ లడా? ఏమిటీ ఈ అవాంతరం వచ్చిప డింది? అనుకుంటూ సోఫాలో కడుపుప ట్టుకుని కూలబడ్డాడు రామారావు. ఆలోచ నలు ఊపందుకున్నాయి.

కడుపులో గుడగుడ శబ్దం ఉధృతం తగ్గినా నొప్పి చప్పపడలేదు. సి.వి.ఎస్. ఫార్మసీలో మందు దొరకకపోతే ఇంకో మందుల దుకాణానికి వినోద్‌ని తీసుకెళ్ళ మని అడగాల్సివస్తుందేమో! వినోద్ మీద ఆధారపడడం తనకి నచ్చదు. ఒకరిమీద ఆధారపడకుండా మనమీద మనం ఆధార పడాలి అనుకునేవాళ్ళలో తనొకడు. అమె రికాలో చదువుకుందామన్న బలీయమైన కొర్కె తీరకుండానే జీవితం గడిచిపో యింది. కృష్ణారావు అన్నయ్య సహా యంతో తను అమెరికా వెళ్ళేవాడే. మన మీద మనం ఆధారపడాలి అన్న ఊహ బలంగా ఉండడంతో తనెప్పుడూ అన్నయ్య దగ్గర అమెరికాలో చదువు గురించి ఉత్సాహం ప్రదర్శించలేదు. కృష్ణారావు అన్నయ్య తనంతట తాను ఆ ప్రతిపాదన చేయలేదు. అన్నయ్యకి వచ్చిన అవకాశం తనకి రాలేదే అని తను చాలాకాలం మథనపడ్డాడు. ఇంజినీరింగ్ ముగించి, మంచి ఉద్యోగంలో త్వరత్వరగా పైకి ఎది గినా అమెరికాలో ఉద్యోగం చేసి ఉంటే ఇంకా రాణించేవాడినని తను చాలాసార్లు అనుకున్నాడు. తనలో ఉన్న ప్రతిభకి గుర్తింపు వచ్చేదన్న నమ్మకం ఉండేది. తనతో చదువుకున్న స్నేహితులు ఇండియా వచ్చినప్పుడు అమెరికాకి వలస వెళ్ళి వచ్చిన అవకాశాలని ఎలా ఉపయోగిం చుకున్నారో వివరిస్తుంటే తన మనసు చివుక్కుమనేది. 'నీకేం గురూ! ఇక్కడ నీ ఉద్యోగం, పరపతి చాలా విశిష్టమైనవి' అని వాళ్ళు అన్నపుడు తన మనస్సు శాంతించకుండా రవ్వంత ఈర్ష్యపడేది. ఈర్ష్య స్నేహితులని చూసి కాదు, అది తన జీవితంలో రాలేదే అని! తనకి రాని అవ కాశం కొడుక్కి వచ్చేసరికి తను ఆనందప డ్డాడు, తెగ సంబరపడ్డాడు. అమెరికా వెళ్ళ డానికి కొడుకు సంశయిస్తుంటే, మోతాదుకి మించి ప్రోత్సహించి అమెరికాకి పంపిం చేడు. ఉన్న ఒకే ఒక కొడుకు దూరమవ బోతున్నాడని వైదేహి చెప్పినా పెడచెవిని పెట్టేడు. 'లేని దాని మీద మోజు అపరి మితం' అన్న సామెతలా తనలో వెలితిని కొడుకు పురోగమనంతో పూడ్చ ప్రయత్నిం చేడు. ఆ ఆలోచనలో లోపం ఉందని, ఉంటుందని తను గ్రహించలేదు. ఆ వెలితిలోంచి వచ్చిన జ్వాల తనని సొంతం కుదిపేయడంతో ఇతర విషయాలలో తనకి ప్రాముఖ్యం కనపడలేదు. పదవీ విరమణ చేసేక కొడుకు దగ్గరికి వచ్చి రెం డేళ్ల పైనే అయింది. నునుపుగా కనిపించే దూరపు కొండలు దగ్గరకు రాగానే ఎగుడు దిగుడుగా కనిపిస్తాయన్నట్లు అమెరికాలో నివసించడం మొదలయ్యేక, ఇక్కడి జీవి

తంలో లోతుపాతులు తెలుస్తున్నాయి.. అనుకుంటూ కడుపు నిమురుకున్నాడు రామారావు.

"నొప్పి ఇంకా తగ్గలేదా? వామకాయ నీళ్ళు ఇచ్చేదా" అనడిగింది వైదేహి, భర్త ఇంకా కడుపు పట్టుకోవడం చూసి.

అడ్డంగా తల ఊపేడు రామారావు.

"మీకు ఈమధ్యకాలంలో కడుపు నొప్పి తరచూ వస్తోంది. జెలోసిల్ మందు తాగేస్తున్నారు. వ్యాధి మూలం తెలుసుకోకుండా సొంత వైద్యం మంచిది కాదు. ఒకసారి డాక్టర్‌ని సంప్రదించకూడదూ?" అంది వైదేహి.

"ఇది ఇండియా కాదు.." అంటూ సంభాషణని తుంచి, వైదేహి ఆరాటాన్ని గమనించడానికి ఇష్టపడక రామారావు కళ్ళు మూసుకున్నాడు.

భర్తతో వాదన పెంచడం ఇష్టం లేక, ఎదురుగా కూర్చుని ఆయన బాధ చూడలేక వంటింటి వేపు నడిచింది వైదేహి.

★ ★ ★

"అలా పిల్లిలా లేచి కాఫీ కలుపుకోకపోతే నన్ను లేపొచ్చు కదా!" అంది వైదేహి.

స్టౌమీద నీళ్ళు కాచుకుంటున్న రామారావు "ఆ ఇన్‌స్టెంట్ కాఫీ వద్దు. తాగలేను. అందుకే టీ కలుపుకుంటున్నాను. మామూలుగా లేచే సమయానికి ముందే మెలకువ వచ్చింది. నిన్ను లేపడమెందుకని నేనే కలుపుకుంటున్నా" అంటూ కప్పులో నీళ్ళు పోసి టీ బేగ్‌ని అందులో జారవిడిచేడు రామారావు.

"సర్లేండి! వాదనెందుకు? మనం గట్టిగా మాట్లాడుతుంటే వాళ్ళకి నిద్రాభంగం" అంటూ తిరిగి బెడ్రూంలోనికి వెళ్తూ భర్త కడుపునొప్పి నుంచి తేరుకున్నందుకు భగవంతునికి మనస్సులోనే నమస్కారాలు అర్పించింది వైదేహి.

ఇంటర్నెట్‌లో చూసి జెలోసిల్ మందు మేరీ వీధిలో ఉన్న సి.వి.ఎస్.ఫార్మసీలో దొరుకుతుందని తెలిసేక రామారావు మనసు కుదుటపడింది. 'నడకకి వెళ్ళేటప్పుడు మందు కొని తెచ్చుకోవాలి' అనుకుంటూ చేతిలో టీ కప్పుతో హాలులోకి నడిచేడు.

★ ★ ★

"ఏడు డాలర్ల ఇరవై సెంట్లు" అంది కౌంటర్‌లో సామాన్లని వెలకట్టే పిల్ల.

పది డాలర్ల నోటు అందిచ్చేడు.

"ఏడు డాలర్ల ఇరవై సెంట్లూ.. పది డాలర్ల లోంచి" అంటూ సొరుగులోంచి రెండు డాలర్లు, ఎనభై సెంట్లు అందిస్తూ.. "థ్యాంక్స్" అంది.

జెలోసిల్ మందుతో ఉన్న సంచీ ఊపుకుంటూ నడుస్తుంటే 'నీ ఆఖరి నూరు డాలర్లు తరిగిపోతున్నాయి' అంటూ మెదడు హెచ్చరించింది. మాల్ ప్రాంగణంలోంచి నడిచి వెళ్తున్న రామారావుకి స్టార్‌బక్స్ దుకాణం కనిపించగానే ఏమాత్రం సంకోచించకుండా లోపలికి ప్రవేశించేడు. అతిథులకి వివిధ రకాల కాఫీలని సమకూరుస్తూ, ఎక్కడా విసుగు ప్రదర్శించకుండా పనిచేస్తున్న పనివాళ్ళని కాస్సేపు గమనించేక, దృష్టిని రోడ్డుమీదకి మళ్ళించేడు. యథాప్రకారం, ఎడతెరపిలేకుండా గంటకి దాదాపు అరవై- డెబ్బయి కిలోమీటర్ల వేగంతో మేరీ రోడ్డు మీద వాహనాలు దౌడుతీస్తున్నాయి. రామారావు కూర్చున్న చోటుకి దగ్గరగా ఉన్న టేబుల్ మీద కూర్చున్న ఇద్దరి మధ్య నడుస్తున్న చర్చ రామారావు చెవిన పడుతోంది. "ఈ నెలలో రెండులక్షల ఏభైవేల ఉద్యోగాలు ఏర్పడ్డాయి. నిరుద్యోగుల సంఖ్య బాగా తగ్గింది" అన్నాడు ఒకడు.

"ఆc! నా బొంద! అవన్నీ సగం నిజాలు. చాలామంది ఇహ ఉద్యోగాలు దొరకవని తమ పేర్లని నిరుద్యోగుల పట్టీలో నమోదు చేసుకోడం లేదు. నీ సిద్ధాంతం ప్రకారం అమెరికన్ ఆర్థిక పరిస్థితి బాగుండాలి. కానీ ఈ మధ్యనే ప్రపం

## జైలుకి ఎన్ని ద్వారాలో!

చతుర

జైలుకి వెళ్ళాలని ఎవరూ అనుకోరు. కానీ కావాలని అనేకమంది జైలుకి వెళ్ళిన సందర్భాలు ఉన్నాయి. అందులో కొన్ని..

★ అమెరికాలోని శాక్రిమెంటో కౌంటీకి చెందిన లోపెజ్(31) డిప్యూటీ షెరీఫ్‌ని అకారణంగా చెంపలు వాయగొట్టింది. ఆమెని జైల్లో పెట్టారు. ఆమె సిగరెట్‌కి దూరమవ్వాలని ఆ పని చేసింది!



★ కెనడాలోని మానిటోబాకి చెందిన 13, 14 ఏళ్ళ ఇద్దరు పిల్లలు రాయల్ కెనడియన్ మౌంటెడ్ పోలీస్‌స్టేషన్‌కి నిప్పు పెట్టారు. జైలుకి వెళ్ళిన తమ మిత్రుడు విన్నీపెగ్‌ని కలుసుకోడానికి వాళ్లా నేరం చేశారు .

★ నార్వేలోని హేల్డన్‌జైలులో మినీ ఫ్రిజ్‌లు, ఫ్లాట్‌స్క్రీన్ టీవీలు, అటాచ్డ్ బాత్‌రూములు ఉంటాయి. అనేకమంది సౌకర్యవంతమైన ఆ జైలులో గడపేందుకు నేరాలు చేస్తుంటారు.

★ అమెరికాలోని జైళ్ళలో మగ్గే అక్రమ వలసదారుల కథలని తెలుసుకోడానికి మార్కో, మార్టినెజ్ అనే మెక్సికన్లు, ఫ్లోరిడాలో డబ్బు లేకుండా బార్‌లో తాగి జైలుకి వెళ్ళారు. బయటకి వచ్చాక ఆ కథలని పుస్తకంగా రాశారు.

★ న్యూయార్క్‌లో హేమ్‌హెస్ట్‌కి చెందిన ఫ్రాంక్(46)కి లుకేమియా వ్యాధి వచ్చింది. హెల్త్ ఇన్సూరెన్స్ లేకపోవడంతో కావాలని డ్రగ్స్ నేరంలో పట్టుబడ్డాడు. ఖైదీలకి అక్కడ చికిత్స ఉచితం!

★ గొంజావెజ్(36) అనే వ్యక్తి న్యూయార్క్‌లోని వత్తిడి జీవితంలోంచి బయటపడడానికి టెలిఫోన్ బూత్‌లోని డైరెక్టరీని తగలబెట్టి అరెస్ట్ అయ్యాడు. రెండువారాలు జైల్లో గడిపాక అతని బిపి నార్మల్‌కి వచ్చింది.

★ జార్జియాకి చెందిన బ్రౌన్‌కి ఇల్లులేదు. ఆకలితో రోడ్డమీద మూడురోజులు అల్లాడాక, కావాలని బేంక్‌లో దొంగతనానికి ప్రయత్నించి పట్టుబడి జైలుకి వెళ్ళాడు. పదేళ్ళ శిక్ష పడింది.

★ ఒహాయోకి చెందిన జార్జ్ అనే వ్యక్తి ఓ ఆడ పోలీస్‌ని గాఢంగా చుంబించి అరెస్ట్ అయ్యాడు. కారణం, ఎక్స్‌పీరియెన్స్ ప్రాజెక్ట్ డాట్ కామ్ అనే వెబ్‌సైట్‌లో ఖైదీగా అనుభవాలు రాయడానికి!

చంలో ప్రథమస్థానాన్ని కోల్పోయింది" అన్నాడు రెండోవాడు.

"గుడ్డిలో మెల్ల మనకి ఉద్యోగాలు ఉన్నాయి. ఉద్యోగంలోంచి మనల్ని ఇప్పట్లో తీసేయరు. క్రితంసారి నాకు ఉద్యోగం పోయినపుడు నా భార్య రోజీ నన్ను విడిచి వెళ్ళిపోయింది. ఇంకే మార్గంలేక నాలుగు నెలల పాటు నా తల్లితండ్రుల దగ్గర ఉంటూ యూనివర్సిటీలో రెండు కొత్తకోర్సులు చేసేను. ఉద్యోగం పోవడంతో నాపై పడిన మానసిక దెబ్బ ఇంకా పచ్చిగానే ఉంది. సంవత్సరంలో వచ్చిన ఆదాయం కంటే ఎక్కువ ఖర్చుపెడుతోంది ప్రభుత్వం. ఆ లోటు భర్తీకి ప్రభుత్వం ప్రజల దగ్గర అప్పులు చేస్తోంది. సుఖాలకి అలవాటుపడ్డ ప్రజల వలన దిగుమతుల కంటే ఎగుమతులు తక్కువ అవడంతో పై దేశాలకి అప్పు పడుతున్నాం. దీనివలన దేశానికి హాని అంటారు. ఆస్పత్రులలో సేవల ఖరీదు గురించి చెప్పనక్కర్లేదు.. భయమేస్తోంది"

"వెళదామా? హైవే ఎనిమిది వందల ఎనభైలో రద్దీ తగ్గిందని నా కంప్యూటర్ చెబుతోంది, పదపద" అంటూ రెండో వ్యక్తిని లేవదీసేడు.

ఇద్దరూ కదలి వెళ్ళేరు.

ఆ ఇద్దరి చర్చలో నిజానిజాలు ఎలా

గున్నా, వాటిలో ఒక అంశం రామారావులో అలజడిని కలిగించింది. 'హాస్పిటల్ సేవల ఖరీదు చెప్పనఖ్ఖరలేదు' అన్నాడు ఆ ఇద్దరిలో ఒకతను. వాళ్లు ఉదహరించినది ఇన్సూరెన్స్ ఉండి హాస్పిటల్‌లో సేవలకి వెళ్ళే రోగుల గురించి కానీ తన వంటివాళ్ళ సంగతేమిటి? వినోద్‌కి ఉన్న ఆరోగ్య బీమాపథకం లిస్ట్‌లో తనూ, వైదేహి ఉన్నామా? వైదేహి, తను అమెరికాకి తరలి వచ్చేక తల్లిదండ్రులని ఆ పథకంలో చేర్చడానికి అదనంగా ఎన్ని డాలర్లు కడుతున్నాడు? తను జబ్బు పడితే ఏమవుతుంది? వినోద్‌ని అడగాలి ఈ సంగతి. ఇక్కడ ఆరోగ్యబీమా లేనిదే హాస్పిటల్‌లో చేర్చుకోరని తనకి తెలుసు. కడుపులో గుడగుడ శబ్దాన్ని జెలోసిల్ తాగి జయిస్తున్నాడు ఇంతవరకు. అది వీలవకపోతే ఏమవుతుంది? అని కంగారుపడుతూ కాఫీ తాగడం పూర్తిచేసి, ఖాళీ గ్లాసుని డబ్బాలో గిరాటేసి ఇంటి ముఖం పట్టేడు రామారావు.

**ఇండియా:**

చపాతీముక్కని కూరతో నోట్లో పెట్టుకోగానే కారం నషాళానికి అంటింది. లేచి కుండలోంచి గ్లాసుడు నీళ్ళు తాగేడు కృష్ణారావు. 'నాకు మషాలాలు పడవు! కారం తక్కువ వెయ్యి!' అని వంట చేసే కొండడి మేనకోడలికి రెండుసార్లు చెప్పేడు తను.

'తక్కువే వేస్తున్నా. అయినా ఆ మాత్రం కారం పడకపోతే రుచి ఉండదు' అని సమాధానమిచ్చింది ఆమె.

'బాగా తక్కువ కారం వేయమని ఈ తూరి కొండడి చేత చెప్పించాలి' అనుకుని కూరలో పెరుగు గుమ్మరించుకుంటే కారం తగ్గలేదు కానీ చల్లపడినట్లనిపించి భోజనం కానిచ్చేడు.

కొండడు తనతో ఆరోతరగతి వరకు చదివాడు. తరువాత చదువుకి స్వస్తి చెప్పి కులవృత్తిని చేపట్టాడు. 'అమెరికాలో కుండలు చేస్తారా? అమెరికా నుంచి మీ తిరుగురాక ఎప్పుడు? వనజమ్మగారి పెళ్ళి, మీ తమ్ముడి చదువు మీ నాన్నగారి మీద వదిలేసి వెళ్తున్నారు' అన్నాడు కొండడు, తను అమెరికా వెళ్ళేముందు.

'అందరి మంచి కోసమే వెళ్తున్నాను' అన్నాడు తను. అంతకన్నా వివరణ ఇవ్వడం ఇష్టంలేదు తనకి.

'అమెరికా వెళ్ళిన వాళ్ళు సాధారణంగా తిరిగి రారు. మీ అక్కయ్య పెళ్లయిపోతే, మీ తమ్ముడు మీలాగే కడుపు పట్టుకు వెళ్ళిపోతే, మీ నాన్నగారు ఒంటరి వారైపోతారు. ఇది మీకు తెలియదని కాదు' అంటూ చెప్పిన దానినే మరోలా చెప్పి ఊరుకున్నాడు కొండడు.

అమెరికా చేరిన కొత్తలో.. దాదాపు ముప్ఫయి ఐదేళ్ళ క్రితం 'ఇక్కడ కుండలు చేస్తారా? ' అని వాకబు చేయగా 'చేస్తారు కానీ పెద్ద పట్టణాలలో వాటిని చేయడం కనిపించదు' అన్నారు సహోద్యోగులు. కాలం చాలా మార్పులని తెస్తుంది. ఇండియాలో కూడా వంశపారంపర్యంగా చేపట్టే పనులు చేయడానికి చాలామంది ఇష్టపడడం లేదు. అందుకు కొండడి కొడుకే ఉదాహరణ. కుండలు చేయడానికి ఇష్టపడక, చదువు పూర్తిచేసి విజయనగరానికి దగ్గరగా ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తూ, అక్కడకి దగ్గరగా కాపురం ఉంటున్నాడు.

'మీ నాన్నగారు ఒంటరివారయిపోతారు' అన్న కొండడి పరిస్థితి ఏమిటి? కూతురు కాపురానికి వెళ్ళింది, కొడుకు పట్నం గడప తొక్కేడు. అలనాటి కొండడికి తను ఒంటరినవుతానని స్ఫురించకపోవచ్చు. లాభసాటి కాదని కులవృత్తులని వదిలేసి చాలామంది భార్యాపిల్లల్ని పోషించడానికి ఉద్యోగపు వేటలో పడుతున్నారు. 'దేశ సంస్కృతి' మారుతోంది. పాత సంస్కృతిని కాపాడడం ఎదుట వ్యక్తి కర్తవ్యం అని పెద్దలుగా చెలామణీ అయే వ్యక్తులు ఉపన్యాసాలు దంచుతారు.

# గోల్డెన్ గేట్ బ్రిడ్జి

ప్రపంచంలోగల సస్పెన్షన్ బ్రిడ్జ్‌లలో ప్రముఖమైనది శాన్‌ఫ్రాన్సిస్కోలోని గోల్డెన్ గేట్ బ్రిడ్జి. దీని గురించిన కొన్ని నిజాలు.

★ ప్రపంచంలో అత్యధికంగా ఆత్మహత్యలు జరిగే ప్రదేశాలలో ఇది మొదటిది. సగటున రెండువారాలకి ఒకరు చొప్పున ఈ బ్రిడ్జి మీది నుంచి నీళ్లలోకి దూకి మరణిస్తారు.

★ గోల్డెన్ గేట్ బ్రిడ్జికి వేసే ఆరెంజ్ రంగుకి 'ఇంటర్నేషనల్ ఆరెంజ్' అని పేరు.



★ గోల్డెన్ గేట్ బ్రిడ్జి కింద ఓ న్యూడ్ బీచ్ ఉంది!

★ దీని నిర్మాణంలో ఉపయోగించిన పొడవైన కేబుల్స్‌తో (అనేక తీగల సముదాయమే కేబుల్) ప్ర పంచాన్ని మూడుకన్నా ఎక్కువసార్లు చుట్టొచ్చు స్తంభాలు లేకుండా నిర్మించే బ్రిడ్జికి సస్పెన్షన్‌బ్రిడ్జి అని పేరు. రెండువైపులా తీగలతో లాగి నిర్మించేందుకు ఎక్కువ తీగలను వాడతారు.

★ గోల్డెన్ గేట్ బ్రిడ్జి మీది నుంచి నీళ్లలోకి దూకే వారిలో సగటున రెండుశాతం మాత్రమే బతుకుతారు.

★ 1970లలో ఒకరు ఇక్కడ ఆత్మహత్య చేసుకున్నాక, అతను వదిలి వెళ్ళిన లేఖలో ఇలా ఉంది. 'నేను ఈ బ్రిడ్జి మీద నడిచేప్పుడు దారిలో ఒక్కరైనా నన్ను చూసి పలకరింపుగా నవ్వితే నేను దూకను!

★ 1994 నించి హైవే పెట్రోల్ ఆఫీసర్ కెవిన్ బ్రిక్స్ ఇంతదాకా సుమారు 200 మందితో మాట్లాడి వారి ఆత్మహత్య ప్రయత్నాన్ని విరమింపచేసి వెనక్కి పంపాడు.

★ నేడు గోల్డెన్ గేట్ బ్రిడ్జి నిర్మాణం చేపడితే దానికి 1200 కోట్ల డాలర్లు ఖర్చవుతుంది.

★ విక్టోరియా సీక్రెట్ (లేడీస్ గార్మెంట్స్) కంపెనీ స్థాపకుడైన రాయ్ రేమండ్ 1993లో ఈ బ్రిడ్జి మీది నుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు.

★ అమెరికన్ సొసైటీ ఆఫ్ సివిల్ ఇంజనీర్స్ ప్రకారం గోల్డెన్ గేట్ బ్రిడ్జి అమెరికాలోని సెవెన్ ఇంజనీరింగ్ వండర్స్‌లో ఒకటి.

★ అమెరికాలో అత్యధికంగా ఫొటో తీసుకునే ఈ బ్రిడ్జిని 1937లో తెరిచారు.

చతుర సమగతులు

'అబ! ఏమిటోనండి! ఫ్రిజ్‌లో ఉంచిన నీళ్ళతో దాహం తీరడంలేదు. అదీకాక ఒక రకమైన వాసన వస్తోంది' అని కుండలు అమ్మే దుకాణానికి దూరంగా కారు ఆపి కుండల్ని పరిశీలిస్తూ 'ఈ చిన్నకుండకి అరవై రూపాయలా? ఏముందయ్యా దీనిలో మన్ను తప్ప!' అంటుంది స్లీవ్‌లెస్ వేసుకుని ఎండలో ఉస్సురంటున్న ఒక స్త్రీ. వేసవికాలంలో, ఆ రెండు నెలల్లోనే కుండలకి గిరాకీ. ఇతర రోజులలో అంతంత మాత్రమే అమ్ముడవుతాయి అని ఆమెకి తెలియదా? అదే స్త్రీ, మాల్‌కి వెళ్ళి పూత పోసి అందంగా పిండి బొట్లు పెట్టిన బ్రెజీలియన్ మట్టిచిప్పని వెయ్యిరూపాయలు పెట్టి కొనడానికి వెనుదీయకపోవచ్చు. సంఘంలో వస్తున్న మార్పుల్లో కొందరు నలిగిపోవడం సామాన్యమే. పరిగెడుతున్న రైలుని అందుకోవాలంటే మనమూ పరుగుపెట్టాల్సిందే. 'మీకు ఈ దేశంలోనే మంచి ఉద్యోగం వస్తుంది కదా? మరి మీరెందుకు అంత దూరం వెళ్తున్నారు? ' అనడిగేడు కొండడు.

'దగ్గరగా ఇంజినీరింగ్ కాలేజీలు లేవా? అంతదూరం ఎందుకువెళ్తున్నారు' అనడిగింది శారద ఖరగ్‌పూర్ వెళ్తున్న తనని.

ఆ రెండు ప్రశ్నలకి తన దగ్గర ఆనాడు ఉన్నది 'తొందరగా పురోగమించవచ్చు'

## కొత్తగాలి... 

**పైకముంటేనే**
**పలకరింపు**
**లేదంటే**
**చీదరింపు!**

– సాధనాల నాగవర్ధని,
నూజివీడు, కృష్ణా జిల్లా

అన్న నమ్మకమే.

తను అమెరికా చేరుకున్న ఏడాది తరువాత శారద నుంచి మూడు పంక్తుల ఉత్తరం వచ్చింది. సంబోధన లేని ఉత్తరమది.

'నేను నీ మీద పెద్ద ఆశలేమీ పెట్టుకోలేదు. కానీ వనజ, నీ తమ్ముడు, మీనాన్న చాలా ఆశలు పెట్టుకున్నారు. పిరికివాడిగా దూరం వెళ్ళిపోయేవు' అంటూ నిష్ఠూరంతో నిండి ఉంది ఆ ఉత్తరం.

తను బాధపడ్డాడు. కానీ జవాబు రాయలేదు. జవాబు ఏమని రాయగలడు? నేను అమెరికా పరిగెత్తుకు రావడానికి నువ్వు కూడా ఒక కారణం అని తను రాయగలిగేవాడా? శారద దృష్టిలో తను దిగజారేడు. తిరిగి పాత స్థానానికి చేరుదామని తను ప్రయత్నించలేదు. వ్యర్థ ప్రయత్నం అని శారద జ్ఞాపకాల్ని తుంచ ప్రయత్నించేడు.

తను పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిగ్రీ తీసుకున్న సమయంలో అమెరికాలో ఆర్థికమాంద్యం సంభవించింది. సరయిన ఉద్యోగం దొరకడం ఆలస్యమైంది. అమెరికాకి వచ్చిన మూడేళ్ళకి కానీ తను తండ్రికి ఆర్థిక సహాయం అందించలేకపోయేడు.

తనకి ఉద్యోగం రావడానికి కారణం తాగుడు బలహీనత. తన దగ్గర వంద డాలర్లు మాత్రమే మిగిలి ఉన్న రోజులవి.

ఉద్యోగం కోసం శాన్‌ఫ్రేన్సిస్కో నగరం చేరుకున్న తను, బీదలు నివసించే ప్రాంతంలో వారం రోజులకి అద్దెకట్టి పొదుపుగా కాలం గడుపుతున్న రోజులు. మధ్యాహ్నం మూడు గంటలకి అన్నం తిని అదే లంచ్, అదే డిన్నర్ అని సరిపెట్టుకునేవాడు. పగలంతా ఉద్యోగపు వేట, సాయంకాలం కాళ్ళీడ్చుకుంటూ గదికి చేరి, నిద్రపోయిన రోజులవి. ఒక రోజు- ఆ రోజు తన జీవితంలో ఒక ముఖ్యమైన మలుపు తిరిగిన రోజు. తనకి బాగా జ్ఞాపకం! ఆ వేళ గురువారం. ఊరంతా తిరిగి గదికి వచ్చి ఆలస్యంగా భోజనానికి వెళ్ళేడు. ఒంటరిగా భోజనం కానిచ్చి తిరిగి దాదాపు రాత్రి ఎనిమిది గంటలకి నడిచి తిరిగి వస్తున్నాడు. దట్టంగా కురిసేక వాన కాస్త మందగించింది. రెయిన్ కోటు వేసుకుని జాక్సన్ వీధిలోంచి తను నడిచి వస్తుంటే తడబడుతున్న అడుగులతో బార్‌లోంచి బైటికి వచ్చి 'అతను' తనని ఢీకొన్నాడు. ఈ తాకిడిలో అతని పర్సు, కారు తాళాలు ఫుట్‌పాత్ మీద పడిపోయేయి. అతని నోటి నుంచి ముక్కుపుటాలదిరేంత మద్యం వాసన! సరిగ్గా ధరించని ఓవర్‌కోటులోంచి లోపల వేసుకున్న సూటు కనిపిస్తోంది. వేసుకున్న బట్టలు తడుస్తుంటే కింద పడిన కారుతాళాలు తీసుకుందామని ఒంగి ముందరకి తూలి పడిపోయేడు. ఏం చేయాలో తనకి తోచలేదు. ఒకరి గురించి ఇంకొకరు పట్టించుకోని దేశం! గట్టిగా పడుతున్న వాన జల్లుని, ఎగసిపడుతున్న పల్చని నీటి ఆవిరిని మింగేస్తున్న చీకటి! ఇతనికి సహాయం చేయాలా? అతని గురించి పట్టించుకుంటే ఏమవుతుందో? అన్న ప్రశ్నలు కొన్ని సెకన్ల పాటు వచ్చేయి. ఏమైతే అదే అవుతుందని కింద పడిన అతనిని లేవనెత్తి అతని పర్సు, కారు తాళాలు అందిచ్చేడు.

అతడు తనని 'నన్ను నా కారు దగ్గరకి తీసుకెళ్లగలవా?' అనడిగేడు తడ

బడుతున్న గొంతుతో.

భుజాన్ని ఆసరాగా ఇచ్చి మెల్లిగా అతనిని కారు దగ్గరికి నడిపించుకె ళ్లేడు తను.

'థాంక్స్!' అంటూ కారు తలుపు తెరవడానికి ప్రయత్నించేడతను.

తాగుడు ప్రభావం వలన స్థిర త్వం లేని వేళ్ళతో కారు తాళం తి య్యలేకపోతుంటే, అతని దగ్గర నుంచి తాళాలు అందుకుని 'మీ కారేనా?' అనడుగుతూ కారు తలు పు తెరిచేడు తను. అతని పరిస్థితి ఏమీ బాగాలేదు. మొండిగా కారు నడప ప్రయత్నించినా ఏక్సిడెంట్ అవడం ఖాయం. చూస్తూ చూస్తూ ఒక ఆత్మహత్యలాంటిది చేసుకోబో తుంటే ఎలా ఊరుకోగలడు?

'మీరు కారు నడిపే స్థితిలో లేరు. కారు ఇక్కడ వదిలి టేక్సీలో ఇంటికి వెళ్లండి' అన్నాడు తను.

'నో! నో!'

'ఎక్కడ మీ నివాసం?' అడిగేడు.

అతను చెప్పిన ప్రదేశం కారున్న చోటుకి ఒకమైలు దూరంలో ఉంటుంది.

'మీరు కారు నడిపి ఇంటికి వెళ్ళే లోగా ఏక్సిడెంట్ చేస్తారు' అన్నాడు తను అతనిని మళ్లీ వారిస్తూ.

'నీకు డ్రైవింగ్ వచ్చా?'

యూనివర్సిటీలో చదువుకున్న ప్పుడు, అమెరికాలో కారు నడపగల గడం ముఖ్యమని గ్రహించి డ్రైవింగ్ లైసెన్స్ సంపాదించేడు తను.

'యస్' అన్నాడు తను.

'నన్ను నా ఇంటి దగ్గర వదలగ లవా?'

అంతవరకూ నా విషయంలో నిద్రపోతున్న అదృష్టదేవత నామీద గెంతి తాండవించిందో? ఏమో? కానీ అతనిని అతని కారులో

# చమత్కారం

## స'రస'తర్కం

సృష్టికర్త బ్రహ్మగారి కంటే కావ్యాలు రాసే కవి చాలాచాలా గొప్పవాడని ఈ కవిగారి భావన. ఎలా గయ్యా అంటే అదే విషయాన్ని ఈ పద్యంలో ఎంత చమత్కారంగా చెబుతున్నాడో చిత్తగించండి..

భువి షడ్రసముల నాలుకఁ
జవిగొనగా చేసె బ్రహ్మ, సత్కృతివలనన్
చెవి నవరసములుఁ జవిగొన
గవిచేసెను, బ్రహ్మకంటె
కవి యధికుఁడగున్



బ్రహ్మగారు మన నాలుకతో కేవలము షడ్రుచు లను మాత్రమే అనుభూతి చెందేలా చేయగలడు. అంటే నాలుక ఆరు రసాలు మాత్రమే రుచి చూడ గలదు.. కానీ కవి తన మంచి కావ్యం ద్వారా చెవులు నవరసాలు అనుభూతించేలా చేయగలడు. అంటే తొమ్మిది రసాలు రుచి చూపగలడు. ఆ లెక్కన బ్రహ్మకంటే కవి అధికుడు అన్నమాటే కదా? షడ్రుచులను నవరసాలకు లంకెపెట్టి చమ త్కరించడమే ఈ కవిగారి గడుసుదనం.

సేకరణ : చంద్రప్రతాప్

ఇంటికి చేర్చి ఇంటి బజ్జర్ నొక్కేడు తను.

ఒక స్త్రీ తలుపు కంతలోంచి బైటికి చూసేక మెల్లిగా తలుపు తెరచింది. అత నిని చూస్తూ.. 'జాన్ ఏమైంది? ' అనడి గింది ఆదుర్దాగా.

'ఏమీ అవలేదు. మద్యం ఎక్కువగా సేవించినట్లున్నారు' తను జవాబిచ్చేడు.

'ఎవరు నువ్వు? '

'నేనెవరినైతే ఏం? అతని పరిస్థితి చూసి సహాయం చేసేను, అంతే!'

'లోపలికి రండి! తడిసిపోతున్నారు!" అంటూ తలుపు పూర్తిగా తెరిచింది.

'ఆ సోఫాలో కూర్చోండి! ఇప్పుడే వస్తాను' అంటూ జాన్‌ని లోపలికి తీసుకె ళ్ళింది. పదినిమిషాల తరువాత వేడి కాఫీ తో వచ్చి 'థాంక్యూ!' అని కప్పు అందిస్తూ 'ఇదంతా ఎలా జరిగింది? ' అడిగింది.

ఉద్యోగం కోసం తిరుగుతున్నానని చెప్ప కుండా జరిగింది వివరించేడు. మరో పది నిమిషాలు గడిచేక పైజమా దుస్తులతో జాన్ గదిలోనికి ప్రవేశించేడు.

'నువ్వు ఇతనికి బాగా రుణపడి ఉన్నావు' అందామె జాన్‌తో.

'అవునవును!' అన్నాడు జాన్.

'ఎవరు నువ్వు? ఏం చేస్తుంటావు? ' అన్న జాన్ ప్రశ్నకి, ఇంజినీరింగ్ విభా గంలో పోస్ట్‌గ్రాడ్యుయేట్‌నని, ఉద్యోగం కోసం తిరుగుతున్నానని చెప్పేడు తను.

జాన్ లేచి టేబుల్ మీదున్న తన బిజి నెస్ కార్డ్ అందిస్తూ 'రేపు ఉదయం పది గంటలకి వచ్చి నన్ను కలువు. నీకు సహాయం చేయగలనేమో చూస్తాను' అన్నాడు జాన్.

కుడితిలో పడ్డ ఎలుకలా కొట్టుకుంటున్న తనకు చేయి అందిచ్చి ఆదుకున్నాడు జాన్. బెక్టెల్ కంపెనీలో జాన్ పెద్దహో దాలో పనిచేస్తున్నాడు.

తనకి ఉద్యోగం ఇచ్చేడు జాన్. అతను ఇచ్చిన చేయూత, ఊపుతో తను నిలదొక్కు కున్నాడు. అంతే! తను నిరాశతో మళ్ళీ ఎప్పుడూ వెనక్కితిరిగి చూడలేదు.

**కాలిఫోర్నియా:**

"వినోద్! మీ అమ్మని డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళాలి" అన్నాడు రామారావు.

"ఎందుకు? ఏమైందమ్మా" అనడిగేడు వినోద్.

కూర బాగుందని, రుచి బాగా కుదిరిం దని గుత్తి వంకాయకూర కలుపుకుంటున్న ఉషశ్రీకి నోటిలో ఉంచుకున్న కూర ఒక్కసారిగా చేదనిపించింది.

"అమ్మకి షుగర్ కంప్లైంట్ వినోద్!"

"అమ్మకి డయాబెటిసా? నాకు ఇంతవ రకు చెప్పలేదేం? "

"రెండు సంవత్సరాల క్రితం అది బయ టపడింది. పనికట్టుకు చెప్పడానికి ఇదే మంత శుభవార్తా? "

"మరి? "

"డాక్టర్లు చెప్పిన జాగ్రత్తలు పాటిస్తూ, మాత్రలు వాడుతోంది"

వినోద్ పరీక్షగా తల్లివేపు చూసేడు. వైదేహి ఏమీ మాటలాడకుండా భర్త వేపు చూసింది.

"గత ఆరేడు రోజులుగా విపరీతమైన పిక్కలపీకుడు, నీరసం, విపరీతమైన దాహం అని నాతో అంటే రక్తంలో షుగర్ లెవల్ ఎంత ఉందో తెలుసుకుంటే మంచి దని నీకు చెబుతున్నాను"

"అత్తయ్యా! షుగర్ లెవెల్ ఎంత ఉందో తెలుసుకోవాడానికి డాక్టర్ దగ్గరకి వెళ్ళనవ సరంలేదు. నా దగ్గర షుగర్ టెస్ట్ చేయ డానికి పరికరం ఉంది. దానిని రేపుగానీ, ఎల్లుండిగానీ వాడదాం. అత్తయ్యా! మీకు ప్రతిరోజూ వ్యాయామం అతిముఖ్యం. తిని ఇంట్లోనే కూర్చుంటే షుగర్ కంట్రోల్ అవదు" అంది ఉషశ్రీ.

డైనింగ్ టేబుల్ దగ్గర వాతావరణం గంభీరంగా మారింది.

"ఇలాంటి చిన్నవాటికి డాక్టర్ని చూడడం

అ
క్ష
రం

సాఫీగా సాగిపోయే జీవితం కోసం
ప్రార్థించకు
ఎంతటి కష్టాన్నయినా తట్టుకుని నిలబడే
బలం కోసం ప్రార్థించు

– బ్రూస్ లీ



తొందరగా కుదరదు. ఎమర్జెన్సీ అయితే తప్ప తక్కున ఎపాయింట్‌మెంట్ దొరకదు. అయినా ఒకసారి మన ఆరోగ్య బీమా పథకంలో ఇవి కవరేజ్‌లో ఉన్నాయో? లేదో? చూడు వినూ" అంది ఉషశ్రీ.

తల ఊపేడు వినోద్.

"అనంత్ ఈవేళ మనతో భోజనానికి రాలేదే! ఈజ్ ఎవ్విర్‌థింగ్ ఓకే? " అనడిగేడు వినోద్.

"ఎక్స్‌ట్రా హోమ్‌వర్క్ ఉంది, అంటూ కంప్యూటర్ ముందు కూర్చున్నాడు. ఐ డోంట్ నో! వాడు ఈమధ్య కాస్త మూడీగా తయారయేడు" అంది ఉషశ్రీ.

డైనింగ్ టేబుల్ దగ్గర ఉన్న నలుగురూ లేచి తాము ఉపయోగించిన పళ్ళేలని కడుగుకొని వెళ్ళేరు.

వినోద్ అనంత్ తలుపుతట్టి గదిలోనికి ప్రవేశించేడు. కంప్యూటర్ మీద పనిచేస్తున్న అనంత్ తలెత్తేడు.

"ఏమైనా ప్రాబ్లెమ్ ఉందా అనంత్? చర్చిద్దాం!" అంటూ అనంత్‌ని సమీపించేడు వినోద్.

"డేడీ! నన్ను వదిలేయ్! నాకు చాలా పని ఉంది" దాదాపు అరిచినంత పని చేసాడు అనంత్.

"ఓకే! ఓకే!" అంటూ గది తలుపు వేసి, మెల్లిగా మెట్లు దిగి కిందికి వచ్చేడు వినోద్ ఆలోచిస్తూ .

హాల్‌లో టెలివిజన్ మీద ప్రోగ్రాంలు నడుస్తున్నాయి. భార్య పక్కన కంప్యూటర్‌లో తనకి వచ్చిన ఇ-మెయిల్స్ చూస్తున్నా, వినోద్ ఆలోచనంతా అనంత్ మీదే ఉంది. అనంత్‌లో ఏదో మార్పు గోచరిస్తోంది. ఆ మార్పు తన పట్లేనా? లేక అందరి పట్లా వాడి ధోరణి ఇలాగే ఉందా? ఇది కేవలం పదిహేడేళ్ల వయస్సులో టీనేజర్స్ సహజంగా ప్రదర్శించే విప్లవ ధోరణేనా? తల్లిదండ్రులు ఎంత శ్రద్ధ తీసుకున్నా, ఎంత ప్రేమ ఆప్యాయతా పంచి పెట్టినా ఆ వయస్సులో చాలామంది టీనేజర్స్‌కి తల్లిదండ్రులే శత్రువుల్లా కనిపిస్తారట! ఏమో అనంత్‌లో వచ్చిన మార్పు తన ఒత్తిడిని పెంచుతోంది. తనతో, ఉషతో అనంత్ ప్రవర్తించే ధోరణిలో దూకుడు, 'నీకేమీ తెలియదు' అన్న చులకన ఉన్నా.. తాత, బామ్మలతో అనంత్ ప్రవర్తన సౌమ్యంగా ఉండడం తను గమనించాడు. 'గుడ్డిలో మెల్ల' అంటే ఇదే అని వినోద్ అనుకుంటుంటే.. "విన్! నువ్వు చూడడం లేదు, అయితే కట్టేస్తాను" అంటూ భుజంతో భర్తని కుదిపింది ఉషశ్రీ. ఆలోచనలకి స్వస్తి చెప్పి భార్యతో టెలివిజన్ చూడడం మొదలు పెట్టేడు వినోద్.

★ ★ ★

"వైదేహీ! కాళ్ల పిక్కలు బాగా ఇబ్బంది పెడుతున్నాయా? " అడిగేడు రామారావు.

నిజం చెప్పాలో? అబద్ధం చెప్పాలో? తెలియక మౌనంగా ఉంది వైదేహి.

అధిక దాహం, కాళ్ళ పిక్కల నొప్పులే కాకుండా రెండు రోజుల క్రితం 'హనుమాన్‌చాలీస్' చదవడానికి ప్రయత్నిస్తుంటే పాత కళ్ళద్దాల్లోంచి అక్షరాలు అలికినట్లు కనిపించాయని చెబితే భర్త గాభరా ఎక్కు

వవుతుందని "కొంచెం ఇబ్బంది పట్టేయి" అంది వైదేహి.

"నీ కోసం ఇండియా నుండి తెచ్చుకున్న మాత్రలు ఇంకెంత కాలం వస్తాయి? "

"మరో రెండు నెలలు"

"ఇంకా ఎక్కువ తీసుకురావల్సిందేమో!"

"చాలా మందులు అవి తయారయిన సంవత్సరంలో వాడేయాలని ఉంటుంది. ఎక్కువ తెచ్చుకున్నా ఉపయోగపడవు"

"రోజూ గురించి చెబుతుంటే నువ్వు పట్టించుకోలేదు"

"అవును! నేను నడకకి రాలేదు. 'అత్తయ్యా! పాచిపోయిన కూరలు తినకూడదు. ఫ్రెష్‌గా కూరలు చేసుకుంటే ఆరోగ్యానికి మంచిది' అంది ఉష నాతో చాలా కాలం క్రితం. అంటే ఒకేసారి ఎక్కువ కూర వండి ఫ్రిజ్‌లో పెట్టవద్దని దాని అర్థం. మీరు చూస్తూనే ఉంటారుగా వంటింట్లోనే ఎంత పనుంటోందో! ఇహ వ్యాయామానికి ఓపిక ఎక్కడ ఉంటుంది? " అంది వైదేహి హీనస్వరంతో.

"ఎలాగోలాగ వీలు చూసుకుని నువ్వు వ్యాయామం చెయ్యకపోతే ఇంకా చిక్కుల్లో పడతావు"

"ఏం వ్యాయామమో? మొన్న మీకు కడుపునొప్పి, ఇప్పుడు నాకు చక్కెరవ్యాధి. వీళ్లని ఇబ్బంది పెడుతున్నామేమో? "

"చూద్దాం! నువ్వు ఢీలా పడి, నా కంగారుని పెంచకు! రేపు నీ షుగర్ లెవెల్ చూసేక, కోడలు డాక్టర్ కాబట్టి ఏవో చిట్కాలు చెబుతుంది" అన్నాడు రామారావు.

మర్నాడు ఉదయం "మరీ అంత ఎక్కువ కాదు గానీ, షుగర్ ఎక్కువగానే ఉంది. ముందు మీరు పిండిపదార్థాలు, చక్కెర వాడకం పూర్తిగా మానేయాలి. ప్రతీరోజు కనీసం ముప్ఫయి నిమిషాలు చమటపట్టేలా నడకకి వెళ్ళాలి. ఒక వారం రోజుల తరువాత మళ్ళీ షుగర్ లెవల్ చూద్దాం" అంది ఉష.

వైదేహి తలూపింది.

వారంరోజులు గడిచాక, రెండోసారీ షుగర్ ఎంత ఉందో పరిశీలించి "పూర్తిగా కంట్రోల్‌లోకి రాలేదు. పూర్తిగా కాకపోయినా అన్నం బాగా తగ్గించండి. ప్రతీ రోజు ముప్పయి నిమిషాలకి బదులు నలభై నిమిషాలు వ్యాయామం చెయ్యండి. మధ్యాహ్నం భోజనం చేసేక నిద్రపోకండి. మీరు వాడుతున్న మాత్రలు వాడుతూనే ఉండండి. ఇలాచేస్తే షుగర్ కంట్రోల్ అవుతుంది. ఏమంటారు అత్తయ్యా? " అంది ఉషశ్రీ.

తలాడించింది వైదేహి.

చక్కెర లేకుండా కాఫీతో మొదలవుతుంది ఉదయం, తరువాత మధ్యాహ్నం, రాత్రి భోజనాలలో రెండు చెమ్చాల అన్నం తింటుంటే షుగర్ మాట దేముడెరుగు, నీరసంతో 'హరీ' అంటానేమో అనిపించింది వైదేహికి.

వైదేహి కళ్ళు, చెంపలు లోపలికి పోవడం చూసి "చాలా చిక్కిపోయేవు వైదేహి" అన్నాడు రామారావు బాధగా.

వైదేహి బావురుమంది. "మనం ఇండియా వెళ్ళిపోతే? " అంది తేరుకుని.

"అక్కడా నీకు ఈ జాగ్రత్తలు అవసరమే. అక్కడకి, ఇక్కడికి ఏమిటి తేడా? "

"పనండీ పని! కూరగాయలు, బియ్యం కడిగిన నీళ్ళు బైటకి తీసుకెళ్ళి పెరటిలో ఉన్న మొక్కలకి పోయాలి. వాటిలో ఖనిజాలు ఉంటాయట. ఫిల్టర్‌లో మిగిలిపోయిన కాఫీపొడిని తీసుకెళ్ళి గులాబీ మొక్కలకి వేస్తే తళతళలాడుతున్న పూలు పూస్తాయట. కూరగాయల తొక్కలని అబ్బో! ఆ కలకత్తా అంత దూరం వెళ్ళి అక్కడ ఉన్న డబ్బాలో వేయాలట. ప్రతీ రోజు ఉష ఉడకబెట్టిన మొక్కజొన్నపొత్తు గింజలు తింటుంది. ఉడకపెట్టి గింజలు తీయాలి. పాపం అనంత్! వాడికి బంగా

ళాదుంపలు అంటే తెగపిచ్చి, ఉష దానిని ఒప్పుకోదు. ఎవరికీ కనపడకుండా నూనె తక్కువ వాడి, వేపుడు చేయాలి. ఒకపని దొంగతనంగా చేయాలంటే ఎక్కువ కష్టపడాలి. నిలబడి చపాతీలు ఒత్తేసరికి తాతలు దిగివస్తున్నారు. ఇండియా వెళ్తే ఇంత శ్రమ ఉండదు" అంది వైదేహి.

బలంగా ఊపిరి వదిలేడు రామారావు.



"పరమేశ్వరరావుగారు కొడుకు దగ్గరికి వస్తున్నారు. వాళ్ల అబ్బాయి ఇక్కడికి ముప్ఫయి మైళ్ల దూరంలో ఉన్నాడు. నీకు మందులు, మనకి పదిహేనువందల డాలర్లు తీసుకురమ్మన్నాను. ఈ రోజుల్లో బేంక్‌లు ఉదారంగా వ్యాహ్యాళికి డాలర్లు ఇస్తున్నారు. అవి వచ్చేక నీకు ప్రతీరోజు బొప్పాయిపండు, దానిమ్మపండు తెస్తాను. అవి తినడం ఆరంభించేక నీకు బలం వస్తుంది" అన్నాడు రామారావు.

భర్తని బల్లిలా అంటుకుని మరోసారి బావురుమంది వైదేహి.

'పరమేశ్వరరావుగారు వచ్చేక పరిస్థితులు మెరుగవుతాయని, బొప్పాయిపండు, దానిమ్మపండు తెస్తానని వైదేహిని అనునయించేను. కానీ అది వీలవుతుందా?' అనుకుంటూ నడకకి వచ్చిన రామారావు 'సేఫ్ వే' దుకాణం కనిపించగానే దానిలోకి ప్రవేశించాడు. రకరకాల ఏపిల్స్, పియర్స్, పైనాపిల్, ద్రాక్ష విస్తారంగా ఉన్నాయి. ఒక మూలగా తట్టలతో ఉన్న బొప్పాయి దానిమ్మలను పరిశీలించేడు రామారావు.

'గొట్టికాయలా ఉన్న బొప్పాయ పండు ఖరీదు సుమారు నాలుగు డాలర్లు, ఒక్కో దానిమ్మపండు ఎనభైసెంట్లు అని రాసి ఉంది. అంటే ఒక బొప్పాయి, ఒక దానిమ్మ పట్టుకెళ్ళాలంటే రోజుకి తను దాదాపు ఆరు డాలర్లు వెచ్చించాలి. దీనికి తోడు జెలోసిల్ మందు, కాఫీ ఖర్చు లెక్క వేస్తే, పరమేశ్వరరావుగారు తేబోయే పది హేను వందల డాలర్లు ఆరేడు నెలల కంటే ఎక్కువ రావు? ఆ తరువాత? ఏమో? ఏమౌతుందో? ఇప్పుడే తను ఏం ఊహించగలడు? వినోద్, ఉష తన ఆర్థిక పరిస్థితి గురించి, తన అవసరాల గురించి ఆలోచించినట్లు కనిపించలేదు. వాళ్ళకి ఎందుకు ఆ ఆలోచనలు రాలేదు? తండ్రి ఇండియా నుంచి వచ్చేప్పుడు వేల డాలర్లు తెచ్చేడనుకుంటున్నాడా? ఇంట్లో కూర్చున్న వాళ్లకి ఖర్చులేముంటాయి? అనిపిస్తోందా? ఎక్కడ నా ఆలోచనలో లోపం?' అని గింజుకుంటూ నిద్రలోకి జారేడు రామారావు.

వినోద్‌తో త్వరలో అన్ని విషయాలూ చర్చిస్తే బాగుండును అన్న ఆఖరి ఆలోచన రామారావు నిద్రలో కరిగిపోయింది.




**ఇండియా:**

ఉదయం నడకకి వెళ్ళే అలవాటున్న కృష్ణారావుకి, నడకకి వెళ్లాలనిపించక పరుపుమీద దొర్లుతున్నాడు. ముందర రోజు ప్రజలని తన వేడి తీక్షణతో బాధించేనంటూ పశ్చాత్తాపం వ్యక్తపరిచినట్లు, బాలభానుడు తన నులివెచ్చని కిరణాలని వదులుతున్నాడు. తూర్పువైపున్న కిటికీ పరదాలలోంచి కిరణాలు లోపలికి వడకట్టబడి వస్తుంటే, కాఫీకోసం పరుపుమీద నుంచి లేవబోయేడు కృష్ణారావు. మోకాలు దగ్గర ఒక్కసారిగా కలుక్కుమన్న నొప్పిని అణిచిపెట్టి, కాఫీ కలుపుకుని పడమటి వేపు ఉన్న జాగాలో కూర్చున్నాడు. నీడలో కూర్చున్నా ఒక గంట గడిచేసరికి సూర్యకిరణాలని అరగించుకున్న గాలి చెంపల్ని తాకి ఇబ్బంది పెడుతుంటే లేచి లోపలికి కదలబోయేడు. గంటక్రితం ముఖుకుల దగ్గర మొదలైన నొప్పి తానెక్కడకీ వెళ్లలేదన్నట్లుగా మరోసారి కలుక్కుమనేసరికి 'ఎందుకొస్తోందో? గత నాలుగైదు

రోజులుగా అడపాదడపా వస్తున్న ఈ నొప్పికి కారణం కనుక్కోవడానికి విశాఖ పట్నం వెళ్ళాలి' అనుకున్నాడు కృష్ణారావు.

★ ★ ★

డాక్టర్ భావేరావ్ క్లినిక్ విజిటర్స్ గదిలో కూర్చున్న కృష్ణారావుకి లోపల గదిలో రోగికి, డాక్టర్‌కి మధ్య నడుస్తున్న సంభాషణ స్పష్టంగా వినిపిస్తోంది.

"అమ్మా! మీ కాళ్ళ సంగతి నాకు వదిలేయండి. నా మాట విని కీళ్ల మార్పిడి చేయించుకోండి! ఎన్నాళ్లిలా బాధతో ఉస్సురంటూ కదులుతారు. ఒక వారం రోజులు బెడ్‌రెస్ట్ అంతే! మళ్ళీ మీరు జామ్మని బెంగుళూరులో ఉన్న మీ అబ్బాయి దగ్గరికి పరిగెత్తివెళ్తారు. ఒకే కాలుకి చేయించుకుంటే అంటారా? చేయించుకోవచ్చు ఆఫ్టరాల్ ఆరులక్షలు. బంగారం లాంటి మీ రాబోయే పదేళ్ల కాలం ముందు అవెంత? ఆయనతోనే మాటాడుతాను.

తిరిగి డాక్టర్ భావేరావ్, కొత్త రోగి మధ్య సంభాషణ మొదలైంది.

"ఒక షావుకారు ఏదో తప్పు చేస్తే, రాజుగారు ఒక శేరు కంపు నెయ్యి తాగుతావా? ఇరవై కొరడా దెబ్బలు తింటావా? నూరు నాణేలు జరిమానా కడతావా? అంటూ శిక్ష విధించేరు. సగం కంపునెయ్యి తాగాక, పదికొరడా దెబ్బలు భరించలేక, జరిమానా కట్టేడుట ఆ షావుకారు. ఎందుకు ఈ బాధతో జీవించడం? ఆర్మీలో కల్నల్‌లా ఉన్నారు. గెటిట్ డన్, అది చేయించేసుకోండి. తెరపిన పడతారు. ఊతకర్ర సహాయం పదేళ్ళవరకూ రాదు. మీకు షుగర్ లేదు కదూ? దటీజ్ గుడ్! మంచిరోజు చూసుకుని రండి! ఎంతసేపు? మహా అయితే రెండుగంటల ఆపరేషన్, మీరు వచ్చే ముందు నాకు ఒక్క ఫోన్ చేయండి? "

కృష్ణారావు తన వంతురాగానే డాక్టర్ గదిలోకి ప్రవేశించాడు.

కృష్ణారావు ముణుకుల దగ్గర మెల్లగా నొక్కి "గబుక్కున చెప్పకూడదు. ఒకసారి ఎక్స్‌రే తీయిస్తే సమస్య చప్పున అర్థమవుతుంది. ఇక్కడికి నూరుఅడుగుల దూరంలో కేకేఆర్ లేబ్ ఉంది. చీటి రాసిస్తాను. వాళ్ళు మిమ్మల్ని విసిగించకుండా చప్పున ఎక్స్‌రే తీసి రిపోర్ట్ రాసిస్తారు. ఎక్స్‌రే తీసుకువచ్చేక మీరు క్యూలో ఉండనవసరం లేదు" అన్నాడు డా. భావేరావు.

ఒకగంట తరువాత కృష్ణారావు కాలికి తీసిన ఎక్స్‌రేలని చూస్తూ "ఆటల్లో పడి కానీ, ఏక్సిడెంట్‌లో కానీ కాలికి దెబ్బ తగిలిందా? కార్టిలేజ్ దెబ్బతింది. లెటజ్ సీ ఏయే ఆప్షన్స్ ఉన్నాయో! మీరు బాగా ప్రయాణాలు చేస్తానన్నారు కదూ? మెట్లు ఎక్కినప్పుడు, దిగినప్పుడు బాగా ఇబ్బంది పెడుతోంది కదూ? శాశ్వత నివారణ పరిష్కారాలతో నీ రిప్లేస్‌మెంట్ ఒకటి. ఏవేవో టాబ్లెట్లు పనిచేస్తున్నాయని ఊకదంపుడుగా ఎడ్వర్టయిజ్‌మెంట్ తప్ప వాటి ప్రభావం దాదాపు సున్నా! మీరు తీరికగా ఆలోచించుకోండి, నే చెప్పినదాని గురించి. ఉపశమనానికి మందులు రాస్తాను. యూ ఆర్ రైట్, మీరు అనుమానించినది కరెక్టే. ఇది ఆర్థరైటిస్ మొదటిదశలా ఉంది. నా సలహా ఏమిటంటే ఒక కాలు జాయింట్ రీప్లేస్‌మెంట్, రెండో కాలు జాయింట్ ఈజ్ పెర్‌ఫెక్ట్" అన్నాడు డా. భావేరావు.

రెండు వందల రూపాయల ఫీజు ఇచ్చి కృష్ణారావు క్లినిక్‌లోంచి బైటపడ్డాడు. బయట ఉన్న చల్లగాలి కృష్ణారావు మొహాన్ని తాకగానే సైంటిస్ట్ కృష్ణారావులో ఒకరకమైన ఉత్సాహం ఉబికింది. రెండడుగులు వేసి డా. పాపారావు, ఆర్థోపిడీషియన్ అన్న బోర్డ్ చూసి లోపలికి నడిచేడు. హాలులో నలుగురు పేషెంట్లు మాత్రం ఉన్నారు. సోఫాలో సర్దుకుని కూర్చున్న నలుగురిలో ఒక పేషెంట్ లోపలికి వెళ్లేరు. గదిలోపల జరుగుతున్న

సంభాషణ కృష్ణారావుకి వినిపించడంలేదు. ఎదురుగా ఉన్న పేపర్ అందుకుని దానిలో తల దూర్చేడు.

చాలా హీనమైన ఇంగ్లీషులో, ఏమీ అవగాహన లేని వ్యక్తి రాసినట్లున్న వార్తలని చదవగానే కృష్ణారావు ఆశ్చర్యంతో పాటు వెగటు కలిగింది. పేపర్ నిండా చెత్తవార్తలు, ఆధారం లేని వ్యాఖ్యలు పేజీలకి పేజీలు ఎడ్వర్టయిజ్‌మెంట్లు! ప్రకటనల ద్వారా కావలసినంత ఆదాయాలొస్తుంటే ఇహ ఇతర భాగాలకి విలువ ఏముంటుంది? అనుకుంటుంటే..

"మీరు లోపలకి వెళ్ళండి" అన్నాడు నెంబర్ల వారీగా రోగులని పంపించడానికి నియమించిన కుర్రాడు.

"వాట్ సీమ్స్ టు బి ది ప్రాబ్లెమ్? ఏమిటి మీకు వచ్చిన ఇబ్బంది? గుడ్! ఎక్స్‌రేలు కూడా తీసుకువచ్చారే!" అంటూ వెనకాల వైట్ ఉన్న అద్దం మీద ఎక్స్‌రేలని ఉంచుతూ ఒక నిమిషం ఆలోచించి కృష్ణారావు వేపు తిరిగి..

"ఊ! చెప్పండి" అన్నాడు డా. పాపారావు. కృష్ణారావు తనకున్న ఇబ్బంది గురించి వివరించేడు.

"నథింగ్ సీరియస్. భయపడవలసిన అవసరం లేదు. మొణుకుల దగ్గర ఉండవలసిన లూబ్రికేటింగ్ లిక్విడ్ తగ్గింది. అందుచేత ఎముకలు రాపిడి అవుతున్నాయి. ఎముకల మీద చిన్న పుళ్ళలా కనిపిస్తున్నాయి. నో ప్రాబ్లమ్! మందులు రాస్తాను. రెండు వారాలు వాడండి. ఈ మందులు పక్కనే ఉన్న దుకాణంలో దొరుకుతాయి, కొనుక్కోండి. యు విల్ బి ఆల్ రైట్! రీ ప్లేస్‌మెంట్ పదాన్ని వాడేరే. ఆర్ యు క్రేజీ? చిత్రంగా ఉందే మీ ఆలోచన. 'గోటితో పోయేదానికి గొడ్డలి కావాలి?' అన్నట్లుగా ఉంది మీ ధోరణి! మైగాడ్!" అంటూ రెండు వందల రూపాయలు పుచ్చుకుని నవ్వుతూ సాగనంపేడు డా. పాపారావు.

రోడ్డు మీదకి వచ్చిన కృష్ణారావుకి నవ్వు ఆగడం లేదు. 'డా. భావేరావ్‌కి ఎక్స్‌రే లేబ్‌కి మధ్య ఉన్న లాలూచీ లాంటిదే డా. పాపారావుకి, అతని హాస్పిటల్‌కి ఆనుకుని ఉన్న మందుల దుకాణానికి ఉందని' అనుకుంటూ ఎదురుగా రెస్టారెంట్ అన్న బోర్డ్ చూడగానే లోపలికి ప్రవేశించేడు. చుట్టూ ఉన్న జనాభాని చూస్తూ దగ్గరగా వచ్చిన సర్వర్‌తో "ఒక టీ" అన్నాడు.

"సార్! టోకెన్ తీసుకోవాలి" అన్నాడు సర్వర్.

ఐదు నిమిషాల తరువాత, సర్వర్ తెచ్చిన టీ సగం తాగి బైటపడిన కృష్ణారావు 'మూడు మిలియన్ల పైనే జనాభా ఉన్న విశాఖపట్నం దరిదాపులలో ముప్ఫయి ఇంజినీరింగ్ కాలేజీలు, మెడికల్ కాలేజీ, యూనివర్సిటీలే కాకుండా చాలా కాలేజీలు వగైరా ఉన్నా, శుభ్రత లేదు. ఇతరుల గురించి వ్యాకులపాటు లేదు. రోడ్డు మీద నడుస్తున్న చదువుకున్న నాగరికుడ్ని ఆపి, ఈ విషయం ప్రస్తావిస్తే 'జనాభా అండి జనాభా' అంటాడు అట్టే ఆలోచించకుండా. రోడ్డు మీద ఉమ్మివేయడానికి, చెత్తని చెత్త బుట్టలో వేయకుండా నిర్లక్ష్యంగా రోడ్డు మీద గిరాటేయడానికి జనాభా కారణమా? ఒక పక్క నడిచే రోడ్డుమీద, ఎదురుగా రాకూడని దిశలో వాహనాలు రావడానికి జనాభా కారణమా? కావాలంటే అన్నింటికీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జనాభాయే కారణం అని వాదించవచ్చు. బాగా చదువుకున్నవాళ్లున్న విశాఖపట్నంలో ఇలా ప్రవర్తించడమేమిటి? అనుకుంటూ కారువేపు నడిచేడు కృష్ణారావు.

అమెరికా నుంచి తెచ్చుకున్న ఏస్ప్రిన్ మాత్రలు రోజుకు రెండు చొప్పున నాలుగు రోజులు వేసుకుని, విశ్రాంతి తీసుకోగానే మొణుకుల దగ్గర నొప్పి కాస్త తగ్గింది.

అక్షరం

ఒక పని మొదలుపెట్టాక ఓటమి గురించి
భయపడవద్దు, ఆ పనిని వదిలిపెట్టవద్దు
నిజాయితీగా పనిచేస్తే
తప్పకుండా విజయం పొందుతారు

– చాణక్య



కాళ్ళ నొప్పికి కారణం ఏమిటి? దానికి పరిష్కారమేమిటి? అన్న కృష్ణారావుని పీడిస్తుంటే ఏమైనా సలహా ఇస్తుందేమోనని వనజకి ఫోన్ చేసేడు.

"ఐదు సంవత్సరాల క్రితమే నాకు కీళ్ళ నొప్పులు వచ్చేయి. ఇది వంశపారంపర్యం కావచ్చు అన్నారు. నేను నీలా అటూ ఇటూ తిరగలేను కాబట్టి, ఏవేవో చిట్కాలు ఉపయోగించి నెట్టుకు వస్తున్నాను. ఆయుర్వేదంలో దీనికి మందు ఉందని, నొప్పి తగ్గిస్తుందని విన్నాను. నాకు కేరళ రాష్ట్రానికి వెళ్ళి ట్రీట్‌మెంట్ చేయించుకోవాలని ఉంది కానీ మీ బావగార్ని వదిలివెళ్ళలేను. ఆయనని నాతో తీసుకుపోనూ లేను" అంది వనజ ఫోన్ పెట్టేస్తూ.

"కేరళలో చాలా ఆయుర్వేద ఆశ్రమాలున్నాయి. కొచ్చిన్ దరిదాపులలో మరీను! చికిత్సాలయం వెతుక్కునేటప్పుడు జాగ్రత్త!" అని కూడా చెప్పింది వనజ హెచ్చరిస్తూ..

'ఇప్పుడేం చేయడం?' అనుకున్నాడు కృష్ణారావు.

డా. భావేరావు తన దగ్గరకి వచ్చిన వాళ్ళందరికీ 'కీళ్ళ మార్పిడి చేయించేసుకోండి! గుర్రంపిల్లలా పరిగెడతారు!' అన్న సలహా ఇస్తున్నాడు. డా. పాపారావు వ్యాధి నిర్ధారణ చేసే శక్తి ఒక పక్కన పెడితే, ఆయన రాసిన మందులు శరీరంలో ప్రవేశించేక రోగాన్ని తగ్గిస్తాయో? లేదో? కానీ ఇతర ఇబ్బందులని సృష్టిస్తాయని ఇంటర్నెట్ ద్వారా తెలిసింది. ఇంటర్నెట్‌లో పొందుపరిచిన వార్తలలో ఎంత నిజముంది? అన్నది వివాదమే అయినా ప్రజలు వాటి ఆధారంగా డాక్టర్లని నిలదీస్తున్నారు. గతంలో కన్ను, ముక్కు, నాలిక చూసి కుశలప్రశ్నలు వేసే డాక్టర్‌ని సంప్రదించి వచ్చేక, రోగులలో ధైర్యం జనించేది. ఇప్పుడు మనిషికి ప్రాముఖ్యం ఇవ్వకుండా మెషీన్ల నుంచి వెలువడే కాగితాలని చూస్తే గాని రోగ నిర్ధారణకి నడుంకట్టని డాక్టర్ల దగ్గరనుంచి బైటకి వచ్చేక 'ఎందుకైనా మంచిది, ఇంకో డాక్టర్‌ని సంప్రదిస్తే?' అన్న ఆలోచన వస్తోంది రోగులకి. చీకటిలో బాణాలు ప్రయోగించే వ్యక్తిలా ఉంది డా. పాపారావు వ్యవహారం. అందుచేత పాపారావు అవుట్! కీళ్ళ మార్పిడి జరిగిన మూడులక్షల మందిని పున:పరిశీలిస్తే, వాళ్ళలో ముప్పయి శాతానికి కీళ్ళ మార్పిడి అవసరం లేదని అమెరికాలో ఒక రిపోర్ట్ వెలువడింది. ఇండియాలోనూ ఈ కీళ్ళ మార్పిడి నినాదం ఊపందుకుంది. కీళ్ళ మార్పిడి తనకి అనివార్యమైతే, ఆ మార్పిడి తను అమెరికాలోనే చేయించుకుంటాడు. ఇన్సూరెన్స్, శుభ్రత ఉన్న ఆ హాస్పిటళ్లని వదిలి ఇక్కడ ఎందుకు చేయించుకుంటాడు? అంటే భావేరావు అవుట్! సమస్యని కాలానికి వదిలేయడమా? లేక ఏమైనా చేయడమా? అప్పుడప్పుడు ఇబ్బంది ఉన్నా తను నడవగలుగుతున్నాడు. ఈ పరిస్థితి ఇంకా దిగజారకుండా తనేమైనా చేయగలడా? వనజ ఆయుర్వేదంలో చికిత్స ఉంది అంది. అది ప్రయత్నిస్తే? కంప్యూటర్ తెరచి ఆయుర్వేద చికిత్సాలయాల గురించి ఆరా తీయడం

## కొత్తగాలి...

**అప్పుడు వ్యాపారం కోసం**
**తెల్లవాడు వచ్చి పాలించేడు!**
**ఇప్పుడు వ్యాపారం చేసుకోమని**
**మనమే ఆహ్వానిస్తున్నాం!**

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

మొదలుపెట్టాడు కృష్ణారావు.

పాత రోగులు వ్యక్తపరచిన ఉద్దేశ్యాలు, అనుభవాలు, చికిత్సాలయాల స్థితిగతుల గురించి తెలుసుకున్నాక, కొచ్చిన్‌కి దగ్గరగా ఉన్న ఒక ఆశ్రమాన్ని ఎంపిక చేసుకున్నాడు కృష్ణారావు.

తన కాళ్ళకున్న సమస్య గురించి వివరించి "మీ ఆయుర్వేద చికిత్సాలయంలో నేను చికిత్సకి రావచ్చా? మీ ఆశ్రమానికి ఎలా రావాలి? " అనడిగేడు కృష్ణారావు టెలిఫోన్‌లో.

"మీరు విమానాశ్రయం నుంచి బైటకి రాగానే మీకోసం టేక్సీ సిద్ధంగా ఉంటుంది" అన్నాడు చికిత్సాలయం మేనేజర్.

★ ★ ★

'పాతకొత్తల మేళవింపుతో అలంకరించుకున్న మధ్యవయస్సు స్త్రీలా ఆ ర్భాటం లేకుండా ఉంది కొచ్చిన్ విమానాశ్రయం' అనుకున్నాడు కృష్ణారావు, కన్వేయర్‌బెల్ట్ మీద సూట్‌కేసు లాగుకుంటూ..

'ల'ని 'ళ'ని సమృద్ధిగా వాడుతూ, ఒకటో అరో ఇంగ్లీషు పదాలని జొప్పిస్తూ మలయాళ ఇంగ్లీషు అర్థమవక బైటకి చూసేడు కృష్ణారావు.

అతుక్కుని ఉన్న ఊర్లని, సమృద్ధిగా ఉన్న టీ, బేకరీ దుకాణాలని దాటుకుంటూ ఇరవైఐదు నిమిషాలు హైవే మీద ప్రయాణం చేసేక 'ఆలువా' నగరం దాటుతుంటే చిన్నరోడ్డుకి ఇరువైపులా ఉన్న పెద్ద ఇళ్ళని ఆసక్తిగా చూసేడు కృష్ణారావు. దాదాపు అన్ని ఇళ్ళ మీదా కృత్రిమంగా తయారుచేసిన మంగుళూరు పెంకులు పాతకాలపు ఛాయలని ప్రదర్శిస్తున్నాయి. ఇళ్ల ప్రాంగణంలో విరగపూసిన పూల మొక్కలు, కొన్ని చెట్లని కరచిపెట్టుకుని మీదకి పాకిన మిరియాలతీగెలు, మసీదు, చర్చిలు పక్కపక్కనే ఉండడం గమనించేడు.

ఆశ్రమంలో తనకి కేటాయించిన గదిలో సామాను ఉంచుతూ "కేరియర్‌లో ఉన్న లంచ్ తినండి! ఒక గంట గడిచేక డాక్టర్లని కలవవచ్చు" అన్నాడు చికిత్సాలయంలో పనిచేసే మనిషి.

"ఇలాంటి కేసులు చాలా చూసేం. పూర్తి నివారణ సాధ్యం కాకపోయినా ఇంకా పాడవకుండా ప్రయత్నిస్తాం. మీ నొప్పికి రక్తసరఫరా సరిగ్గా లేకపోవడం ఒక కారణం. మీరు ఇక్కడ ఎన్నాళ్ళు చికిత్స పొందదలుచుకున్నారో దానిని బట్టి మా చికిత్స మారుతుంది. గ్యారంటీ అంటూ ఏమీ లేదు. కానీ కొంత ఉపశమనం లభిస్తుంది" అన్నారు డాక్టర్లు.

ఉదయం ఒక గంటసేపు ఆయుర్వేద మందులు కలిపిన మూడులీటర్ల వేడి తైలం పోసి శరీరమంతా గుర్రాలకి మాలీష్ చేసినట్టు చేస్తున్న మర్దనా వింతగా ఉంది కృష్ణారావుకి. అలాంటిదే మధ్యాహ్నం గంటసేపు మరో రకమైన చికిత్సతో 'నొప్పి తగ్గిందా? ' అనిపించసాగింది.

"కేరళలో ఈ కాలంలో బాగా వానలు కురవాలే? " అని కృష్ణారావు అంటే "ఈ సంవత్సరం తక్కువే!" అన్నారు డాక్టర్లు.

"నే ఆశ్రమం వదిలేయగానే వానలు కురిస్తే బాగుండును" అన్నాడు కృష్ణారావు.

కృష్ణారావు చికిత్స పూర్తవడానికి ఇంకా రెండు రోజులుంది.

కంటిలో నలుసుపడగా కళ్ళు నులుముకుంటుంటే జనించిన చెమ్మలా మొదలైంది

వాన. మఖమల్ తివాసీ మీద నడుస్తుంటే జనించిన మందమైన శబ్దంతో వాన తుంపరలు చెట్ల ఆకుల మీద పడుతూ ఆరంభమైంది వాన. వాన పడబోతోందని సంకేతమిచ్చే మట్టి వాసనని ఆఘ్రాణించి, చినుకులని పెంచింది వాన. ఆకుల మీద పడి వాన చినుకులు చేస్తున్న శబ్దం విని తలుపు తెరచి బైటకి వచ్చేడు కృష్ణారావు. గదిలోంచి జీరోవాట్ బల్బ్ ఇస్తున్న కాంతిలో, ఒంగిన ఆకుల్ని తమ పాత స్థానానికి రానివ్వకుండా చినుకులతో బాదేస్తోంది వాన. చూరు నుంచి కారుతున్న నీళ్ళధార శబ్దం ఎక్కువయింది. మెరుపొకటి కత్తితో చీకటిని నరికి అదృశ్యమైంది. ఆ మెరుపులో చెట్లు తమ సర్వస్వాన్ని ప్రదర్శించి ఆహ్వానిస్తుంటే, ఉత్సాహంగా వాననీరు, చెట్టు బోదె మీద నుంచి జారి కింద పారుతున్న ప్రవాహంలో కలిసిపోతోంది. మరోసారి మెరుపు మెరవగా కృష్ణారావు ఆకాశం మీదకి చూసేడు. తెగిన తెల్లని ముత్యాల దండలలోంచి జారుతున్న ముత్యాలలా బలమైన వాన చినుకులు భూమి మీద వాలి, ముక్కలవుతున్నాయి. వానని కళ్ళప్పగించి చూస్తున్న కృష్ణారావు ఆకాశంలో వచ్చిన వెలుతురును ప్రత్యేకం గా గమనించలేదు. ఒంచిన చెంబులోంచి జారుతున్న ధారలా చూరు నుంచి పెద్ద ధార కారుతుంటే, కుర్చీ తెచ్చుకుని కూర్చు ని వానని గమనించసాగేడు కృష్ణారావు.

చెట్లమీద నుంచి కారుతున్న వాననీరు తారు రోడ్డు మీదకి ప్రవహిస్తుంటే, రోడ్డు పక్కని ఉన్న చెట్ల మొదట్లో పేరుకుపోయిన ఇసుక జడత్వాన్ని వదిలించుకుని బైటకి వచ్చి ప్రవహిస్తున్న వాన నీటితో చేతులు కలిపింది. కొత్తగా కలిసిన స్నేహంతో కులుకుతూ, కొత్త రంగులని సంతరించుకుని వయ్యారాలు ఒలకపోస్తూ వాననీరు గలగలా శబ్దం చేసుకుంటూ పల్లపు ప్రాంతానికి దౌడు తీస్తోంది. ఒక్కసారిగా వాన ఆగి, బలంగా గాలి వీచడం మొదలయింది. వర్షంలో ఆసాంతం తడిసిన చెట్లు కప్పుకోవడానికి ఏమీలేక ఒరుసుకు వస్తున్న గాలి స్పర్శకి సిగ్గుతో ఉక్కిరిబిక్కిరయ్యాయి. వానగాలి క్రమేణా నిలిచిపోయినా ఆకాశం మేఘావృత్తమయ్యే ఉంది. ఆశ్రమానికి దగ్గరగా ఉన్న చిన్న ఇళ్ళ మీద చెమ్మ కూర్చుని ఉంది.

పెద్దవానంటే శారదకి ఎంత ఇష్టమో! చూరునుంచి కారే నీటిధారలో చేతిని ఎగరేస్తూ ఛిన్నాభిన్నమైన తుంపరలు మొహం మీద పడి కళ్ళమీదకి జారకుండా కళ్ళని సగం మూసుకునే శారద భంగిమ ఎంత బాగుండేదో! ఆమెకు సంబంధించిన ఆలోచనలు 'ఉగాది పచ్చడి రుచిలా ఆనంద.. విషాదా ల మిశ్రమం!' అనుకున్నాడు కృష్ణారావు.

"ఇక్కడి చికిత్స వలన మీకేమైనా ఉపశమనం లభిస్తే మాకు చాలా సంతోషం! మీరు కోరుకుకన్నట్టే రెండు రోజుల క్రితం మంచి వాన కురిసింది కదూ? బెస్ట్ ఆఫ్ లక్!" అంటూ ఉత్సాహంగా డాక్టర్ కరచాలనం చేసేడు కృష్ణారావుని సాగనంపుతూ.

కొచ్చిన్ విమానాశ్రయం నుంచి మీదకి లేస్తున్న విమానం లోంచి బైటకి చూసేడు కృష్ణారావు. పచ్చని చెట్లు ముసుగేసి భూమిని కట్టినట్లుంది. సముద్రతీరానికి దగ్గరగా ఉండడం వలన పుష్కలంగా కురిసిన వాన కేరళ రాష్ట్ర హరిత వర్ణానికి ముఖ్యకారణం. వేషభాషల మాట ఎలా గున్నా, దైనందిన జీవితంలో కేరళ రాష్ట్ర ప్రజలు ఇతర రాష్ట్రాల కంటే భిన్నంగా ఉన్నారా? అనిపించింది తనకి. దుకాణాలలో 'బేరం లేదు, ఒకే ధర' లాంటి బోర్డులు పెట్టి ఉన్నాయి. కూడళ్లలో ఆటో రిక్షాలు వరుసగా నిలుచుని ఉంటాయి. ఆటో రిక్షాలో ఎక్కి కూర్చుని ఫలానా చోటుకి వెళ్ళాలంటే గమ్యస్థానం చేర్చేక

ఎంత కిరాయో చెబుతారు. దానిలో బేరం ఉండదు. ఆశ్చర్యం ఏమిటంటే శుభ్రంగా ప్రతిరోజూ తలస్నానం చేసే స్త్రీలు పూలు ధరించరు! గల్ఫ్ దేశాలనుంచి వస్తున్న ధనం, ధరల్ని ఆకాశంలోకి ఎగరేయడంతో నిరుద్యోగుల సంఖ్య పెరిగింది అనుకుం టుంటే మేఘాల మధ్యకి విమానం చేరు కుంది.

రెండుగంటల తరువాత బట్టతల మీది కాసిన్ని వెంట్రుకల్లా కాంక్రీట్ కట్టడాలు, ఇళ్లమధ్య చెట్లు దర్శనమిస్తూంటే విమానం విశాఖపట్నం విమానాశ్రయంలో దిగింది.

అవుట్ గేట్ దగ్గర నిలుచున్న డ్రైవర్ సత్యాన్ని చూసి, చేయి ఊపి, కారు దగ్గరకి నడిచేడు కృష్ణారావు.

తొందరగా డిన్నర్ ముగించి పరుపు మీదకి చేరేడు కృష్ణారావు.

ఉదయమే తలుపు తడుతున్న కొండడని చూసి "ఏమిటి ఇలా వచ్చేవు? " అనడిగేడు కృష్ణారావు. చిన్ననాటి స్నేహితుడిని, సమ వయస్కుడిని ఎలా సంబోధించాలో కొరుకుడు పడలేదు.

"మా మేనకోడలు ఊరెళ్ళింది. మరి మీకు భోజనమెలా? " అడిగేడు కొండడు.

"ఏమీ ఫరవాలేదు! సర్దుకుపోగలను! నీ మేనకోడలు ఎప్పుడు తిరిగివస్తుంది? వచ్చేక, వంటచేసేటప్పుడు కారం బాగా తగ్గించమని చెప్పు. నే చెబితే వినడం లేదు. లోపలికి రా కాఫీ ఇస్తాను" అంటూ కొండడిని ఆహ్వానించేడు కృష్ణారావు.

సంశయిస్తూ లోపలికి వస్తున్న కొండ డితో "కూర్చో" అంటూ డైనింగ్ టేబిల్ దగ్గర ఉన్న కుర్చీ బైటకి లాగేడు.

కుర్చీలో కూర్చున్న కొండడు కాఫీ కప్పు అందుకుంటూ "ఈమధ్య వనజమ్మగారిని చూసొచ్చేరా? మీ తమ్ముడుగారు ఎలా ఉన్నారు? " అడిగాడు.

సంభాషణ, తను కేరళ చికిత్సాలయా నికి వెళ్ళడం గురించి చెప్పేక "రిటైర్ అయేక మా తమ్ముడు, అమెరికాలోని తన కొడుకు దగ్గరకి వెళ్ళిపోయేడు. ఇప్పుడు అక్కడే బస"

"ఇప్పుడా? ఈ వయస్సులోనా వలసవె ళ్ళడం? "

"ఉన్న ఒకే ఒక కొడుకు దగ్గరికి వెళ్ళాడు. తప్పేముంది? "

"మరి మీరు? "

కృష్ణారావు పేలవంగా నవ్వేడు. ప్రశ్నకి సరైన సమాధానం చెప్పలేనప్పుడు నంగిగా నవ్వే నవ్వది. వంటింట్లో జొరపడి, డబ్బా లో ఉన్న సున్నుండలని తస్కరిస్తుంటే తల్లి కంటపడినపుడు ఏంచేయాలో తోచక నవ్విన నవ్వులాంటిది. హాఫ్ పెడల్ తో సైకిల్ నడుపుతూ కిందపడి గాయం అవగా పరామర్శించడానికి దగ్గరగా వచ్చిన వాళ్ళతో 'ఏమీ అవలేదు.. ఏమీ అవలేదు' అంటూ బీరాలు పలుకుతున్నపుడు ఉద్భ వించిన నవ్వులాంటి నవ్వది.

కొండడి వేపు చూడకుండా కాఫీ తాగడం కొనసాగించేడు కృష్ణారావు.

"నా మేనకోడలు నాలుగురోజులు పోయేక వస్తుంది కృష్ణబాబూ" అంటూ కొండడు కదిలివెళ్ళేడు.

'బ్రెడ్, బటర్, జామ్, కార్న్ ఫ్లేక్స్, సూపు పేకెట్లు, పాలపేకెట్లు ఉన్నాయి. ఇబ్బంది లేకుండానే గడుస్తుంది. అంతంత మాత్రమే వచ్చిన వంట జోలికి తను పోద లుచుకోలేదు' అనుకుంటూ కొండడి మేన కోడలు రాకపోవడానికి సమాధానపడ్డాడు కృష్ణారావు. కొండడి మేనకోడలు కొండడికి వండి పెడుతుంది. ఆమె భర్త విశాఖప ట్నంలో ఉద్యోగపు వేటలో ఉన్నాడు. అత నికి ఉద్యోగం రాగానే ఆమె భర్త దగ్గరికి వెళ్ళిపోతుంది. 'అప్పుడు? ఆc! అప్పుడు? ' అంటూ మెదడు కృష్ణారావుని నిలదీసింది.

రెండు సవత్సరాలు పైనే అయింది తను ఈదేశం వచ్చి. తను ఇండియా వచ్చి సంవత్సరం గడవక ముందర కొడుకు

ప్రకాష్‌కి, కూతురు శైలజకి తన మీద పీక లవరకు కోపం ఉండేది. మా నాన్న మమ్మల్ని 'వదిలి వెళ్ళేరు' అని తనని దుయ్యపట్టేరుట. ఇండియా నుంచి తను ఫోన్ చేస్తే ఫోన్ ఎత్తలేదు. రెండుసార్లు వాళ్ళ ఆన్సరింగ్ మెషిన్‌మీద తను వాళ్ళ బాగోగుల గురించి ప్రస్తావించినా వాళ్ళు పట్టించుకోలేదు. ప్రకాష్ కొడుకు వినయ్‌కి, శైలజ కొడుకు ఉత్తమ్‌కి తనంటే అభిమా నమే. ఇద్దరూ కూడపలుకుకుని సెలవు దినాలలో తన దగ్గరికి వచ్చి గడిపేవారు. తను వాళ్ళకి అవీ, ఇవీ కొనిపెట్టడమే కాకుండా, రహస్యంగా డబ్బు ఇచ్చేవాడు.

"డేడీ! మీరు వాళ్ళని చెడగొడుతు న్నారు!" అనేవారు ప్రకాష్, శైలజలు.

ప్రకాష్, అతని భార్య శ్రావణి, శైలజ ఆమె భర్త యుగంధర్ సాఫ్ట్‌వేర్ ఉద్యోగు లవడంతో వాళ్ళ జీవితాల్లో ఎక్కడలేని టెన్షన్. ఆర్థికమాంద్యం ప్రభావంతో ఉద్యో గాలు కోల్పోయి, తిరిగి ఆరేడు నెలల తరు వాత మంచి కంపెనీలో నిలదొక్కుకున్న వాళ్ళే. మంచి ఇళ్ళు కొనుక్కుని స్థిరపడిన వాళ్ళే. అయినప్పటికీ వాళ్ళకి తీరుబడి లేదు. పిల్లలకి చదువులలో ఏ గ్రేడ్లు రావ డంలేదని చింతిస్తారు కానీ వాళ్ళ గురించి ప్రత్యేకమైన శ్రద్ధ కనపరచరు.

"మనం ఏం చెప్పినా వాళ్ళ తలకెక్కదు" అని ప్రకాష్ అంటే "మా వాడు డాక్టరవుతా డన్న ఆశ నాకుంది" అంటుంది శైలజ.

కంప్యూటర్ తప్ప ఇంకేదైనా విభాగంలో డిగ్రీ తెచ్చుకుంటానని వినయ్ ప్రకటించిన వారం రోజులకే "డాక్టరా? ఆ ప్రెషర్ నాకు సరిపడదు" అన్నాడు ఉత్తమ్.

ఇండియాలో తల్లిదండ్రులు తమ పిల్లలు డాక్టరవాలని, ఇంజనీర్ అవాలని అభిలషించేవారు, తాపత్రయపడేవారు. పరీక్షల్లో మంచి రేంకులు రావాలని దేవు ళ్లకు మొక్కి కొబ్బరికాయలు కొట్టేవారు. ఆ ఇంగువ వాసన అమెరికాకి ఇండియన్లు తెచ్చేరు. నిజమే! డాక్టర్లకి, ఇంజనీర్లకి జీతాలు ఎక్కువే! కానీ ఆ పిల్లలకి డాక్టర వుదామని, ఇంజనీరింగ్ చదువుదామని ఉత్సాహం ఉండకపోతే ఎలా? 'రుబ్బుడు'

## 'చతుర'లో ఎనిమిదో నవల



అక్కినపల్లి సుబ్బారావు

స్వస్థలం విజయనగరం. వృత్తి ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ పాఠాలు చెప్పడం. చెన్నై, వరం గల్, ఢిల్లీలలో పని చేసేక, ఢిల్లీ ఐఐటి నుంచి డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నాను. 1980లో అమెరికా వలస వెళ్లేను. అక్కడ తిస్సాంగ్ యూనివర్శిటీ, కెనోషాలో దాదాపు పంతొమ్మిదేళ్లు పని చేసేక గౌరవ (ఎమెరి టస్) ప్రొఫెసర్‌గా రిటైరయేను. గతంలో 'నీళ్లలో చంద్రుడు, శీతాకాలం సూర్యుడు, పగ టిపూట చంద్రుడు, అంచుకి అంచుకి మధ్య, మరో వసంతం, సంజ వెలుగు, తోడు' నవ లలు చతురలో ప్రచురితమయ్యాయి. చతు రలో ఇది నా ఎనిమిదో నవల. నేను రాసిన సుమారు 70 కథలు విపులతో పాటు వివిధ పత్రికలలో ప్రచురితమయ్యాయి.

నేను రాసిన కథలు, నవలల మీద ఇద్దరు రీసెర్చ్ స్కాలర్లు పి.హెచ్‌డి. పట్టా కోసం పరిశోధన జరుపుతున్నారు. 'తోడు' నవల హిందీలోకి అనువాదమైంది.

**చిరునామా:**
**అక్కినపల్లి సుబ్బారావు,**
ఫ్లాట్ నెం. 412,
సాయి టవర్స్, రెడ్‌నామ్ గార్డెన్స్,
విశాఖపట్నం, పిన్ : 530002

సంప్రదాయాన్ని అమెరికాకి లాగుకుని వచ్చిన ఘనత తెలుగువాళ్ళదే! అయితే ఇండియాకి వచ్చిన కొత్తలో వినయ్, ఉత్తమ్‌లు వచ్చి తనతో ఒకవారం గడిపేరు సంబరపడుతూ. వాళ్ళలో ఆప్యాయత తనకి కనిపించింది. అది తెచ్చిపెట్టుకున్నది కాదు. తన దగ్గర నుంచి ఏమీ ఆశించికాదు. తన దగ్గర వాళ్ళకి తాము వాంఛించే 'ఫ్రీడమ్' గంతులేస్తుంది. అమెరికాలో ప్రతి పౌరుడు అన్నింటికన్నా ప్రాముఖ్యం ఇచ్చేది 'ఫ్రీడమ్'కే. అక్కడే పుట్టి పెరిగిన ఉత్తమ్, వినయ్‌ల ఆలోచన అలా ఉండడంలో ఆశ్చర్యమేముంది? ప్రకాష్ శైలజ తనంటే కోపం పెంచుకున్నా ఉత్తమ్, వినయ్ ఇండియా వెళ్ళడానికి అడ్డుపడలేదు. మనవలు అమెరికా తిరిగి వెళ్ళాక, ప్రకాష్, శైలజల దృక్పథంలో కాస్త మార్పు వచ్చింది. అమెరికాలో చాలామంది రిటైరయ్యేక, తాము అంతవరకు చేయకుండా వాయిదా వేస్తూవచ్చిన పనులు చేయడానికి పూనుకుంటారు. కొంతమంది కొత్తప్రదేశం చూడడానికి వెళ్తారు. చిత్రలేఖనం, సంగీతం మొదలుపెడతారు మరికొందరు. ఇదీ, అదీ అని కాదు, తమకి ఆనందం కలిగించే పనులే చేస్తారు. అమెరికాలో పుట్టిపెరిగి అక్కడి జీవితం గురించి క్షుణ్ణంగా ఆకళింపుచేసుకున్న ప్రకాష్, శైలజలు తను ఇండియా వస్తే అంత నిరసన ఎందుకు ప్రదర్శించేరు? తను వెళ్లి వాళ్ళతో కలిసి ఉండనపుడు వాళ్ళు తన ద్గగరకి వచ్చి ఉండనపుడు తను ఎక్కడ ఉంటే ఏమిటి? తను ఆనందంగా ఉండడమేగా వాళ్ళు కోరుకునేది! లేక వాళ్ళకి ఆనందం కలిగించేలా తను ప్రవర్తించాలనా వాళ్ల అభిమతం? మొదటి ప్రశ్నకి సమాధానం అవునంటే తను ఇండియా రావడం ఆమోదకరం అవాలి. కానీ రెండో ప్రశ్నకి అవునంటే ప్రకాష్ కోరిక మేరకు తను సర్దుకోవాలా? లేక శైలజ ఎలా చెబితే అలా వినాలా? ఇద్దరివీ భిన్న అభిప్రాయాలు అయితే? గత పదిహేనేళ్ళలో వాళ్ళు ఎప్పుడైనా తన మాటకి ప్రాధాన్యం ఇచ్చేరా? అనుకుంటే మూడేళ్ళ క్రితం జరిగిన సంఘటన జ్ఞాపకమొచ్చింది. శైలజని చూడడానికి వెళ్ళేడు.

"డేడీ! ఈవేళ ఇళ్లు చూడడానికి వెళ్దాం!" అంది శైలజ.

యుగంధర్ మౌనంగా తల ఊపేడు.

"ఈ ఇల్లు బాగుందిగా? " అన్నాడతను.

"లంచ్ చేసేక బయలుదేరుదాం. నాలుగు ఇళ్ళు చూద్దాం" అంటూ ప్రతిపాదన లాంటి హుకుం జారీచేసింది

'ఈ ఇంటిలో బాత్రూం బాగులేదు', 'ఈ ఇంటిలో పెరడు బాగులేదు', 'ఈ ఇంటిలో వెలుతురు రావడం లేదు', 'బెడ్రూంలు చాలా చిన్నవి' లాంటి కారణాలు చెప్పి వాటిని చూసి పెదవి విరిచింది.

శైలజ చెప్పిన ప్రతిదానికీ యుగంధర్ వత్తాసు పలుకుతున్నాడు. ఒకచోట ఏదో చెప్పబోతుంటే "నీకేమీ తెలియదు" అని అతని వాదనని తేలికగా కొట్టిపారేసింది.

ఇళ్ళ ఖరీదు దాదాపు మిలియన్ డాలర్ల దాకా పలుకుతున్నాయి. అమ్మకానికి పెట్టిన ఇళ్ళని మధ్యాహ్నం ఒంటి గంట నుంచి నాలుగు గంటల వరకు చూడవచ్చన్న బోర్డు చూసి ఇళ్ళు చూడడానికి వచ్చిన వాళ్ళలో అధికశాతం చైనీయులు, ఇండియన్లే! ఐటీ విభాగంలో త్వరితంగా పై మెట్టుకి వెళ్దామన్న ఊహల్లో చిన్నఇళ్ళ నుంచి పెద్దిళ్లకి మారడం ఒకటి. శైలజ ఆ కోవకి చెందిందే.

"నీకున్న ఇంట్లో అన్ని హంగులూ ఉన్నాయి. నాలుగు బెడ్రూంలు ఉన్నాయి చాలదా? " అనడిగేడు తను.

"అండర్‌స్టేండ్ డేడ్! నీకు తెలియనిదేమీ కాదు. నా ఇల్లు ఖరీదు ఆరు లక్షల డాలర్లు. ఈ ఇంటి మీద బేంక్ నుంచి తెచ్చిన అప్పుకి, ప్రతినెలా కడుతున్న

డబ్బుకి, మిలియన్ డాలర్లు ఇంటికోసం తెచ్చే పైకం మీద కట్టే డబ్బుకి అట్టే తేడా ఉండదు. రెండు సంవత్సరాల్లో ఇళ్ళ ఖరీదు పదిశాతం పెరిగితే, కూల్. నలభైవేల డాలర్లు లాభం. డబ్బుకి డబ్బు దాంతో పాటు స్టేటస్ పెరుగుతుంది" అంది శైలజ

"కానీ.."

"నాకు తెలుసు. రిస్క్ తీసుకోకపోతే ఏదీ రాదు" అంటూ సంభాషణని తుంచింది శైలజ.

"తాహతుకి మించిన ఇళ్ళని కొని డబ్బు చేసుకుందామన్న పేరాశే అమెరికాలో ఆర్థికమాంద్యం కలిగించిందని, చాలామంది నాశనమయ్యేరని చెబుదామనుకున్నా, అది శైలజ విషయంలో 'మెలకువగా ఉన్న దానిని లేపడంలాంటిదే' అనుకుని వాదన లోనికి దిగలేదు. శైలజ ధోరణిలో తన పోలికలేమీ లేవు. ఏ పనైనా ఆచితూచి కృష్ణారావు చేస్తాడని కొందరంటే, ఆ ఆచితూచి చేయడాన్ని పిరికితనంగా భావించింది శారద.

గబగబా ధనం ఆర్జించాలన్నది తాగుడుకి బానిసలాంటిదే!

తాగుడు! ఆచితూచి చూడకుండా ప్రవర్తించడం జరిగింది తన విషయంలో. తాడుగు మైకంలో ఉన్న జాన్‌తో పరిచయం వల్ల తనకి ఉద్యోగం వచ్చింది. మూడేళ్ళలో రెండు ప్రమోషన్లు లభించడంతో ఆఫీసులో తన ప్రాముఖ్యం బాగా పెరిగింది. ఆచితూచి చూడకుండా ప్రవర్తించింది తనకి ప్రమోషనొచ్చిందన్న సందర్భంగా ఏర్పాటుచేసిన పార్టీనాడు. పార్టీలో దాదాపు ఇరవై ఐదుమంది ఆహ్వానితులు ఉండి ఉంటారు. సాయంత్రం ఆరుగంటలకు మొదలయింది పార్టీ. తను ముందర బీర్ తాగేడు. తరువాత సహోద్యోగులతో కలిసి విస్కీ తాగేడు. క్రమేణా మద్యం ప్రభావం పెరుగుతోంది. అంతా కేరింతలమయం. కొత్తగా గదిలోకి వచ్చిన వాళ్లు, అప్పటికే పార్టీలో మునిగినవాళ్ళ మధ్య

> ## కొత్తగాలి...
>
> **'వాడి' మాట**
> **కరవాలమై దూసింది**
> **నా మౌనం**
> **డాలై నిలిచింది!**
>
> – వి. రాఘవరావు,
> నల్లకుంట, హైదరాబాద్

పలకరింపులు, ఆలింగనాలు, లేతలేతచుంబనాలు. ఆఫీస్‌లో సెక్రటరీ రోహిణి పార్టీకి ఆలస్యంగా వచ్చింది. కాఫీరంగు డ్రెస్‌లోంచి తెల్లని ఆమె శరీరం మెరుస్తోంది. డ్రెస్‌మీద ఏవో చమ్కీలు ఉన్నాయి కాబోలు, ఆమె కదలికలో లైట్ల వెలుతురు వాటి మీద పడుతుంటే మినుక్ మినుక్‌మంటూ అవి మెరుస్తున్నాయి. బాబ్డ్ హెయిర్ స్టైల్! బ్యూటీపార్లర్‌కి వెళ్ళింది కాబోలు కనుబొమలు విల్లువంచినట్లున్నాయి. పొడవాటి కంటిరెప్పలకి వేసిన నలుపురంగు, తెల్లని నుదుట కింద ప్రస్ఫుటంగా కొట్టొచ్చినట్టున్నాయి. చెవులకి అతి చిన్న జూకాలు, కనీకనిపించకుండా ఊగుతున్నాయి. డ్రెస్ రంగుతో మేచ్ అయేటట్టు పెదిమలకి కాఫీరంగు లిప్‌స్టిక్.

"హలో క్రిష్! కంగ్రాచ్యులేషన్స్!" అంటూ బొకే అందిచ్చి కరచాలనం చేసింది తనతో. రోజూ ఆఫీసులో చూసే రోహిణేనా ఈమె! అనిపించింది.

"థాంక్స్! ఏమి పుచ్చుకుంటావు? " అనడిగేడు తను.

"అఫ్‌కోర్స్ వైన్" అంది.

గ్లాసులో వైన్ పోసి ఆమెకి అందిచ్చేడు.

వైన్‌గ్లాస్‌తో తన పక్కనే చతికిల పడింది రోహిణి.

ఆమె ఏవేవో ప్రశ్నలు వేస్తోంది. తను

ఏం సమాధానాలు ఇచ్చేడో తెలియదు. ట్యూబ్‌లైట్ల వెలుతురులో ఎవరినైనా రెచ్చ కొట్టేలా ఉన్న ఆమెనే కళ్ళప్పగించి పరీక్షగా చూస్తున్నాడు. అటూ ఇటూ దృష్టి మర లినా, తిరిగి ఆమెపైనే దృష్టివాలుతోంది. ఇతరులు వచ్చి 'క్రిష్! మాతో ఒక డ్రింక్' అంటుంటే మరికొంత మద్యం కడుపులోకి వెళ్ళింది. రోహిణి, తన బాబ్డ్ జుత్తులోనికి చెయ్యి జొనిపి, కదిలించి, మోహనంగా నవ్వుతూ తనవేపు మొహాన్ని తిప్పింది.

"నన్ను పెళ్ళి చేసుకుంటావా రోహిణీ? " అనడిగేడు తను.

అంత కోలాహలంలోనూ, తను మాట్లా డిన వాక్యం అందరిలోనూ ఆసక్తిని రేకె త్తించిందేమో తెలీదు కానీ అందరూ తన ని, రోహిణిని గమనిస్తున్నారనిపించింది. ఒక్కసారి కోలాహలం సద్దుమణిగింది.

రోహిణి విలాసంగా నవ్వి "అమెరికాలో ఇలాంటి ప్రతిపాదన చేసేటప్పుడు మోకా ళ్ళమీద నిలబడి చేతిలో ఉంగరం ఉంచి 'నన్ను పెళ్ళాడతావా? ' అనడుగుతారు. ఫ రవాలేదు! షూర్! ఐ విల్! తప్పకుండా!" అని తనని పెదిమల మీద చుంబించింది.

తనకి దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చున్న జోసెఫ్ నిలబడి "ఎటెన్షన్ ప్లీజ్! ఇది విన్నారా? 'క్రిష్, రోహిణీని పెళ్ళి చేసుకుం టావా? ' అనడిగేడు. ఆమె ఒప్పుకుంది"

"ఇది సెలబ్రేట్ చేయవలసిన విష యమే! బెస్ట్ ఆఫ్ లక్ ఫర్ దెమ్! వాళ్ళకి శుభాకాంక్షలు" అంటూ అందరూ చప్పట్లు కొట్టేరు. ఒకరి తరువాత ఇంకొకరు వచ్చి తనకి, రోహిణికి శుభాకాంక్షలు తెలియచే సేరు. పార్టీ ముగిసేసరికి దాదాపు పద కొండు గంటలయింది. రోహిణి సహా యంతో ఇంటిముఖం పట్టేడు తను. సాయంకాలం నుంచి వివిధ రకాల మధు వులు సేవించడంతో, దాని ప్రభావం పరా కాష్టకి చేరుకుంది.

రోహిణి ఆ రాత్రి తనతో గడిపింది.

ఉదయం లేచేటప్పటికి తల దిమ్ముగా ఉంటే ఏస్ప్రిన్‌మాత్రలు వేసుకుని వంటగది లోకి వచ్చేడు. "కాఫీ కాచి వెళ్తున్నాను. నువ్వు ఆఫీసుకి ఆలస్యంగా వస్తావని మీ బాస్‌కి చెబుతాను. అర్థం చేసుకుంటారులే" అని రోహిణి పెట్టిన చీటీ ఉంది.

పదకొండు గంటలకి ఆఫీసు చేరిన తనతో "రోహిణిని పెళ్ళిచేసుకోబుతున్నా వట కదా! గుడ్! షి ఈజ్ ఎ నైస్ గర్ల్! చాలా మంచిపిల్ల" అన్నాడు తన బాస్ ఎదురుపడి.

ఆఫీసులో ఈ వార్త దావానలంలా వ్యాపించింది.

మద్యం ప్రభావంలో క్షీణించిన విచక్షణా జ్ఞానంతో, ఆ క్షణంలో ఆమె వేసుకున్న దుస్తులు, హావభావాలు చూసి తను వివ శుడై "నన్ను పెళ్ళి చేసుకుంటావా? " అన డిగేడు. మత్తు ప్రభావం లేకపోతే ఆమెని అలా అడిగేవాడా? ఆమె అందంగా ఉండదా? అన్న ప్రశ్నలకి సమాధానం లేకపోయినా తను చటుక్కున అంత ధైర్యం చేసేవాడు కాదు. ఆ ఉద్దేశ్యం తనకి ఉంటే, ఆమెతో తనకి సఖ్యత ఉంటుందా? అన్నది నిశ్చయమయేక ఏదైనా నిర్ణయం తీసుకునేవాడు. కానీ ఇప్పుడు అది అప్ర స్తుతం. అందరి ఎదుటా "నన్ను పెళ్ళి చేసుకుంటావా? " అని రోహిణిని అడిగేక, దాని గురించి పునరాలోచించలేడు అనుకు న్నాడు తను.

రోహిణి! ఆమె గురించి తనకి తెలిసింది చాలా తక్కువే! ఏమవుతుందో? అను కుంటూ కణతలు పట్టుకున్నాడు ఆనాడు. ఆచితూచి తీసుకున్న నిర్ణయం కాదది. దుడుకుగా తీసుకున్న నిర్ణయమది. చూద్దా మంటే కనిపించని వీపు మీద మచ్చలా, ఎనిమిదివేల మైళ్ళ దూరంలో ఉన్న శారద తనని వెక్కిరించినట్లనిపించింది.

శారద జీవితపు రైలు పెట్టెలో తనకి స్థానం ఉందో? లేదో? తెలుసుకునేలోగా

ఆమె ప్రదర్శించిన నిరసన తనని చాలా కాలం వేధించింది. 'నువ్వు పిరికివాడివి!' అని తృణీకరిస్తూ ఉత్తరం రాసేక, ఆమె జీవితపు రైలు ఎప్పుడో వెళ్ళిపోయిందని గ్రహించేడు తను.

"ఇండియా వెళ్ళి పెళ్ళి చేసుకుందామా? " అని రోహిణిని అడిగితే "ఎందుకు? నాకు తెలిసిన వాళ్ళందరూ ఇక్కడే ఉన్నారు. వాళ్ళందరూ ఇండియా రావాలంటే తెగ ఖర్చు కదా? నీ దగ్గర బంధువులని ఇక్కడికి రమ్మని చెబుదాం! లేకపోతే పెళ్ళయ్యాక మనం ఇండియా వెళ్దాం!" అంది.



## కొత్తగాలి...

**మూడు ముళ్లు**
**ధర్మం, అర్థం, కామం**
**బ్రహ్మముడి**
**మోక్షసూత్రం**

– మాచన్న,
కల్యాణదుర్గం, అనంతపురం జిల్లా

ఆర్థికపరంగా ఆమె వాదనలో బలమున్నా పెళ్ళి ఇద్దరి మధ్య జరిగే తంతు. ఇద్దరి కుటుంబాలకి సమమైన ప్రాముఖ్యం ఉండాలి. ఆమె ప్రతిపాదనలో అది లేదు. గుడిలో పెళ్ళి చేసుకుని పెళ్లి నమోదు చేసుకున్నారు. రోహిణితో ఇండియాకి వచ్చి ఆమెని అందరికీ పరిచయం చేసేడు. ఆరేళ్ల తరువాత ఇండియా వచ్చేడు తను. వనజ పెళ్ళికి, రామారావు చదువుకి తండ్రి తెచ్చిన అప్పులు అప్పటికే తను తీర్చివేసేడు. 'పిరికివాడు'.. 'పారిపోయేడు' లాంటి బిరుదులు ఇచ్చి ఈసడించిన వాళ్లు కొందరు 'ప్రయోజకుడయ్యేడు! లేకపోతే ఈ రోజుల్లో ఎవరండీ సహాయం చేసేది?' అంటూ తనకి కొత్త విశేషణాలు ఆపాదించేరు. కానీ రోహిణి ఎవ్వరితోను కలుపుకోలుతనంగా మాటలాడలేదు. అమెరికాలో పెరిగిన రోహిణికి ఇండియా వాతావరణం వింతగా కనిపించింది కాబోలు! తన బంధువులు రోహిణిని గుచ్చిగుచ్చి చూడడం, వచ్చీరాని ఇంగ్లీషుతో తికమకగా వేసే ప్రశ్నలు ఇబ్బంది పెట్టేయి. ఎంత త్వరగా అమెరికా వెళ్లిపోతానా? అని నిమిషాలు లెఖ్ఖపెట్టింది. ఆమె ఎదుర్కొన్న ప్రశ్నలలో అంతరార్థం ఏమీలేదని, కేవలం కుతూహలం మాత్రమే అని ఎంత చెప్పినా రోహిణి శాంతపడలేదు, చిరాకు తగ్గించుకోలేదు. 'నాతో చదువుకున్న కొండడు' అంటూ అతనిని పరిచయం చేస్తే దాదాపు చిత్తరువల్లే నిలుచుండిపోయి జీవంలేని నవ్వుని మొహం మీద పులుముకుంది. వనజ, రామారావు, వైదేహి, తండ్రితో ముక్తసరి మాటలతో వారం గడిచేక 'హమ్మయ్య!' అని ఊపిరి పీల్చుకుంది. తమ కుటుంబ సభ్యులతో రోహిణి కలిసిపోయేలా ప్రవర్తించలేదే! అని తను దిగులు పడలేదు, కానీ నిరుత్సాహపడ్డాడు. తన రాక గురించి స్నేహితులకు ముందస్తుగా చెప్పకపోవడంతో వాళ్ళని కలవకుండానే అమెరికాకి తిరిగొచ్చేడు.

ఇండియా నుంచి తిరిగి వచ్చేక రోహిణి ఎక్కువ ఉత్సాహం ప్రదర్శించడం తను గర్హించలేదు. రవ్వంత ముభావత్వం తనలో చోటుచేసుకుంది.

నెల్లాళ్ళు గడిచేక "క్రిష్! నేను గర్భం దాల్చేను" అంది ఒక ఉదయం.

"అదేమిటి? కొంతకాలం పిల్లలు వద్దనుకున్నాంగా!" అన్నాడు ఆశ్చర్యపడుతూ.

"ఒకరోజు మాత్ర వేసుకోవడం మరచిపోయేను"

"ఇప్పుడేం చేద్దాం? "

"చెయ్యడానికి ఏమీలేదు! ఈ వార్త విన్నాక మా అమ్మానాన్నా తెగ సంబరపడతారు" అంది రోహిణి. ప్రసవానికి రెండువారాల ముందువరకు రోహిణి ఆఫీసుకి వెళ్లింది. గర్భం ధరించిన మొదటి దశలో తిన్న తిండి ఇమడక వమనాలు... తరువాత తనతో కలిసి వ్యాయామం చేయాలని రోహిణి పట్టుపట్టడంతో తనకి విశ్రాంతి ఉండేది కాదు. ప్రసవ సమయానికి ముందర ఒకరకమైన ఆంక్షలు, ప్రసవమయ్యేక ప్రకాష్ లోకంలోకి వచ్చేక ఇంకో రకమైన ఆంక్షలతో రోజులు వెళ్ళాయి. డ్యూటీల వారీగా రాత్రుళ్ళు లేచి పిల్లవాడికి పాలు పట్టడం, డైపర్లు మార్చడం వగైరా పనులతో నిద్ర సరిపోయేది కాదు.. ప్రకాష్‌కి ఆరునెలలు వచ్చేక

"సోమవారం నుంచి ఆఫీసుకి వెళ్ళబో తున్నాను. నా సెలవు అయిపోయింది" అంది రోహిణి.

"పగలంతా ప్రకాష్ సంరక్షణ ఎలా? "

"మా కుటుంబానికి తెలిసిన 'కల్పన' ఇంట్లో ఖాళీగా ఉంటోంది. ఆమె తో మాట్లాడేను. తను వచ్చి ప్రకాష్ సంరక్షణ అంతా చూసుకుంటుంది" అంది రో హిణి, ఇంక దాని గురించి చర్చించడానికి ఏమీ లేదన్నట్లు.

అయినా ఉండబట్టలేక..

"ఒకసారి ఇది నాతో చర్చిస్తే బాగుం డేది" అన్నాడు తను.

"నాకు తెలుసు. నువ్వు దీనికి అభ్యం తరం చెప్పవని"

రోహిణితో గత పద్దెనిమిది నెలల కాపు రంలో తనతో చర్చించకుండా కేవలం తానే తీసుకున్న నిర్ణయాలలో ఇది ఎన్నోది? అని తను లెఖ్ఖవేయలేదు. తనె ప్పుడైనా అభ్యంతరంలాంటిది వ్యక్తపరిస్తే 'క్రిష్! దీనికి అంతగా చర్చించవలసిన అవ సరం ఉందని నే భావించలేదు. సరే! నువ్వు చెప్పినట్లే చేద్దాం' అనేది. రోహిణికి తెలుసు తను రాద్ధాంతం చేయడని.

అదే ఆధారం చేసుకుని తను నిర్ణయిం చిందే చేసేది. ఒకటి, రెండుసార్లు ఇలా జరిగేక క్రమేణా తనలో ఒకరకమైన నిర్లి ప్తతకి బీజం పడింది. ప్రకాష్ ప్రసవం తరువాత, అనవసరంగా వచ్చిన శరీర బరువు తగ్గడానికి రోహిణి జిమ్‌కి పరు గులు పెడుతుంటే 'ప్రకాష్ సంరక్షణ ఎక్కువ కల్పన చేతిలో జరుగుతోంది' అని హెచ్చరించబోతే రోహిణి కస్సుమంది.

ప్రకాష్‌కి ఒక ఏడాదిన్నరకి..

"నేను మళ్ళీ గర్భంతో ఉన్నాను" అంది రోహిణి వెలిగిపోతూ.

'ఇప్పుడేం చేయడం? ' అన్న ప్రశ్న తను వేయలేదు. ఒకవేళ వేసినా దానికి ఏం సమాధానం వస్తుందో తనకి తెలుసు. పిల్లలు పుట్టబోయే ముందర తీసుకోవల సిన జాగ్రత్తలు, ఇద్దరూ డాక్టర్‌ని సంప్ర దించడం యాంత్రిక దినచర్య అయింది.

గతంలో కల్పన ఉదయం వచ్చి సాయం కాలం ఇంటికి తిరిగి వెళ్ళేది. కానీ శైలజ పుట్టేక, రోహిణి ఇద్దరి పిల్లల్ని సముదా యించలేకపోవడంతో కల్పన తమతోనే ఉండిపోసాగింది.

"ఇద్దరు పిల్లల్ని ఈలోకంలోనికి తీసుకు వచ్చేం. ఇహ పిల్లలు పుట్టకుండా ఆపరే షన్ చేయించుకో" అని తనంటే "అలాంటి దేమీ చేయను. ఇంకో ఇద్దరిని కనేస్తాను" అంది రోహిణి నవ్వుతూ. తన గుండె గుభేల్‌మంది. పిల్లల్ని పుట్టించడం కష్టం కాకపోవచ్చు. వాళ్ళని పెంచడానికి అపార మైన సహనం కావాలి. అదీకాక ఆర్థికంగా వాళ్ళ బాగోగులు చూడడానికి చాలా డబ్బు అవసరం. ఎవరో లెఖ్ఖలు కట్టి ఒక పిల్లవానికి హైస్కూల్ పూర్తయేసరికి రెండు లక్షల డాలర్లు ఖర్చవుతాయి అన్నాడు. ఆ అంకెలో ఎంత నిజముందో తను ఆలోచించలేదు కానీ డబ్బు పుష్క లంగా కావాలి అని మరోసారి అర్థమ యింది. తరువాత రోహిణి గర్భం దాల్చ కుండా తను జాగ్రత్తలు తీసుకున్నాడు.

శైలజ పుట్టిన ఆరునెలలకే తన తండ్రి మరణించేడు.

"ఇద్దరు పిల్లలతో నేను ఇండియా ఎలా రాగలను? " అన్న రోహిణి ప్రశ్న విన్నాక, తను ఒంటరిగా ఇండియా వచ్చేడు. అంత కుముందరే రామారావు తండ్రికి కర్మకాం డలు మొదలుపెట్టేడు.

"శాస్త్రం ప్రకారం నువ్వు ఈ తంతు నిర్వ హించాలి" అన్నాడు రామారావు.

"లేదు రామం. నువ్వే నాన్నని చూసేవు. నైతికంగా నీకే ఆ అర్హత ఉంది. ఏ నమ్మకాలూ ప్రత్యేకంగా లేని నే చేసే దానికంటే నువ్వే ఆ భారం వహించడం సముచితం" అన్నాడు తను.

## కొత్తగాలి...

**మేక**
**ఆకులను తింటుంది**
**మనిషి**
**మేకలను తింటాడు!**

– కేతేపల్లి డాగోజీరావు,
మహబూబ్‌నగర్

నెల్లాళ్ల సెలవు మీద ఇండియా వచ్చేడు తను. చనిపోయిన తండ్రిని అందరూ శ్లాఘిస్తుంటే, తండ్రి గురించి తనకేమీ తెలియదే అని తను కుమిలిపోయేడు. "నువ్వు అమెరికా వెళ్ళిన కొత్తలో ఇబ్బంది పడ్డా, తరువాత రోజుల్లో నువ్వు చేస్తున్న ఆర్థిక సహాయం గురించి అందరికీ గర్వంగా చెప్పేవాడు" అంటే, తనకి కడుపులోంచి దుఃఖం ఉబికి తనని ఉక్కిరిబిక్కిరి చేసింది. 'తను ఒక మంచి కొడుకేనా?' అన్న ప్రశ్నకి సమాధానం తోచక గింజుకున్నాడు. "జానకిరామయ్య, డబ్బుకి ఇరకాటంగా ఉన్న రోజుల్లో పరీక్ష ఫీజు కట్టేడు, మా అమ్మాయికి తెలుసా? మా వాడికి ఇంగ్లీషు పేపర్ మీద అపనమ్మకం కలిగి పరీక్ష రాయడానికి వెనుకాడుతుంటే, నాకు సాయంకాలం ఒక గంట ఖాళీ ఉంది, మీ వాడిని ప్రైవేటుకు పంపు" అన్నాడు. అది రెండేళ్ళ క్రితం! లాంటి వాక్యాలతో, ఎర్రగా ఉన్న పొయ్యిమీద సాంబ్రాణి జల్లితే ఇల్లంతా వ్యాపించిన సువాసనలా భౌతికంగా లేకపోయినా ఆయన జ్ఞాపకాల ఛాయలు ఇంటిలో అందర్నీ అలుముకున్నాయి. కాలంతోపాటు అవి పలచపడతాయన్న నగ్నసత్యం అందరికీ తెలిసినదే. తండ్రిగా, మానవునిగా తన బాధ్యతని నిర్వహించి వెళ్ళేడు. కానీ తను, కొడుకుగా తన బాధ్యత నిర్వర్తించేడా? ఏమో? ఆర్థికంగా తను తండ్రికి చేయూతనిచ్చేడు. కానీ పదేళ్ళలో తండ్రిని అమెరికా తీసుకురావడానికి ప్రయత్నం చేసేడా? రోహిణి ఊహలు, ధోరణి తెలిసిన తను ఆమెతో ఈ ప్రస్తావన తీసుకురాలేదు. తను ఆ ధైర్యం చేయలేదు. పిరికితనం! శారద తన బలహీనతని బాగా అర్థం చేసుకుంది!

తండ్రి దినకార్యాలు ముగిసి వనజ ఊరుకు వెళ్ళబోతుంటే తండ్రి కాగితాలు పరిశీలించడం జరిగింది. బ్యాంక్‌లో పది వేల రూపాయలు, ఒక ఎకరం మెట్ట పొలం ఉన్నాయని తెలిసింది. అందుచేత ఏమీ తగాదాలు లేపకుండా వనజ ఊరు వెళ్ళిపోయింది. రామారావు, వైదేహీలు పనిమీద బయటకి వెళ్ళేరు. తను వెలుతురు సరిగ్గా లేనిచోట కూర్చుని పేపరు చదువుతున్నాడు. సాయంకాలం తన ముస్తాబుని చూసి సంబరపడుతుంటే, తన ప్రాభవం మొదలవబోతోందని చీకటి ఉత్సాహం ప్రకటిస్తోంది. కిటికీలోంచి బైటకి చూస్తున్న తనకి, తలుపు తట్టిన శబ్దం వినిపించి తలుపు తెరిచేడు.

ఎదురుగా శారద! నాలుగు వీధుల కూడలిలో దుమ్ము, ధూళి ఆభరణంగా ధరించిన విగ్రహం మీద నీళ్ళు పోస్తే ప్రకాశించినట్లు, పదేళ్ళ నుంచి మసకబారిన శారద జ్ఞాపకాలు కళ్ళు తెరిచేయి.

"బాగున్నావా?" అంటూ లోపలికి వచ్చిందామె.

ఆవేళ శ్రావణ మంగళవారం కాబోలు! నీరసంగా ఉన్నా తెల్లని వెలుతురు ఆమె మొహం మీద వాలుతోంది. పదేళ్ళు అమెరికాలో నివసించడంతో తనలో తగ్గిన బెరుకుతనం ఆమెని పరీక్షగా గమనించనిచ్చింది. పసుపు రాసుకుని స్నానం చేసిన మొహంమీద పసుపుదనం ఆమె శ్వేతవర్ణపు మొహానికి పల్చగా అద్దుకుంది. కాటుక పెట్టుకున్న కళ్ళు, నుదుట ఎర్రని కుంకుమబొట్టు, గాలి బలంగా వీచకపో

యినా తలంటుకున్న పల్చని కేశాలు మొహంమీద వాలి కదులుతున్నాయి. బలం పుచ్చుకున్న చెక్కిళ్ళు, ట్యూబ్ లైటు వెలుతురులో నిగారింపు ఆపాదించుకు న్నాయి. పదేళ్ళ క్రితం మొహంలో ఉండే చిలిపితనం, కొంటెతనం స్థానంలో గంభీరత, తీక్షణత స్థిరనివాసం ఏర్పరుచుకోవడం చూసి 'పదేళ్ళలో శారదలో చాలా మార్పు వచ్చిందని' అనుకుని..

"ఆ! బాగానే ఉన్నాను" అన్నాడు తను. తరువాత జరిగిన సంభాషణ తనకి బాగా జ్ఞాపకం.

"చాలా మార్పు వచ్చింది నీలో" అంది.

"ఆ మాటే నే అందామనుకునేలోగా నువ్వు అన్నావు"

"మీ నాన్నగారు చనిపోయేరని, నువ్వు ఇక్కడే ఉన్నావని తెలిసింది. మా అమ్మని చూడడానికి వచ్చేను. నిన్ను పరామర్శిద్దామని ఇలా వచ్చేను. ఎన్నాళ్ళుంటావు? "

"మరో పదిరోజులు"

"నేను రేపు వెళ్ళిపోతున్నా. నాకొక పాప. రాజమండ్రి వస్తే మా ఇంటికి రా! ఆయనని పరిచయం చేస్తాను"

తనకి ఎన్నో ప్రశ్నలు వేయాలని ఉన్నా, అంత తక్కువ సమయంలో ఏ ప్రశ్న ముందర వేయాలో నిర్ధారణకి రాలేక తను సందేహిస్తుంటే "నీలో పిరికితనం పూర్తిగా పోలేదన్నమాట" అంది శారద.

ఆమెవేపు నిశితంగా చూస్తూ మంద హాసం చేసేడు తను.

"నేను ఇక్కడికి రావడానికి ఇంకో కారణం ఉంది. తొందరపడి అప్పట్లో నిన్ను నిందించినందుకు క్షమాపణ చెబుదామని వచ్చేను"

"ఎందుకు క్షమాపణ? "

"నువ్వు పిరికివాడిలా పారిపోయావని నిందించినందుకు" అంటూ శారద ఒక నిమిషం ఆగి అంది.

"తల్లిదండ్రులు పిల్లలు ఎదగాలని, పెద్ద పెద్ద పదవులు అలంకరించాలని అభిలషించడం కొత్తేమీకాదు. మా నాన్న అంతే!"

"నాకు తెలుసు" అన్నాడు తను.

"ప్రైవేట్ కి వచ్చినపుడు, ఇంజినీరింగ్ చదువుతున్న రోజులలో నువ్వు సెలవులకి ఇంటికి వచ్చినపుడు, నువ్వు నాతో మాట్లాడిన తీరో? లేక నేను స్పందించిన తీరో? ఆయనని భయపెట్టేయి. ఆయనలో అనుమానాలని రేకెత్తించేయి"

"అంత సన్నిహితంగా మనం ఎప్పుడు మసిలేం? "

"ఎప్పుడూ లేదు. కానీ ఆయనకి అలా అనిపించింది. నేను పెద్ద ఉద్యోగం చేయాలన్న ఆకాంక్ష ఆయనని పూర్తిగా కమ్మేసింది. దాని ప్రభావంలో పడి ఆయన తన చుట్టూ ఉన్నవాళ్ళని నొప్పించేరు. అందులో నువ్వొకడివి"

"నీ మీద ఆయన పెద్ద ఆశలే పెట్టుకున్నారు, ఏమైంది? "

"కాంపిటీషన్ పరీక్షకి వెళ్దామనుకున్నా, ఒక సంవత్సరం హాల్ టిక్కెట్ రాలేదు. మరుసటి సంవత్సరం హాల్ టిక్కెట్ వచ్చింది. నేను, నాన్న హోటల్ లో బస చేసేం. హైద్రాబాదులో జరుగుతున్న ఒక అలజడి వలన ట్రాఫిక్ లో ఇరుక్కుపోయి, పరీక్ష కేంద్రానికి అరగంట ఆలస్యంగా చేరేను. ఆ ముప్ఫయి నిమిషాలు వృథా కావడంతో మంచి రేంక్ రాలేదు.

## భలేభలే!

యూరప్ లో 16వ శతాబ్దంలో 60ఏళ్ళపాటు గొప్ప చిత్రకారుడిగా వెలుగొందిన టిషియన్, చార్లెస్ రాజు ఆస్థానంలో ఉండేవాడు. అందరూ అతనితోనే చిత్రాలు వేయించుకునేవారు. ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపాడతను. ఒక్కోసారి స్కెచ్ లు కూడా వేసుకోకుండా రంగులద్ది ఇచ్చేవాడు. ఒకచిత్రం వేస్తూ, మధ్యలో వేర్వేరు చిత్రాలు వేయాల్సి వచ్చేది.

తరువాత ఆయన నిరుత్సాహపడ్డారు. నా ధైర్యం సడలింది"

శారద రెండు నిమిషాలు కళ్లుమూసుకుని మౌనంగా ఉంది. పదాలు ఎలా పేర్చాలో మస్తిష్కంలో ఆలోచన చేస్తోం దేమోనని అనిపించేలా ఆమె నుదురుమీద అడ్డగీతలు కనిపించేయి. మూసుకున్న కళ్లు తెరచింది. అది తన భ్రమే కావచ్చు లీలగా ఆమె కనుపాపల మీద చెమ్మ!

"ఆయన నమ్మకాలని ఒక పక్కని పెడితే నేనంటే పిసరంత ఉత్సాహం ప్రదర్శించిన నీలో ఎంచడానికి ఏ లోపమూ లేదు. ఒకే ఒక గమ్యం వైపు పరిగెడుతున్న ఆలోచనా రైలు ఎక్కడైనా ఏదైనా ఆలస్యానికి కారణ మవుతుందేమోనన్న పిచ్చి భయంతో నిన్ను హెచ్చరించి నా దారిలోంచి పక్కకి నెట్టేరు మా నాన్న. నాకు చాలాకాలం తెలియలేదు. అందుకే 'పిరికివాడిలా పారిపోయేవు' అంటూ నిన్ను నిందించేను. ఉన్నట్టుండి నీ అమెరికా ప్రయాణానికి నేనూ ఒక కారణం అని అప్పట్లో గ్రహించలేదు.

కులం గోత్రం సరిపోయి, ఏడుతరాలలో ఏ లోపమూ లేని వంశంలో నాకు పెళ్లికొడుకును చూసేసరికి ఆయనికి వాస్తవికత తెలియవచ్చింది. నేను కలెక్టర్ కాలేదన్న బాధ, తనకి నచ్చిన గుణాలున్న వరుడు కనిపించక నిరాశ, ఆయనని కుంగదీసి అనారోగ్యానికి దారితీసింది. చనిపోయే ముందర ఒకరోజు నా మీద తను పెట్టుకున్న ఆశలు బహిరంగంగా నీకు వినిపించేలా తెలియపరచేనని, తను అలా చేయకుండా ఉండాల్సిందని వాపోయారు. మా నాన్న చనిపోయి నాలుగేళ్లయింది. ఈ విషయాలేవీ నీకు తెలియవు కదా!"

"నీకు వివాహమైందని, రాజమండ్రిలో ఉంటున్నావని మాత్రం తెలుసు. అంత కన్నా ఆసక్తి ప్రదర్శించడం మర్యాద కాద నుకున్నాను" అని తను అంటుంటే రామారావు, వైదేహి లోపలికి వచ్చేరు.

"మరి నే వెళ్తాను. మా రాజమండ్రి అడ్రస్ ఇదిగో!" అంటూ కాగితం అందించి వెళ్లబోతుంటే తను పరిచయాలు చేసేడు. ఏమి మాటాడకుండానే వైదేహి వచ్చి శారద నుదటని కుంకుమ పెట్టి, జాకెట్ ముక్క అందించింది. 'చీకటిలోకి వెళ్తున్న శారద ఒళ్లుచేసింది' అనిపించింది తనకి.

"నీకు మాస్టారమ్మాయి అంత బాగా తెలుసా? " అడిగేడు రామారావు.

"రెండు సంవత్సరాలు వేసవిలో నేను లెఖ్ఖలు మాస్టారింటికి ట్యూషన్‌కి వెళ్లేనని నీకు తెలుసు. నేనూ, తనూ మరో ఏడెనిమిది మంది విద్యార్థులు కలిసి లెఖ్ఖలు చేసేవాళ్లం. శారద చాలా తెలివైంది" అన్నాడు తను.

"ఏం తెలివో? ఏమో? ఐ.ఏ.ఎస్ పరీక్షకి రెండుసార్లు ప్రయత్నం చేసి ఫెయిలయింది. మేస్టారు పెద్ద సంబంధం అంటూ ఒక బేంక్ క్లర్క్‌కి ఇచ్చి పెళ్లిచేశారు" అన్నాడు రామారావు.

"శారద భర్తని నువ్వు చూశావా? " అనడిగేడు తను.

"చూశాను. చాలా సామాన్యంగా ఉంటాడు. రెండోసారి చూడాలనిపించే వ్యక్తి కాదు" అంటూ రామారావు లోపలికి వెళ్లేడు.

ఇంజినీరింగ్ ముగిసిందని మంచి మార్కులతో ఉత్తీర్ణుడయేనని చెబుదామని లెఖ్ఖల మాస్టారింటికి వెళ్లేడు తను. మాస్టారు పని మీద బైటకి వెళ్లడంతో మర్నాడు వస్తానని చెప్పి శారదతో రెండు నిమిషాలు మాట్లాడి, ఇంటికి మళ్లేడు.

మర్నాడు తను వెళ్లేటప్పటికి మాస్టారు, మాస్టారి భార్య ఏదో తీవ్ర చర్చలో ఉన్నట్లున్నారు.

"అది కాదండి!" అంది మాస్టారి భార్య.

"నువ్వు నాకు ఏమీ చెప్పకు, ఏ సిఫారసులు చేయకు. శారద ఐ.ఏ.ఎస్ పరీక్ష పాసవాలి. తరువాత కులం, గోత్రం సరి

పోవాలి. అప్పుడే దాని పెళ్లి గురించి ఆలోచిస్తాను. శారదని పెళ్లి చేసుకోవడా నికి కలెక్టర్ తాహతు ఉండాలి. ఏడు తరాలు వెనక్కి వెళ్లి, మంచి చెడు ఆరా తీయాలి. 'ప్రేమ', 'వశీకరణ' అంటూ వల్లెవేసే వాళ్ళంటే నాకు అసహ్యం. శారద అలాంటి పనులకు దూరంగా ఉంటుందను కుంటున్నాను" అన్నారు మాస్టారు.

సాయంకాలం ఐదు గంటలకి వస్తానని, అదే సమయంలో మాస్టారి దగ్గరికి వచ్చే డు తను. బైట నిలుచున్న తనకి మాస్టారి ఉద్దేశ్యం, హెచ్చరిక స్పష్టంగా తెలియవ చ్చేయి. ఆలోచించేక ఆ హెచ్చరిక తనకే అని గ్రహించేడు.

అంతే! తను శారదని కలవకుండా అమె రికాకి వెళ్లిపోయేడు.

పరిస్థితులు మనుష్యులని మారుస్తాయి. శారద మీదున్న ఉబలాటాన్ని తను చంపుకుంటే, అల్లుని కోసం ఆకాశంలోకి చూసిన మాస్టారి చూపు విరిగి నేలమీద పడింది. కుందేటి కొమ్ముని వెతికే తండ్రి, పలాయనం చిత్తగించిన తను, ఇద్దరిమధ్య కుడితిలో పడ్డ ఎలుకలా శారద ఆయాస పడిందేమో! అనుకున్నాడు..

"అన్నయ్యా! ఎల్లుండి నాన్న అస్థికలు గోదావరిలో కలపడానికి వెళ్దామనుకుంటు న్నాను, వస్తావా? " అడిగేడు రామారావు.

"వస్తా రామం! కానీ దీనిలో కూడా నా పాత్ర పరిమితమే"

"ఇంకా ఎన్నాళ్లు సెలవు ఉంది నీకు? "

"పది రోజులు. నిమజ్జనం చేసేక మాస్టారమ్మాయి శారద ఇంటికి పదినిమి షాల పాటు వెళ్దాం. అడ్రసు నా దగ్గర ఉంది. నువ్వు శారద పెళ్లికి వెళ్లేవా? నాన్నకి ఆహ్వానం వచ్చి ఉంటుంది"

"వెళ్లేను. ఆ వేళ అతి దట్టంగా కురిసిన వాన వలన ఆ పెళ్లి అస్తవ్యస్త్యంగా జరి గింది. మాస్టారు చాలా డీలా పడ్డారు" అన్నాడు రామారావు.

"అతిగా ఆశలు పెట్టుకున్న ఊహల చెట్టు మీద గొడ్డలి వేటు పడితే విచారంలో మునిగిపోవడం ఏమంత విశేషం? "

"కూతురి పెళ్లి చేసిన ఏడాదిలోనే ఆయన చనిపోయేరు, పాపం!" అన్నాడు రామారావు.

మౌనంగా తల ఊపేడు తను.

'పదేళ్ల తరువాత కనపడి క్షమాపణ చెప్పిన శారద తనకి కొంత శాంతినిచ్చింది' అనుకున్నాడు కృష్ణారావు.




**కాలిఫోర్నియా:**

స్కూల్ నుంచి మూడు గంటలకి తిరిగి వచ్చిన అనంత్ హాలులో కూర్చున్న రామారావుతో "ఇండియా వార్తలన్నీ చది వేసావా తాతయ్యా? " అని, "ఎప్పుడూ వం టింట్లో ఏదో వండుతూ కనిపిస్తావు" అని వైదేహిని పలకరించి గదిలోనికి వెళ్లేడు.

వచ్చీరాని తెలుగులో పుష్కలంగా ఇంగ్లీషు పదాలు ఉపయోగిస్తూ అనంత్ పలకరించడం రవ్వంత విచిత్రంగా ఉంటుంది రామారావు, వైదేహిలకి.

వినోద్, ఉషలు ఉదయం లేచిన దగ్గర నుంచి ఆఫీసులకి వెళ్లడానికి పరుగే పరుగు. సాయంత్రం దాదాపు ఆరున్నర గంటలకి అలసిపోయి వస్తారు. ఇంత తిండి తిని, కాస్సేపు టెలివిజన్ చూసి నిద్ర లోకి జారుకుంటారు. ఇంట్లో ఉన్న రామా రావు, వైదేహిల గురించి ప్రత్యేక శ్రద్ధ

చూపకుకుండానే రోజులు వెళ్తున్నాయి.

"అనంత్! హోమ్‌వర్క్ పూర్తయిందా? రాబోయే టెస్ట్‌లు ఏమిటి? మధ్యంతర పరీక్షలకు బాగా చదువుతున్నావా? వచ్చే సంవత్సరం తరువాత వెళ్లబోయే కాలేజీల గురించి వివరాలు సేకరించేవా? కమాన్ మేన్! షో సమ్ ఇంట్రస్ట్! కాస్త ఉత్సాహం చూపించు! ముందు మేలుకోకపోతే అవకాశాలు జారిపోతాయి. యూ నో!" వినోద్ ప్రశ్నతో డైనింగ్ టేబుల్ మీద భోజనం చేస్తున్నప్పుడు ఇంటిలో నిశ్శబ్దం పోయి చలనం వస్తుంది.

అప్పుడప్పుడు "నేనూ నడకకి వస్తాను!" అని అనంత్ తయారవుతుంటే రామారావుకి నడక మీద ఉత్సుకత పెరిగింది. పరమేశ్వరరావుగారు తెచ్చి ఇచ్చిన పదిహేను వందల డాలర్లు ఉండడంతో పర్సులో డబ్బు ఎంతుంది? అని పరీక్షగా చూడకుండా అనంత్‌కి ఐస్‌క్రీమ్, వెజిటబుల్ బర్గర్‌లు కొనిపెడుతున్నాడు. ఒకమూల నుంచి 'డబ్బు అయిపోతుంది జాగ్రత్త!' అని మెదడు మూల్గుతున్నా, పట్టించుకోలేదు రామారావు.

"అమెరికాలో ఈ వయస్సు వాళ్లకి స్నేహితులు తెగ ఉంటారని విన్నాం. మన అనంత్ స్నేహితులు ఎవ్వరూ కనపడటం లేదే!" అంది వైదేహి.

"వాడిని నువ్వు బాగా గారాబం చేస్తున్నట్లుంది. స్కూల్ నుంచి వచ్చేక కబుర్లు చెబుతూ నీ చుట్టూ తిరుగుతూ ఉంటాడు"

"ఆపండి! మీరు చేయడం లేదా? నడకకి వెళ్లేటప్పుడు వాడికి ఐస్‌క్రీమ్ కొనడం లేదూ! అవును, అంతా బాగానే ఉంది కానీ అనంత్ చేతులు ఊపడం, నడక ఏదోలా ఉంటుంది" అంది వైదేహి.

తనకీ అలాగే అనిపించిందని చెబుదామని ఉన్నా వారించుకుని "ఏదో వంకలు పెట్టడం నీకు అలవాటేగా!" అన్నాడు రామారావు.

వారంలో మూడు రోజులు వినోద్ ఇంటి నుండి పనిచేస్తుంటే, పగలంతా రామారావు, వైదేహి, అనంత్‌లు అతి మెల్లగా మాటాలాడుకోవలసివస్తోంది. వినోద్ తన ఆఫీసు గదిలో పని చేసుకుంటుండడంతో అతని పనికి భంగం వాటిల్లుతుందేమోనని శబ్దం చేయకుండా జాగ్రత్త పడుతున్నారు.

రోడ్లమీద కార్ల రద్దీ, కాలుష్యం తగ్గుతుందని ఒకేరోజు ఆఫీసుకు వచ్చే వాళ్ల సంఖ్య తక్కువగా ఉంటే, చిన్నఆఫీసు జాగా చాలని చాలా కంపెనీలు ఇంటి నుంచి పనిచేయడానికి ప్రోత్సహించేయి. ఒక కంపెనీకి పని చేసేవాళ్లు వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో ఉంటే ఆఫీసులో అందరూ ఒక బల్ల దగ్గర కూర్చుని పనిచేయడం వీలవడం లేదు. వీడియో కాన్ఫరెన్సులద్వారా పనిచేస్తుంటే ఏదో లోపిస్తోందని అభిప్రాయపడి, ఇంటి నుంచి పనిచేయడం తగ్గిస్తున్నారట! ఇదే వినోద్ చెప్పేడు. "ఒక నెల రోజుల తరువాత మా యాజమాన్యం ఇంట్లోంచి పనిచేయడం నిలుపుచేయబోతోంది. ఇంట్లోంచి పనిచేస్తే కనీసం పదిగంటలు పనిచేస్తాం. ఆఫీసుకి వెళ్తే కేవలం ఎనిమిది గంటలే" అన్నాడు.

"రోడ్డు మీద పెట్రోల్ ఖర్చుపెడుతూ పరిగెత్తే కంటే ఇంట్లో ఉండి పనిచేయడం మంచిది" అంది ఉష.

"దానిలో నిజమున్నా, నిర్ణయించేది కంపెనీయే" అని ఉషతో అంగీకరించేడు.

వినోద్ ఇంటిలో ఉండి పనిచేస్తూంటే, డ్రామా నడుస్తుంటే కుర్చీలో ఉత్కంఠతో కూర్చున్న ప్రేక్షకులలా ఉంది. గుసగుసగా మాటలాడుకోవడం, కొళాయిలో గిన్నెలు కడిగేటప్పుడు వైదేహి చప్పుడు చేయకుండా సన్నని నీళ్లధారని వాడుతుంటే ఇంటిలో ఏదో అసహజత్వం తాండవిస్తోందనిపించింది రామారావుకి.

"తాతగారు! మీరు మా నాన్నని పెంచి

నట్లు, మా డేడి నన్ను పెంచితే బాగుం డును" అన్నాడు అనంత్ ఒకరోజు. ఆ వాక్యం తనలో ఆనందం కంటే ఆశ్చర్యాన్ని, విచారాన్ని కలిగించింది.

"ఏం? అలా అన్నావు? మీ డేడి నీ గురించి మంచి శ్రద్ధ తీసుకుంటున్నాడే!"

"డేడి నాకేమీ తక్కువ చేయడం లేదు. అలా ఎందుకు అన్నానో తెలియదు" అంటూ అక్కడి నుంచి లేచి వెళ్లేడు అనంత్.

వినోద్ చదువు గురించి తను తీసుకున్న శ్రద్ధ ఎక్కువే. ట్యూషన్లకి, ఇతర స్కూళ్లలో వివిధ రకాల పోటీలలో పాల్గొనమని వినోద్ వెనకాలపడి ఉత్సాహపరిచేవాడు. వినోద్‌కి మంచి రేంక్ రావడంతో మంచి కాలేజీలో కోరుకున్న బ్రేంచ్‌లో సీటు వచ్చింది. ఇంజినీరింగ్ మూడో సంవత్సరంలో ఉండగా తన ఆసరాతో అమెరికా చదువుకి దరఖాస్తులు పంపడం మొదలుపెట్టేడు. ఇంజినీరింగ్ ఆఖరి సంవత్సరంలో ఉండగా కేంపస్ ఇంటర్వ్యూలో ఎంపికయేడు. చదువు ముగియగానే అమెరికాలో ఉద్యోగం వచ్చింది. వినోద్ సంశయిస్తుంటే త్వరగా వెళ్లమని బాగా ఒత్తిడి తెచ్చేడు తను.

'అమెరికా వెళ్లే అవకాశం రాలేదన్న తన వెలితి, వినోద్ వెళ్లడంతో కాస్త పూడింది. వినోద్ అనంత్‌కి తన తండ్రి తనని ఎలా ఉసి కొలిపి, ఉత్తేజ పరిచేడో చెప్పి ఉంటాడు. అనంత్‌కి అలా తన గురించి తండ్రి చేయడం లేదనిపించింది కాబోలు. కొడుకు గురించి ఎక్కువ శ్రద్ధ కనపరచాలని వినోద్‌కి చెబితే ఏమనుకుంటాడో?' అనుకున్నాడు రామారావు. తను, వైదేహి, కొడుకు, కోడలు మనవడి దగ్గర శాశ్వతంగా ఉండిపోదామని వచ్చేరు. చుట్టపు చూపుగా కాదు. తను, వైదేహి చుట్టూ ఉన్న పరిసరాలను పట్టించుకోకుండా తామరాకు మీద నీటిబొట్టులా రోజులు వెళ్లదీయలేరు. వాళ్ల జీవితాలతో మమేకం అవ్వాలి. కానీ అది సాధ్యమా? అన్న

## జనవరి - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **జె. విజయలక్ష్మి** - ట్రూప్‌బజార్, హైదరాబాద్
2. **జి. శోభ** - మంగళం రోడ్, తిరుపతి
3. **నిమ్మల రమాదేవి** - శాంతినగర్, హన్మకొండ
4. **వి. రాజేశ్వరి** - రామారావు పేట, కాకినాడ
5. **చెరువు హరిణి శర్వాణి** - నాగోలు, హైదరాబాద్

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. వెంకటస్వామి | 6. రోషన్ |
| 2. సుబ్బారావు | 7. గిరిజమ్మ |
| 3. నాజర్ | 8. శాంత |
| 4. వదిన | 9. ఈజిప్షియన్లు |
| 5. సునంద | 10. రుద్రాభట్ల నరసింగరావు |

సంశయం కలిగింది రామారావుకి. తను ఈ దేశం వచ్చిన తరువాత ఏ రోజూ కొడుకు, కోడలు తమతో మనస్సు విప్పి మాటలాడలేదు. దానికి ఎక్కువ కారణం తనదే అయి ఉండవచ్చు. కానీ కొంత శాతం కారణం ఉషది, వినోద్‌లది. వాళ్ల ప్రవర్తనను తను తప్పు పట్టవచ్చు. తప్పు లేదనీ వాదించవచ్చు. తనకి ఎదురవుతున్న ఇలాంటి ఇబ్బందుల గురించి ఎవరితోనైనా మనసు విప్పి మాటలాడాలనిపి

కొత్తగాలి...

**రాత్రికి రాత్రే**
**రోడ్లు వేస్తున్నారు,**
**నోట్లు పంచుతున్నారు**
**ఏంటి విషయం?**
**అప్పుడే ఎన్నికలొచ్చేశాయా?**

– పి.వి.ఎల్. సుజాత,
సైనిక్‌పురి, సికింద్రాబాద్

స్తుంది. కానీ ఎవరితో? తనకి బాగా తెలిసిన వ్యక్తి పరమేశ్వరరావుగారు. ఆయన కొడుకు దగ్గరకి వచ్చేరు. ముప్ఫయి మైళ్ల దూరంలో ఉన్నారు. ఇలాంటి విషయాలు ఫోన్‌లో ఎలా మాట్లాడడం? అతని దగ్గ రికి తనూ, వైదేహి వెళ్లి ఒకరోజు గడిపి వస్తే? అది వీలయే పనేనా? తను తన వైపు నుంచి ఆలోచిస్తున్నాడు కానీ పరమేశ్వరరావుకి తన ఇంట్లో ఎలాంటి ఇబ్బందులు ఉన్నాయో? ఇదే ఇండియా అయితే ఏ పార్కులోనో, లైబ్రరీ దగ్గరో స్నేహితులు ముచ్చటించుకునేవారు. కానీ ఈ దేశంలో కారు లేకుండా ప్రయాణం అసంభవం. బస్సులలో అవస్థపడి ప్రయాణం చేసి పరమేశ్వరరావుగారి దగ్గర 'ఏమిటో నోయ్! మా అబ్బాయితో కులాసాగా మాటలాడడం కుదరడం లేదోయ్!' అని పితూరి చేస్తాడా? ఛ! ఎంత అసహ్యంగా ఉంటుంది. 'ఇది వడ్లపు గింజలో బియ్యపు గింజ! అందరి ఇళ్లలోనూ ఉంటుంది' అని పరమేశ్వరరావు అంటే తల ఎక్కడ పెట్టుకోవాలి? ఇండియాలో ఇదే పరిస్థితి ఎదురయితే తను చొరవ తీసుకునేవాడు. స్థానబలిమి తనకి ఇండియాలో ఉన్నట్లు అమెరికాలో ఎలా ఉంటుంది? అనుకుని తనలో తానే మథనపడ్డాడు రామారావు.

★ ★ ★

"మేం రీనో పట్టణానికి వెళ్తున్నాం! వస్తారా? " అడిగేడు పరమేశ్వరరావు.

"అక్కడ ఏముంది? ఎంత దూరం? అదీకాక అనవసరపు ఇబ్బంది" అన్నాడు రామారావు.

"లాస్ వెగాస్‌లాగే ఇదీ ఒక గేంబ్లింగ్ పట్టణం. దాదాపు రెండు వందల ఇరవై మైళ్ల దూరంలో, సుమారు ఆరువేల ఐదు వందల అడుగుల ఎత్తులో ఉంది. పెద్ద కారు, అందులో నేనూ, మా అబ్బాయి చంద్ర మాత్రమే ఉంటాం! ఆహ్లాదకరంగా ఉంటుంది ప్రయాణం. మా అబ్బాయికి జూదమంటే ఇష్టం. 'నీకు రీనో చూపిస్తాను' అన్న సాకుతో బయలుదేరుతున్నాడు. గతంలో రీనో చాలాసార్లు వెళ్ళేడు. అక్కడ డాలర్లతో జూదం ఆడితే పాయింట్లు వస్తాయి. ఆ పాయింట్లని వాడి చౌకగా అక్కడ బస చేయవచ్చు. వారాంతం వెళ్తే చాలా ఖరీదు. వారం మధ్యలో వెళ్తే అట్టే ఖర్చుండదు. మీకు ఒక గది, మాకు ఒక గది రిజర్వ్ చేయిస్తాను. దారి ఖర్చు సున్నా. అక్కడ ఒక రాత్రే ఉంటాం కాబట్టి, ఇక్కడ ఇంట్లో వండిన భోజనం పట్టుకెళ్లవచ్చు. రిఫ్రిజిరేటర్, మైక్రోవేవ్ ఓవెను ప్రతి గదిలో అమర్చి ఉంచుతారు. లంచ్‌తిని బయలుదేరుదాం. మర్నాడు డిన్నర్‌కి తిరిగి వచ్చేస్తాం. కాఫీకి, చిరుతిళ్ళకి కేసినో వాళ్లు ఫ్రీగా ఉపయోగించడానికి కూపన్లు ఇస్తారు. ఏమంటారు? " అన్నాడు పరమేశ్వరరావు.

"మీ ప్రతిపాదన విచిత్రంగా ఉంది. తికమకపెడుతోంది. ఈ వయస్సులో జూదం ఆడడానికి పరిగెత్తుకెళ్లడమా? "

"మీరు ఈ దేశం వచ్చి ఇంత కాలమైంది. కాళ్లకి ఫెవికాల్ అంటుకున్నట్లు ఇంట్లోనే ఉన్నారు. మార్పు కావాలి ఎవరికైనా! మా అబ్బాయి చంద్ర 'నాన్నా రీనో వెళ్దామా? ' అంటే ఎగిరి గంతేశాను. మీ అబ్బాయిని అడగండి. వాళ్లకి ఇష్టంలేని పని చేయవద్దు. మళ్లీ ఫోన్ చేస్తాను"

'పరమేశ్వరరావుగారితో తన గోడు విని పించుకోవడానికి ఇది మంచి అవకాశం. కానీ వినోద్ ఏమంటాడో? వైదేహి తనతో రీనో రావడానికి ఇష్టపడుతుందా? తను జూదం ఆడకపోయినా ఎంతోకొంత ఖర్చు వుతుంది. అనవసరపు ఖర్చు తను భరా యించగలడా? నలభై డాలర్లు ఖర్చవుతా యనుకుంటే ఆ డబ్బుతో వైదేహికి పదిరో జులు బొప్పాయి పండు కొనొచ్చు. ఇరవై సార్లు తను స్టార్‌బక్స్ దుకాణంలో కాఫీ తాగొచ్చు' అనుకుంటూ వైదేహితో పరమే శ్వరరావుగారి ప్రతిపాదనను చెప్పేడు.

"అవ్వ! జూదశాలలకా? మీకేం మతిపో లేదు కదా! ఈ వేళ జూదశాలలంటున్నా రు. రేపు బార్‌కి వెళ్లి డేన్స్‌లంటారు. మీ రింకా చిన్నవాళ్లు అనుకుంటున్నారా? మీ ఇష్టం! మీరు కావాలంటే వెళ్ళిరండి. నన్ను వదిలేయండి బాబు!" అంది వైదేహి.

కొడుకు వినోద్‌తో పరమేశ్వరరావుగారి ఆహ్వానం గురించి చెప్పేడు.

"మిమ్మల్ని ఎక్కడికైనా తీసుకెళ్దామను కుంటాం! ఆలోచించకుండా రోజులు వెళ్ళి పోతున్నాయి" అన్నాడు వినోద్.

"మిమ్మల్ని పిట్స్‌బర్గ్ తీసుకెళ్ళి వెంకటే శ్వరస్వామి దేవాలయం చూపించాలని ఒకసారి అనుకున్నాను. అనుకోకుండా ఎక్స్‌ట్రా హాస్పిటల్ పని తగిలింది, వీలవ లేదు" అంది ఉష.

"తాతయ్యా! అందొచ్చిన అవకాశాన్ని వ దులుకోకు. గ్రేబ్ ఇట్! నేను నీ స్థానంలో ఉంటే పరిగెడతాను" అన్నాడు అనంత్.

"నాన్నా! నీ దగ్గర డబ్బు ఉందా? లేక పోతే నేనిస్తాను. మనకోసం వాళ్లతో ఖర్చు పెట్టించడం బాగుండదు. ఈ దేశంలో ఇలాంటి ట్రిప్‌ల మీద వెళ్తే, ఖర్చు చెరి సగం భరిస్తారు. 'మేం వెళ్తున్నాం! మిమ్మల్ని తీసుకెళ్తాం!' అని పరమేశ్వరరా వుగారు ఆహ్వానించేరు కాబట్టి, మీ ఖర్చ యినా మీరు భరించాలి. ఇంకా టైముంది, నేను చంద్రతో మాట్లాడతాను" అన్నాడు వినోద్.

అరక్షణం తటపటాయించి "అత్తయ్యా గారూ! కాస్త ఇబ్బందయినా మీరూ వెళ్ళండి!" అంది ఉష.

"చూద్దాం!" అంది వైదేహి.

వంటిల్లు శుభ్రం చేసి పరుపు మీదకి చేరిన వైదేహి ఆలోచనలో పడింది. డైనింగ్ టేబిల్ దగ్గర చర్చ ఏ నిర్ణయమూ తీసుకోకుండా ముగిసింది.

'అత్తయ్యా! కాస్త ఇబ్బందయినా మీరు వెళ్ళండి' అంది ఉష. ఆ ఇబ్బంది నాకా? లేక తనకా? తను ఇరవైనాలుగు గంటలు వంట గదిలో పనికి పూనుకోకపోతే, ఉషకి పని తప్పదు. ఉష వంటకి బద్ధకిస్తే, పీజా తెప్పించుకుంటారేమో! లేకపోతే బైటకివెళ్ళి తిని రావచ్చు. ఇండియన్ ధాబా నుంచి కూరలు తెచ్చుకుని గడిపేయవచ్చు! పళ్లు తినో, ఇంకేదో చేసి రోజులు నెట్టేయవచ్చు! పెద్ద ఇబ్బంది ఏమీ కాదు. సజావుగా పరి గెడుతున్న రైలు, సిగ్నల్ పడక ఒక నిమిషం అనుకోకుండా ఆగినట్లు, రోజు గతిలో రవ్వంత తేడా ఉండవచ్చు. అందు చేత ఉష వాడిన 'ఇబ్బందయినా మీరు వెళ్లండి' అన్నది నాకే వర్తిస్తుంది. తన ఆరోగ్యం దృష్ట్యా హెచ్చరించింది. అపథ్యం చేసి తను జబ్బుపడితే డాక్టర్ దగ్గరకి పో వాల్సి వస్తుందని దూరపు ఆలోచనా? ఏమో! తనకి రీనో వెళ్ళడానికి నిజానికి ఆసక్తి లేదు. కానీ ఇంటిలో పని నుంచి రెండు రోజులు 'విముక్తి' అనుకుంది.

"ఏమండీ! రీనో వెళ్తే ఏమైనా ప్రత్యేక దుస్తులు వేసుకోవాలా? అనడిగింది వైదేహి. సమాధానం రాకపోవడంతో భర్త వేపు చూసి కళ్లు మూసుకుంది. లీలగా రా మారావు గురక వినిపించి 'ఏమిటో ఈ మగాళ్లు! వీళ్ళకి ఇట్టే నిద్ర వచ్చేస్తుంది' అనుకుంది.

వైదేహితో చర్చకి దిగడానికి ఇష్టం లేక

నిద్రపోతున్నట్లు నటిస్తున్న రామారావు జవాబు ఇద్దామనేలోగా 'ఏమిటో ఈ మగాళ్ళు' పదం నచ్చక స్పందించలేదు.

'ప్రత్యేక దుస్తులు వేసుకోవాలా?' అన్న దానికి సమాధానం ముందు రీనో వెళ్తున్నామా? లేదా? అన్నది నిశ్చయమవాలి. వైదేహి రాకుండా తను రీనో వెళ్ళడు. ఆమెని వదిలి తను రీనో ఎలా వెళ్ళగలడు? ముప్ఫయిఆరేళ్ల క్రితం వైదేహి తన జీవితంలో ప్రవేశించింది. 'పెళ్ళిచూపులకి రెండుజడలు వేసుకోవడమేమిటి? ఒత్తుగా ఉన్న నీ జుత్తు మీద ఇంకా ఒత్తుగా పూలు పెడతానే' అన్న తల్లి మాటలు వినకుండా, తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన వైదేహి లేకుండా తను రీనో వెళ్ళగలడా? మల్లవస్తాదులు శరీరం మీద నూనె రాసుకుంటే మెరిసినట్లు పందొమ్మిదేళ్ల వయస్సు యవ్వనంలో మెరిసింది ఆనాడు. ఆ సంగతే తరువాత చెబితే 'ఛ! అంత లావుగా ఉన్నానా? వస్తాదులు మీకు జ్ఞాపకానికి వచ్చేరా? అయ్యోరామా!' అంటూ కొంటెగా బుగ్గమీద చూపుడు వేలితో పొడిచింది. 'నువ్వు నచ్చేవని' చెప్పడానికి నువ్వు వేసుకున్న చిన్న బూటాలున్న జూకాలు, ఆల్చిప్ప ల్లాంటి చెవి మీద మెరవడం ఒక కారణం అని అందామనుకున్నా తను నిగ్రహించుకున్నాడు. కంటిరెప్పల మీద అతి పల్చగా పెట్టిన నలుపు రంగు నీ కళ్ళ వైశాల్యాన్ని పెంచినట్లనిపించిందని, చాలామంది అంత అందంగా పెట్టుకోరని ఉదహరిద్దామనిపించినా 'ఎంత మందిని చూసేరు?' అని కన్నెర్ర చేస్తుందేమోనని ఆపుకున్నాడు. 'ఆమెతో ఒంటరిగా ఐదు నిమిషాలు మాట్లాడాలి' అని తనంటే అందరూ విచిత్రంగా చూస్తుంటే, ఆశ్చర్యం, ఆనందం మిళాయించి ప్రశ్నార్థకంగా కనిపించిన మొహం నచ్చిందని, అది తన నిర్ణయాన్ని బలోపేతం చేసిందని చెబుదామనిపించినా 'మీవన్నీ రౌడీ వేషాలు' అంటుందేమోనని భయపడ్డాడు తను. ఇన్నేళ్లలో కీచులాటలున్నా అవి ఎప్పుడూ వ్యక్తిగతమైనవి కాలేదు. 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' లాంటి సినిమా డైలాగులు వల్లించకుండా నడిచింది జీవితం. వైదేహితో ఏకీభవించకుండా తాను చేసిన పనులు చాలా తక్కువ. ఇప్పుడు, ఆమెకి ఇష్టం లేనివి తనేమీ చేయదలచుకోలేదు. వైదేహి రీనో చూడడానికి వెళ్దామంటే తను బయలుదేరుతాడు. లేకపోతే లేదు. అనుకుని దుప్పటిని సమానంగా ఇద్దరిమీదా కప్పుకుని నిద్రలోనికి ఒరిగేడు రామారావు.

"వాళ్ళు రెస్టారెంట్‌లో తింటే తింటారు. మనం అలాకాదు. అందుచేత మనకి అవసరమయే తిండి, మందులు ఒక సంచీలో పెట్టి ఉంచు. కారులో కావలసినంత జాగా ఉందన్నారు పరమేశ్వరరావుగారు" అన్నాడు రామారావు వైదేహితో.

"మన ఇంటి నుంచి రీనో వెళ్ళేటప్పుడు దారిలో చంద్ర ఇల్లు ఉంది. అందుచేత నేను మిమ్మల్ని వాళ్ళ ఇంటి వరకు తీసుకెళ్తాను. మీరు తిరిగి వచ్చేక నేను వచ్చి పికప్ చేస్తాను" అన్నాడు వినోద్.

ఆ విషయం పరమేశ్వరరావుగారికి చెబితే 'సరే' అన్నారు. వినోద్ ఆఫీసు పని మీద ఊరెళ్ళడంతో పరమేశ్వరరావు ఇంటి దగ్గర అత్తా, మామలని దింపేపని ఉష మీద పడింది.

"మందులు జాగ్రత్త! రేపు రాత్రి వినూ వచ్చి మిమ్మల్ని తీసుకువస్తాడు" అంటూ ఉష వెళ్ళిపోతుంటే అసంకల్పితంగా జేబు తడుముకున్నాడు రామారావు.

"మా కోడలికి దీర్ఘకాలం కారు ప్రయాణం పడదు. అందుచేత కారంతా మన నలుగురిదే!" అని నవ్వుతూ సీట్ బెల్ట్ సవరించుకున్నాడు పరమేశ్వరరావు.

"కేలిఫోర్నియా రాష్ట్రంలో వెనుక సీటులో కూర్చున్న ప్రయాణికులు కూడా

సీటు బెల్ట్ వేసుకోవాలి. ఏకబిగిన ప్రయాణం చేస్తే మూడున్నర గంటలలో రీనో చేరుతాం" అన్నాడు చంద్ర కారుని రోడ్డు మీదకి మళ్ళిస్తూ.

"నీ ఇష్టం! కానీ మధ్యలో ఒక చిన్న బ్రేక్ ఇస్తే, నీకు కాస్త విరామం. మాకు బాత్రూం విరామం" అన్నాడు రామారావు.

"ష్యూర్!" అంటూ వేగం పెంచేడు చంద్ర.

ఇంటి నుంచి అరగంట ప్రయాణం చేసే సరికి చల్లని ఎయిర్ కండీషన్డ్ టొయోటో కేమ్రీ కారులో నెలకొన్న చల్లదనం వైదేహిని నిద్రలోకి తోసింది. కేలిఫోర్నియా రాష్ట్రం రాజధాని సేక్రమెంటో దరిదాపులలో రోడ్డుకి ఇరువైపులా వందల ఎకరా



> **కొత్తగాలి...**
>
> **రసాలన్నీ**
> **మారిపోతున్నాయి!**
> **వెటకారం**
> **హాస్యరసమైందిప్పుడు!**
>
> – డి. శ్రీనివాసదీక్షితులు,
> నరసరావు పేట, గుంటూరు జిల్లా

లలో ఉన్న పిస్తా, బాదం పప్పు, రేస్‌బెర్రీ, బ్లూబెర్రీ చెట్లని.. వందల ఆవులున్న ఫార్మ్‌ని వైదేహికి చూపిద్దామని ఉన్నా గురక పెడుతున్న ఆమెను లేపడమెందు కని ఊరుకున్నాడు రామారావు. నిర్మాను ష్యంగా వందల ఎకరాలలో ఉన్న ఏపిల్, ఏప్రికాట్, ద్రాక్ష చెట్లని చూస్తూ "ఎవరు కాపు కాస్తారు ఈ చెట్లకు? " అనడిగేడు రామారావు.

"దొంగలు కోసుకెళ్తారన్న భయంలేదు. నీళ్ళు ఎంత చిలకరించాలో ముందే నిర్ణ యించిన యంత్రాలు నీటిని చిమ్ముతాయి. అక్కడక్కడ పొలాలలో పనిచేసే మను ష్యులు కనిపిస్తారు. వాళ్లు మెక్సికో నుంచి, ఇతర లాటిన్ అమెరికన్ దేశాల నుంచి వచ్చినవాళ్లు. చవుకగా పని చేస్తారు. ప్రభుత్వం అలా పని చేయడానికి అను మతి పత్రం ఇస్తుంది. ఇక్కడ పుట్టిపెరి గిన చాలామంది అమెరికన్లు ఈ పనులు చేయడానికి ఉత్సాహం చూపించరు. పంట పక్వానికి వచ్చేక, యజమాని వచ్చి సరు కుని లారీలలో తరలిస్తాడు. తీసుకెళ్ళి అమ్ముకుంటాడు" అన్నాడు చంద్ర.

సేక్రమెంటో పట్టణానికి దగ్గరగా వచ్చేట ప్పటికి రోడ్డుమీద కార్ల సంఖ్య పెరిగింది. కార్లు నిర్ణీతమైన లైన్లలో ప్రయాణం చేస్తుంటే, తొణకకుండా గంటకు డెబ్భైయి మైళ్ళ వేగంతో కారు నడుపుతూ తండ్రికి ఏదో చెబుతూ, రెండు గంటలు గడిచేక ఒక గ్యాస్‌స్టేషన్‌లో కారుని ఆపి ఆవలిం చేడు చంద్ర.

వైదేహి ఉలిక్కిపడి లేచి భర్తవేపు ప్రశ్నా ర్థకంగా చూసింది.

"సగం దూరం వచ్చేం! కాళ్లు చాపుకోవ డానికి కారాపేడు చంద్ర. కావాలంటే ఇక్కడ ఉన్న రెస్ట్‌రూమ్‌కి వెళ్లిరా! ఇంకా గంటన్నర ప్రయాణం ఉంది" అన్నాడు రామారావు.

కారులో ఇరవై డాలర్లకి పెట్రోల్ పోయించి కారు స్టార్ట్ చేస్తూ "మీరు గమ నించే ఉంటారు.. ఈ గ్యాస్‌స్టేషన్‌ని నడు పుతున్నది గుజరాత్ నుంచి వచ్చిన ఆ భార్యాభర్తలే. మొదట ఇలాంటి చిన్న గ్యాస్‌స్టేషన్లు మారుమూలలో ఉన్నవి చవు కగా కొనుక్కుని నడపడం మొదలుపెడ తారు. కాస్త డబ్బు కూడబెట్టాక మంచి ప్రదేశాలకి మారిపోతారు. వ్యాపారంలో గుజరాతీలు చాలా ముందంజలో ఉన్నారు. ఈ దేశంలో యూదుల చేతిలో ఉన్న వెండి, బంగారం, వజ్రాల వ్యాపారం గుజరాతీల చేతిలోకి వచ్చింది" అంటూ హైవే మీదకి కారుని మళ్ళించేడు చంద్ర.

మధ్యాహ్నం మూడు గంటలయింది. బైట ఎండ తీవ్రంగా ఉంది. క్రమేణా ఎత్తు పెరుగుతోందని బోర్డులు కనిపిస్తున్నాయి. పట్నవాసపు వాతావరణం మారి ఒంటరి ఇళ్లు, ఇంటికి ఇంటికి మధ్యదూరంతో పా టు పాండోరోసా సరుగుడు చెట్ల సాంద్రత పెరుగుతోంది. కొండ ఏటవాలులో ఇళ్లు దూరంగా కనిపించేక రోడ్డు రెండు పాయ లుగా చీలింది. 'రీనో' దారి పట్టేడు చంద్ర.

"లేక్ టాహో ఇక్కడికి ఎంత దూరం? " అనడిగేడు రామారావు.

"మరో రెండు గంటలు పడుతుంది"

"ఇక్కడ దూరాలు గంటలు, నిమిషా లలో చెబుతారు"

"ఆ కొండలమీద తెల్లగా ఉందేమిటి? "

అని వైదేహి ప్రశ్నిస్తే..

"అది మంచే! సూర్యుడు ప్రకాశిస్తున్నా ఉష్ణోగ్రతలు తక్కువగా ఉండడంతో దాదాపు సంవత్సరం పొడవునా మంచు, కొండలమీద తిష్ఠ వేసి ఉంటుంది. చలికాలంలో రోడ్డు మీద మంచు పేరుకుపోయే సందర్భాలలో కార్ల టైర్లకి చెయిన్స్ కట్టి నడుపుతారు. వశం తప్పితే ఆ కనిపించే లోయలోనికి వెళ్ళిపోయే ప్రమాదం ఉంది. ఇంకో రెండు నిమిషాలలో డోనర్స్ సరస్సు వస్తుంది" అని చంద్ర వివరిస్తుంటే, దిగువకి వెళ్తున్న కారు వేగం అందుకుంది.

నల్లని పెద్ద జుత్తు ఉన్న స్త్రీ షేంపూతో స్నానం చేస్తుంటే నెత్తిమీద నుంచి కిందకి జారుతున్న నురగలా, ఎండకి కరిగి సాయంకాలమయేసరికి ఘనీభవించిన ప్రవాహం నీరు కిందకి పారుతుంటే డోనర్స్ సరసు సూర్యకాంతిలో ప్రకాశిస్తోంది. రెండు పర్వతాల మధ్య నుంచి మొదలయిన సరస్సులోతు దాదాపు మూడువందల అడుగులు! ఆ సరస్సుని ఆనుకుని ఇళ్ళు, ఆ ఇళ్ళ బాల్కనీ చివర్న కూర్చుని చేపలు పట్టడానికి నీళ్ళలోనికి వల విసిరి కబుర్లు చెప్పుకుంటున్న ప్రజని చూడగానే రవ్వంత ఆశ్చర్యం కలిగింది రామారావుకి. మైలుతుత్తం దట్టంగా కలిపినట్లు నీళ్ళంతా నీలంగా ఉన్నాయి. కలుషితం కాని గాలి, కలుషితం కాని నీరు.. అంతకన్నా అభిలషించడానికి ఏముంది? అయితే అది దొరకడానికి డబ్బు కావాలి! పుష్కలంగా డబ్బు కావాలి! తను నూరు డాలర్లు తెచ్చుకుంటున్నాడు. అవి ఈ ట్రిప్‌కి సరిపోతాయా? అన్న అనుమానం వచ్చింది రామారావుకి.

"నెవెడా రాష్ట్రంలో టేక్స్‌లు తక్కువ. అందుచేత రిటైరయ్యేక పైరాష్ట్రాల నుంచి నెవెడాకి వలసవస్తున్నారు. ఆ ఇళ్ల ఖరీదు మిలియన్ డాలర్ల పైనే" అన్నాడు చంద్ర.

'డాలర్లు! డాలర్లు! ఈ దేశంలో ఉంటే ప్రతిదానికీ చేతినిండా డాలర్లు కావాలి' జేబు తడుముకున్నాడు రామారావు.

★ ★ ★

"రాత్రి ఎన్నిగంటలకి తిరిగి వచ్చేరు? ఎంత గెలుచుకు వచ్చేరు? " అనడిగేడు రామారావు.

"గదికి తిరిగి వచ్చేటప్పటికి పదకొండయింది. నేను నలభై సమర్పించుకున్నాను. మావాడి సంగతి తెలియదు" అన్నాడు పరమేశ్వరరావు.

"కేసినోలో ఉన్న దుకాణాలలో పదార్థాలు కొనుక్కోడానికి మన దగ్గర కూపన్లు ఉన్నాయి. అవి వాడుకుంటే మనకి బ్రేక్‌ఫాస్ట్, కొంతమట్టుకు లంచ్ పదార్థాలు వస్తాయి. అయితే ఒక చిన్న ఇబ్బంది ఉంది. చాలా పదార్థాలలో చక్కెర ఉంటుంది. అయితే ఆంటీకి పంచదార లేని కాఫీ కూడా దొరుకుతుంది" అన్నాడు చంద్ర.

"నిన్న మనం తినగా మిగిలిన పదార్థాలని రిఫ్రిజిరేటర్‌లో ఉంచేం. వైదేహి వాటిని ఉపయోగిస్తుంది" అన్నాడు రామారావు.

"ఇప్పుడు ఎనిమిదవుతోంది. బ్రేక్‌ఫాస్ట్ చేసేక పదిగంటలకి కేసినోకి వెళ్ళి అదృష్టం పరీక్షిద్దాం. కేసినో నుంచి ఒంటిగంటకి బైటపడదాం. ఖరాఖండీ కాదుగాని ఒక అంచనా ఉండాలి కదా? "

"సరే!"

"నిన్న మీరు జూదం ఆడలేదు కదా!"

"నాకు జూదం మీద ఆసక్తి లేదు. కేసినో ఎలా ఉంటుందో చూద్దామని వచ్చేను. 'కాయ్ రాజా కాయ్' అన్నట్లుగా ఐదు డాలర్లు మెషీన్‌లో ఉంచి ఆడుతుంటే నాలుగు డాలర్లు పోయేయి. ఉన్నట్టుండి ఇరవై డాలర్లు వచ్చేయి. అంటే పదహారు డాలర్లు లాభం! మెషీన్ దగ్గర నుంచి లేచి వైదేహి దగ్గరకి వచ్చేను. ఆమెకి ఇరవై డాలర్లు ఇచ్చేను. ఆమె చేతిలో ఏభై ఐదు డాలర్లు ఉన్నాయి. మాది బిగనర్స్ లక్"

అన్నాడు రామారావు.

అరగంట తరువాత భర్త తెచ్చిన కాఫీ గ్లాసు అందుకుని ఒక గుక్క తాగి "కాఫీ బాగుంది" అంది వైదేహి.

"రాత్రి బాగా నిద్ర పట్టిందా? నే ఎంత సేపో అటూ ఇటూ దొర్లేను. ఆ పరుపులు అంత మెత్తగా ఉన్నాయేమిటి? ఈ గదికి బాడుగ ఎంతో? వాళ్ళకి ఇవ్వడానికి డబ్బు తెచ్చేరా? " అనడిగింది వైదేహి ఖాళీ గ్లాసుని టేబిల్ మీద ఉంచుతూ.

"ఏవో కూపన్లు వాడడం వలన ఇది చాలా చవుకగా వచ్చింది. నీ ఏభైఐదు డాలర్లు, నా దగ్గర ఉన్న డాలర్లు కలిపి ఇచ్చేద్దాం!" అన్నాడు రామారావు.

"గాడిద గుడ్డు, కంకర పీచేం కాదూ? జూదంలో గెలుచుకుంది నేను ఇవ్వను. అదీకాక ఈ వేళ ఉదయం ఆటకి డాలర్లు అవసరం లేదూ? " అంది వైదేహి.

రామారావు ఒక్కసారిగా ఖంగుతిన్నాడు. భారతం జ్ఞాపకానికి వచ్చింది. 'జూద వ్యసనం' వలనే కదా అంత అనర్ధం జరిగింది! 'మన డబ్బు పోతే ఏడుస్తాం! కానీ తాత్కాలికంగా వచ్చిన డబ్బుపోతే అంతకు పదింతలు ఏడుస్తాం!' అన్నారు వెనకటికెవరో. "సరే! నీ ఇష్టం" అన్నాడు తేరుకుని.

"దాని మాటకేంగానీ, అదేమిటండీ? 'కాఫీ కానీ ఇంకేమైనా కావాలా? ' అంటూ కేసినోలో ఆడవాళ్ళు గుడ్డపీలికలు వేసుకుని తిరగడమేమిటి? ఛ! ఛండాలంగా ఉంది" అంది వైదేహి.

రామారావు మాట్లాడలేదు.

"ఇలా వాళ్ళని చూసి ఎవరైనా వికారంగా ప్రవర్తిస్తే? "

"ఆc! ఆc! అలా అనుకుని ప్రవర్తిస్తే కేసినో పోలీసులు పట్టుకుంటారు. జైలు శిక్ష ఖాయం. ఇది ఇండియా కాదు, ఇక్కడ పోలీసుల ధోరణివేరు" అన్నాడు రామారావు.

"సర్లెండి! రాత్రి పదిగంటల న్యూస్ వింటుంటే ఈ దేశంలో నడిచే భాగోతం తెలుస్తుంది"

"అవును! ఈ దేశంలోనూ హత్యలు, అత్యాచారాలు జరుగుతాయి. కానీ చాలా మట్టుకు అవి వెలుగులోకి వస్తాయి. నేరగాళ్లని పట్టుకుని తొందరగా శిక్ష అమలు పరుస్తారు. ఇండియాలో 'బాలిక మీద అత్యాచారం జరిగింది, వెంటనే అరెస్ట్ చేయాలి' అంటూ టెలివిజన్ ఛానళ్లు రెండురోజుల పాటు అరిచేటప్పటికి ఎదురుగా కనిపించిన వ్యక్తిని అరెస్ట్ చేసి తరువాత సాక్ష్యాధారాలు లభించలేదని వదిలేస్తారు. అథవా శిక్ష పడినా దానికి చాలాకాలం తీసుకుంటుంది ఇండియాలో. చాలా టెలివిజన్ ఛానళ్లకి ఆస్థాన విద్వాంసులు లాంటివాళ్ళు చర్చకి వస్తారు. ఒక అరగంట అరిచి వెళ్ళిపోతారు. ఆ వార్త మరుగున పడుతుంది" అన్నాడు రామారావు.

"మీరు ప్రొఫెసర్‌నని పోజు కొట్టకండి చర్చించకపోతే ఎలా? "

"చర్చ అంటే ఒకసారి ఒకళ్లే మాట్లాడాలి. మాంసం ముద్ద పడేస్తే నాలుగు పులులు ఒకేసారి లంఘించినట్లు చర్చించే వాళ్ళు ఒకటే అరుపులు. ఎంత ఎక్కువగా అరిస్తే అంత మంచిది అన్నట్లు ఉంటాయి మన చర్చలు. రిమోట్‌లో 'మ్యూట్' బటన్ నొక్కాలనిపిస్తుంది"

"దాని గురించి మనం దెబ్బలాడుకోవడమేమిటి? మీరు మంచి కాఫీ తెచ్చేరు. ఇరవై డాలర్లు ఇస్తానులెండి" అంటూ భర్తని దగ్గరకు లాక్కుంది వైదేహి.

★ ★ ★

ఏటవాలుగా బంగారం రంగు కిరణాలని ప్రసరించి డోనర్స్ సరస్సు రంగు మార్చాలని సూర్యుడు ప్రయత్నించినా నిశ్చలంగా ఉన్న సరస్సు తనకిష్టమైన పాదరసం లాంటి రంగుని వదలకుండా కరచిపట్టుకుంది. గాజు అద్దం మీద కిరణాలు పడితే

మెరిసినట్లు సరస్సు మెరుస్తోంది.

"ఇంతకీ ఆ కేసినో రూమ్‌కి ఎంత ఖర్చ యిందో చెబితే ఆ డబ్బు ఇస్తాను, ప్లీజ్!" అని రామారావు మరోసారి అర్థించేడు.

"ఇది చాలా తక్కువ మొత్తం. దాని గురించి పట్టించుకోకండి" అన్నాడు చంద్ర.

ఒక నిమిషం గడిచేక "మా డేడీ ఇంకో పదిరోజులలో ఇండియా వెళ్లిపోతున్నారు. ఆయనకి ఇండియాలో సాయంకాలం పేకాట స్నేహితులు గుర్తుకు వస్తున్నారట" అన్నాడు చంద్ర నవ్వుతూ.

"త్వరలో తాజాకూరలు రైతుబజార్‌లో తెచ్చుకుంటారన్నమాట" అన్న వైదేహి వ్యాఖ్య విని రామారావు మనస్సు సన్నగా మూలిగింది. పరమేశ్వరరావుగారు ఇండి యా వెళ్తుంటే తనకేమిటి? అనుకున్నా తనకి లేనిదేదో పరమేశ్వరరావుగారికి లభి స్తోందనిపించింది. కావాలనుకుంటే తానూ ఆ మార్గాన్నే ఎన్నుకునేవాడు.

ఆ దారిలో వెళ్ళకుండా శాశ్వతంగా ఇండియా వదిలే దారి తను ఎంచుకు న్నాడు. మరి ఈ ఈర్ష్యకి కారణమేమిటి? హాయిగా కొడుకు, కోడలు, మనవడితో కాలం వెళ్ళదీస్తుంటే ఈ ప్రశ్న ఎందుకు ఉదయించింది? శరీరంలో మారుమూల ప్రదేశంలో దాగుకుని ఉన్న వ్యాధి కణంలా, నిర్ణయంలో తప్పు చేసేనేమో నన్న అనుమానం దాగుకుని ఉందా? బాహాటంగా పసికట్ట వీలుకాకుండా అంత ర్లీనంగా తనలో అసంతృప్తి ఉందేమో! అని రామారావు ఆలోచనలు ఊగిసలాడు తుంటే.. "పరమేశ్వరరావుగారి చొరవ వల్ల, చంద్ర ఉత్సాహం వల్లా ఈ ట్రిప్‌కి వచ్చేం. చాలా కృతజ్ఞతలు. ఒకసారి వీలుంటే మిమ్మల్ని భోజనానికి పిలుస్తాం" అంది వైదేహి.

తలూపేడు రామారావు.

"ఇదిగో! మీ ఇంటికి వెళ్ళే దారి వచ్చే

# చతుర ప్రవేశిక

## ఫిబ్రవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. రామారావు అన్నయ్య? | 6. వినోద్ కొడుకు? |
| జ. | జ. |
| 2. చంద్ర తండ్రి? | 7. కృష్ణారావుకు పరిచయమైన లాయరు? |
| జ. | జ. |
| 3. స్టార్‌బక్స్‌లో కాఫీ ధర? | 8. లెక్కల మేష్టారి కూతురు? |
| జ. | జ. |
| 4. రామారావు భార్య? | 9. 'మనిషి- మిథ్య' రచయిత? |
| జ. | జ. |
| 5. కృష్ణారావు మనవలు? | 10. కవిత కూతురు? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ---------------------------------------- వయసు (   )

చిరునామా: ------------------------------------------------------

------------------------------ పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

**చిరునామా :** సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, **Ex:** 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

సింది. ఇంకో రెండు నిమిషాలలో మీ అబ్బాయి ఇల్లు వస్తుంది" అంటూ కారుని హైవే మీద నుంచి మళ్ళించేడు చంద్ర.

ఇండియాలో అయితే స్నేహితుల మధ్య పరస్పర విందు ఆహ్వానాలు ఉంటాయి. కానీ ఇక్కడ తనకంటూ ఒక ఇల్లు లేదు. వినోద్ ఇల్లు, తన ఇల్లు అంటూ ఆలోచించడం అవివేకం కావచ్చు. పరమేశ్వరరావు గారిని భోజనానికి ఆహ్వానిస్తే వినోద్ అభ్యంతరం పెట్టడు. కానీ వినోద్‌తో సంప్రదించాకే అలాంటి ఆహ్వానం ఇవ్వాలి.

'రెండు కార్లు సర్వీసింగ్ ఈ శనివారం పెట్టుకున్నాను, ఆ వేళ చాలా బిజీ' అనో, 'అనంత్‌ని శాన్‌ఫ్రాన్సిస్కో తీసుకెళ్ళాల్సి ఉంది' అనో ప్రకటిస్తూ 'నాన్నా! నాతో చెప్పకుండా వాళ్ళని భోజనానికి రమ్మంటే ఇరకాటం' అనవచ్చు. అంటాడని తను ఊహిస్తున్నాడు. కానీ అనే ఆస్కారం లేక పోలేదు. వినోద్‌ని తప్పుపట్టవలసిన అవసరం లేదు. తనకి ఇంట్లో ఎంత స్వతంత్రం ఉంది? దానిని తను ఎప్పుడూ పరీక్షకి పెట్టలేదు, పెట్టలేడు. ఆ పరీక్షలో ఓడిపోతే గాయపడ్డ అహం, అంతర్లీనంగా ముడుచుకుపడుకున్న అసంతృప్తితో చేతులు కలిపి వినాశనానికి దారితీస్తుంది. అనవసరపు ఆలోచనలు వద్దు అని సముదాయించుకుంటుంటే చంద్ర కారుని వినోద్ ఇంటిముందు ఆపేడు.

"నాకు ఫోన్ చేస్తే, వచ్చి పికప్ చేసేవాడిని కదా! చంద్రకి అనవసరమైన శ్రమ! లోపలికి రండి? " అన్నాడు వినోద్.

"అలసిపోయాం. నాలుగు గంటలు డ్రైవింగ్ కదా! మరోసారి వస్తాం" అంటూ చంద్ర, పరమేశ్వరరావులు వెళ్ళిపోయారు.

వినోద్ వెంట ఇంట్లోకి నడిచేరు వైదేహి, రామారావులు.

"నాన్నా! మా భోజనాలు పూర్తయేయి. మేం తొందరగా తినేస్తామని నీకు తెలుసుగా! ఉష టేబిల్ మీద పదార్థాలు వేడి చేసి ఉంచింది. మీరు మొహం కడుగుకుని వచ్చి తినేయండి. ఆలస్యమవుతోంది" అన్నాడు వినోద్.

అసంకల్పితంగా చేతివాచీ వేపు చూసేడు రామారావు. రాత్రి ఎనిమిది. హాలులో అలికిడి లేదు.

"ఊఁ! చెప్పు నాన్నా! నీ ట్రిప్ ఎలా జరిగింది? " అంటూ తల్లిదండ్రుల పక్కన కుర్చీలో కూర్చున్నాడు వినోద్.

"బాగానే జరిగింది! అదొక వింత ప్రపంచం. నాలాంటి వాళ్ళకి అలాంటి ప్రంపంచం ఒకటి ఉందనే తెలియదు. మీ అమ్మయితే మరీ ఇదయింది! 'ఇదయింది' అంటే ఆశ్చర్యంతో తలమునకలయిందన్న మాట. మీ అమ్మ ముప్ఫయి డాలర్లు, నేను పదిహేను డాలర్లు గెలిచేం. పరమేశ్వరరావు, చంద్రలు మా గురించి చాలా శ్రద్ధ తీసుకున్నారు"

"సారీ! నాన్నా! మీరు వెళ్తున్నపుడు నేను లేకపోవడంతో డాలర్లు ఇవ్వలేకపోయేను" అంటూ వినోద్ నొచ్చుకున్నాడు.

"ఫరవాలేదు! నేను ఇండియా నుంచి తెప్పించిన డాలర్లు వాడుకున్నాను. అక్కడ కేసినో గది బాడుగ ఇస్తానన్నా చంద్ర ఒప్పుకోలేదు. ఎలాగోలాగ వాళ్ళ డబ్బు వాళ్ళకి ఇచ్చేయాలి"

"పరమేశ్వరరావుగారు పదిరోజుల్లో ఇండియాకి వెళ్తున్నారట. చంద్ర దంపతులు ఆయనని 'గ్రీన్‌కార్డ్'కి దరఖాస్తు పెట్టమంటే ఒప్పుకోలేదట. శరీరంలో శక్తి ఉంటే తరచూ అమెరికా రావచ్చన్న ఉద్దేశ్యం చెప్పేడట" అన్నాడు రామారావు.

"పరమేశ్వరరావుగారు ఇక్కడకి ఆరు నెలలపాటు తరచూ వచ్చేస్తుంటే అక్కడ ఆయన వ్యవహారాలు ఎవరు చూస్తారు? " అన్నాడు వినోద్.

"అడపాదడపా ఆయన మేనల్లుడు వచ్చి ఇల్లు శుభ్రం చేయిస్తాడు. పించన్ డైరెక్ట్‌గా బేంక్ ఎకౌంట్‌లో జమ అవుతుంది. ఆయనకి బంధువుల బలగం చాలా వుందక్కడ. ఆయన అందరి మనిషి! అదృష్టవంతుడు" అని రామారావు వివరిస్తుంటే, డైనింగ్ టేబిల్ దగ్గరకి వచ్చి "రేపొక మీటింగ్ ఉంది. దానికి అవసరమయే కాగితాలు తయారు చేస్తున్నాను. మీ ట్రిప్ బాగా జరిగిందా? " అనడిగింది ఉష.

అది యాంత్రిక పలకరింపా? అనిపించింది వైదేహికి.

రామారావు వైదేహిలు తలలూపేరు.

పదినిమిషాల తరువాత రామారావు, వైదేహీలు తమ గదిలోకి, ఉష, వినోద్‌లు డ్రాయింగ్ రూమ్‌లోనికి చేరుకున్నారు.




**ఇండియా:**

"హలో!" అన్నాడు కృష్ణారావు మోగుతున్న సెల్‌ని చెవిదగ్గర ఉంచుకుంటూ.

"నేను శివరావ్‌ని"

"ఎలా ఉన్నారు? "

"అదేమిటి ఆ సంబోధన? "

"ఏంలేదు! అలవాటు!"

"నీ టెలిఫోన్ నెంబరు సంపాదించడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది"

"సరే! ఏమిటి సంగతి? నాగురించి వెతకవలసిన అవసరం ఏమొచ్చింది? "

"నీ చిన్నప్పటి పరిసరాలలో ఉంటున్నా

వని తెలిసింది. బిజీగా ఉంటున్నావా? ఏమైనా కన్సల్టెన్సీ పని చేస్తున్నావా? "

"అలాంటిదేమీ లేదు"

"రెండు మూడు రోజుల్లో మళ్లీ నీకు ఫోన్ చేస్తాను. మనం ఎప్పుడు కలవాలో అప్పుడు నిర్ణయిద్దాం"

"ఎల్లుండి నా మనవలు అమెరికా నుంచి వస్తున్నారు. పదిరోజులు నాతో గడుపుతారు. మరీ అర్జంటయితే రేపు కలుద్దాం! అంత ముఖ్యం కాదనుకుంటే రెండు వారాల తరువాత కలుద్దాం"

"సరే!" అని శివరావ్ ఫోన్ పెట్టేడు.

తనతోపాటు లెక్కల మాస్టారి దగ్గరికి ట్యూషన్‌కి వచ్చే వాళ్ళలో శివరావొకడు. ఇంజినీరింగ్ చదివేడు. తండ్రి చనిపోయినపుడు తను రాజమండ్రి వెళుతుంటే విశాఖపట్నం రైల్వేస్టేషన్‌లో కనిపించి పలకరించేడు. శివరావు వెళ్ళవలసిన రైలు తొందరగా రావడంతో ఆ రోజు ఏమీ మాట్లాడలేదు. కృష్ణారావు తన బిజినెస్ కార్డులు అతనికి అందిచ్చేడు.

అది జరిగి చాలా కాలమైంది. ఇన్నేళ్ల తరువాత తనంటే ఎందుకాసక్తి కలిగిందో? శివరావ్- మాస్టారికి దూరపు బంధువు. శివరావ్ ఫోన్ చేయడంతో ఆలోచనలు గతంలోనికి దౌడుతీసేయి. కృష్ణారావు తండ్రి అస్థిలకని గోదావరి నీటిలో కలిపేక, శారద ఇచ్చిన అడ్రస్ ఆధారంగా ఆమె భర్త రఘురామ్ పనిచేస్తున్న బేంక్‌కి వెళ్లి పలకరించేడు.

"శారద మీ గురించి చెప్పింది" అంటూ తనతో కరచాలనం చేసి, సహజమైన ఆనందం ప్రకటిస్తూ "అరగంటలో ఇక్కడ నా పని పూర్తవుతుంది. పేపరు చదువుతూండండి! ఈలోగా నేను వస్తాను. తరువాత ఇంటికి వెళ్దాం" అంటూ పనిలో నిమగ్నుడయేడు రఘురామ్.

సామాన్యంగా ఉన్నాడు రఘురామ్. వయస్సుని మించినట్లుంది అతని వాలకం, మొహం మీదున్న దళసరి కళ్ళదాలు చూసి ఎందుకో మనస్సు మూలిగింది.

సన్నగా నవనవలాడుతూ, రెండు జడలతో ప్రకృతికి ప్రతీకగా అలరించిన ఒక నాటి శారద కళ్ళ ముందర నిలుచుంది. పక్కన కళ్ళద్దాలు సవరించుకుంటూ రఘురామ్! 'ఎవరికి ఎక్కడ ముడిపడుతుందో చెప్పలేం!' అంటారు. ఇదీ అలాంటిదేనేమో! అని మథనపడుతుంటే..

"వెళదాం!" అంటూ రఘురామ్ వచ్చాడు.

రెండు నిమిషాలలో ఇల్లు చేరేరు.

ఆరేళ్ళ పిల్ల తలుపు తీసింది.

కాలం వెనక్కి పరిగెత్తగలిగితే ఆ పిల్ల 'శారదేనా?' అనిపించేలా ఉంది. శారద ఆకృతిని అచ్చుగుద్దినట్లుంది ఆ పాప.

"మీ తాతయ్య దగ్గర లెక్కలు నేర్చుకున్నారు ఈయన" అంటూ రఘురామ్ చెబుతుంటే గదిలోకి వచ్చింది శారద. ఆశ్చర్యాన్ని అదిమిపెట్టిన మొహంలోంచి ఆనందం అభినయిస్తూ బైటికి వచ్చింది.

ఇప్పుడే వస్తానని రఘురామ్ లోపలికి వెళ్ళాక "నువ్వు వస్తావని నాకు తెలుసు" అంది శారద.

"మీ అమ్మాయి ముమ్మూర్తులా శారదే!" అని రఘురామ్‌తో కబుర్లలో పడ్డాడు తను.

అరగంట కూర్చున్నాక "ఇహ వెళ్తాను" అని తను లేస్తుంటే "ఇండియా వస్తే ఇక్కడికి వీలుచేసుకుని రండి" అంటూ చేయి నొక్కి వదిలేడు రఘురామ్.

మందహాసం చేస్తూ మెట్లుదిగేడు తను.

చాలాకాలంగా శరీరంలో ఉన్న జబ్బు ఇంజక్షన్ ఇవ్వగా మాయమైనట్లు శారద మొహంలో సేదతీరిన ఆనందం, నెలకొన్న నిశ్చలతే తనకి జ్ఞాపకంగా మిగిలింది.

అదే తను ఆఖరుసారి శారదని చూడడం.

తరువాత రోజుల్లో శారద ఆకస్మిక మరణం గురించి తను విన్నాడు, కానీ వివరాలు తెలియలేదు. శివరావుని కలిసేక వివ

రాలు తెలియవచ్చు! అతను చెబుతాడేమో!

శారద! రఘురామ్ అదృష్టవంతుడు. అతని వెనకాల దృఢంగా నిలబడి, అనూహ్యమైన ధైర్యాన్ని అందిచ్చి ఉండాలి. శారద అలాంటి వ్యక్తి. దానికి నిష్కలంకంగా హాయిగా నవ్విన రఘురామ్ నవ్వే ఒక తార్కాణం. ఆ రోజు "ఐ విష్ దెమ్ బెస్ట్ ఆఫ్ లక్!" అని మనస్ఫూర్తిగా అభిలషిస్తూ మెట్లుదిగేడు.

శివరావ్‌ని కలిసి చాలాకాలమైంది. సన్నగా రివటలా ఉండేవాడు ఆ రోజుల్లో. ఇప్పుడెలా ఉన్నాడో! అనుకుంటూ నిద్రలోకి జారేడు కృష్ణారావు.

★ ★ ★

"హలో తాతయ్యా!" అంటూ వినయ్, ఉత్తమ్‌లు చాచిన చేతులని ఆప్యాయంగా అందుకున్నాడు కృష్ణారావు.

"ఫ్లైట్ బాగుందా? " అనడుగుతూ మనవళ్ళతో భుజాలు రాసుకుంటూ విశాఖపట్నం విమానాశ్రయంలోంచి బైటకి వచ్చేడు కృష్ణారావు. కారు పార్క్ చేసి బయట నిలబడిన సత్యం చేయి ఊపడం చూసి.. అతని వేపు నడిచేరు ముగ్గురూ.

"ఎండలో తిరగడం వలన నీ మొహం నల్లబడింది!"

"నువ్వు చిక్కిపోయావుకూడా! నీ నడకలో కొంచెం తేడా వచ్చింది" అంటున్న మనవళ్ళతో నడుస్తూ చిరునవ్వు నవ్వేడు కృష్ణారావు.

"ఇతను సత్యం! మన రథసారథి" అంటూ కృష్ణారావు మనవళ్లకు కారు డ్రైవర్‌ని పరిచయం చేసేడు. సత్యం లగేజిని కారు డిక్కీలో ఉంచేడు.

"మనం ఇల్లు చేరడానికి ఒక గంట పడుతుంది. ఇంటి దగ్గర డిన్నర్ తయారుగా లేదు. ఇక్కడే ఏదో హోటల్‌లో డిన్నర్ చేసి వెళదాం!" అన్నాడు కృష్ణారావు.

వినయ్, ఉత్తమ్ తలలూపేరు.

"హౌ ఆర్ యు? నీ ఆరోగ్యం ఎలా ఉంది? " లాంటి ప్రశ్నలు మనవళ్ళ దగ్గర

**కొత్తగాలి...**

**కవి**
**కలంతో వండి**
**కాగితం మీద వడ్డిస్తాడు!**

*– తాజీ ప్రసాద్,*
*చెన్నై*

నుంచి వినగానే కృష్ణారావు కళ్ళు చెమర్చేయి. తమాయించుకుని "ఐ యామ్ ఫైన్ గైస్! బాగానే ఉన్నాను" అంటూ హుషారు తెచ్చుకొని సంభాషణలోనికి దిగేడు కృష్ణారావు.

"క్రితంసారి మేం వచ్చినపుడు ఇది లేదే? " అంటూ కారులో సర్దుకున్నారు వినయ్, ఉత్తమ్‌లు. సత్యం ఎంతో జాగ్రత్తగా కారు నడుపుతున్నాడు. వాహనాల సంఖ్య అవి అడ్డదిడ్డం నడిచే తీరు చూసి మనవలిద్దరూ భయంతో బిగుసుకుపోయారు. "నాకూ మొదట్లో మీలాగే భయం వేసేది. ఇప్పుడు అలవాటయింది. ఇది హైవే ట్రాఫిక్. సిటీలోకి చిన్నరోడ్డు మీద ట్రాఫిక్ చూస్తే, అప్పుడు ఉంటుంది టెన్షన్! అయినా సత్యం మంచి డ్రైవర్! రిలెక్స్!" అన్నాడు కృష్ణారావు.

అరగంట గడిచేక సత్యం కారుని హోటల్ ఆవరణలో ఆపాడు. ముగ్గురూ కారులోంచి దిగేరు.

"సత్యం! నీకిష్టమైంది తినేయ్" అంటూ కృష్ణారావు డబ్బు అందిచ్చేడు.

ఎయిర్‌కండిషన్డ్ గదిలో కూర్చున్నాక "ఆ హారన్ శబ్దాలేమిటి? చెముడొచ్చేస్తుంది! ఆ ట్రాఫిక్ మై గుడ్‌నెస్! ఎలా హేండిల్ చేస్తున్నావు తాతాయ్యా? ఉఫ్!" అన్నాడు వినయ్.

అక్షరం

గొప్పవాళ్లెపుడూ
అణుకువతో ఉంటారు
ఏ మంచి పనికైనా
వెంటనే స్పందిస్తారు

– ఐన్‌స్టీన్



దానికి ఉత్తమ్ వత్తాసు పలకబోతుంటే చేతితో వారించేడు కృష్ణారావు. దగ్గరగా వచ్చి నిలుచున్న వెయిటర్‌తో "రెండు మినరల్ వాటర్ బాటిల్స్, మూడు కోర్స్ సూపులు పట్టుకురా! ఏం తినాలో అప్పటికి ఆలోచిస్తాం" అన్నారు.

బయట లౌడ్ స్పీకర్లలో స్పష్టతలేకుండా ఏదో బండగా వినిపిస్తోంది.

"నేను కొన్నిదేశాలు సందర్శించేను. కాలుష్యం ఎక్కువగా ఉన్న దేశాలున్నాయి. కానీ శబ్దకాలుష్యంలో మనదేశానిదే అగ్ర తాంబూలం. మోటారు వాహనాలు, మైకులనుంచి వెలువడే మతప్రచారాలు, ప్రవచనాలు ఒకటేమిటి అన్నీ చెవులు చిల్లులు పడేటట్లుంటాయి"

"ప్రవచనాలు అంటే? "

"ఇంటర్‌ప్రెటేషన్ అన్నమాట! జనానికి అవగాహన అయేట్లు కొందరు చెబుతారు. పిట్టకథలు చెబుతారు, శ్లోకాలు చదువుతారు. వాళ్ళు చెప్పిన వివరణతో మనం ఏకీభవించం అనుకో! వింతగా చూస్తారు. ఇవన్నీ శ్రద్ధగా విని బైటకు వస్తూ ప్రజలు రోడ్డు మీద ఉమ్మి వేస్తారు, ఇంకేదో చేస్తారు. చాలామంది జనం వినడానికి వస్తారు 'మంచి పౌరునిగా ఉండు' అని ఎవరూ చెప్పారు.." అన్నాడు కృష్ణారావు

"తాతయ్యా! నువ్వు ఏం మాటలాడుతున్నావో అర్థమవలేదు. నీలో నిరుత్సాహం కలిగిందని తెలుస్తోంది. నువ్వు చికాకుపడుతున్నావు. వాళ్ళని హాళ్ళ మా నాన వదిలేయ్. 'లివ్ అండ్ లెట్ లివ్' - నువ్వు బతుకు, వాళ్ళని బతకనీ! సూపు బాగుంది" అంటూ నూనెలో వేయించిన అప్పడాన్ని కరకరా కొరికేడు ఉత్తమ్.

"నువ్వు ఉన్నట్లే అందరూ ఉంటే బాగుండును ఉత్తమ్! భోజనానికి ఆర్డరిద్దాం" అన్నాడు కృష్ణారావు.

★ ★ ★

"తాతయ్యా! రవ్వదోసెలు, పెరుగువడలు, రసమలాయ్‌లు తినేస్తూ, వ్యాయామం చేయకుండా ఇంట్లో కూర్చుంటుంటే బరువు పెరిగేను. మై గుడ్‌నెస్! బొజ్జ కూడా వస్తోంది. బయట పరిగెడుతుంటే గాలిలో తేమ ఎక్కువగా ఉండడం వలన చెమటైతే పడుతోంది కానీ కేలరీలు కరగడంలేదు. నువ్వు క్రమం తప్పకుండా జిమ్‌కి వెళ్ళేవాడివి. 'ఇండియాలోనూ జిమ్‌కి వెళ్తాను' అని చెప్పేవు. వాట్ హేపెన్డ్? " అనడిగేడు వినయ్.

కృష్ణారావు సమాధానమీయలేదు.

"ఇక్కడకి దగ్గరగా ఏదైనా జిమ్ ఉంటే, చూద్దాం!" అన్నాడు వినయ్.

"ఐ ఎగ్రీ! నాకూ జిమ్‌కి వెళ్ళాలని ఉంది" అన్నాడు ఉత్తమ్.

"కొన్నాళ్ళ క్రితం నేను వెళ్లిన జిమ్ ఇప్పుడు మూతపడింది. ఆ జిమ్ ఏదోలా ఉండేది. సత్యాన్ని అడుగుతా. అతనికి తెలిస్తే వెళదాం" అన్నాడు కృష్ణారావు.

"ఒక గంటలో బయలుదేరుదాం" అన్నారు ఉత్తమ్, వినయ్‌లు.

కారులో పద్దెనిమిది కిలోమీటర్లు ప్రయాణం చేసేక, సత్యం కారు ఆపి వాకబు చేసి తిరుగుతుంటే విల్లులా ఒరిగి బలంగా ఉన్న వస్తాదు బొమ్మ కనిపించిం

ది. "ఇదే నండి జిమ్" అంటూ కారు నిలుపుచేసేడతను.

రెండో అంతస్తులో ఉంది జిమ్. ముందర గదిలో ఆఫీసు.. దానిని ఆనుకుని వెనక పదిహేను మీటర్ల పొడవు, ఇరవై మీటర్ల వెడల్పు ఉన్న గదిలో వ్యాయామానికి ఉపయోగపడే పరికరాలు ఉన్నాయి. ఒకేసారి ఇరవై మందికిపైగా వ్యాయామం చేయడానికి వీలుగా లేకపోయినా ఆ గదిలో నలభైమంది దాకా ఉన్నారు. ఎవరు పనివాళ్ళో? ఎవరు వ్యాయామం కోసం వచ్చేరో? తెలియకుండా కలగాపులగంగా ఉంది. జిమ్ ఎలా ఉందో చూస్తామని మేనేజరుకి చెప్పి లోపలికి అడుగుపెట్టేరు కృష్ణారావు, వినయ్, ఉత్తమ్‌లు. ముక్కుపుటాలు అదిరే చెమట కంపు, చెవులు చిల్లులుపడేలా వస్తున్న మ్యూజిక్. తెలుగో? హిందీయో? లేక ఇంగ్లీషో? అర్థంకాని ఆ మ్యూజిక్ విని ఉత్తమ్, వినయ్‌లు చెవులు మూసుకున్నారు. వ్యాయామానికి వచ్చిన వాళ్ళని గమనించసాగేడు కృష్ణారావు. ఎక్కువ మంది బరువులెత్తే ప్రదేశంలో కబుర్లు చెప్పుకోవడం కనిపించింది కృష్ణారావుకి.

వ్యాయామానికి ఉపయోగపడే మెషీన్లని వాడేక, వాటిని ఇద్దరు పనివాళ్ళు గుడ్డపెట్టి తుడవడం చూసి "ఇక్కడ మెషీన్లు ఉపయోగించిన వ్యక్తి వెళ్ళేటప్పుడు శుభ్రం చేసి వెళ్ళకుండా, పనివాళ్ళు వచ్చి శుభ్రం చేస్తున్నారే!" అన్నాడు ఉత్తమ్. ఎ.సి. సరిగ్గా పనిచేయదో? ఏమో? కానీ లోపల వాతావరణం వేడిగా ఉండి, ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే..

"తాతయ్యా! జిమ్ వద్దు వెళదాం!" అన్నాడు వినయ్.

ఉత్తమ్ తల ఊపేడు. ముగ్గురూ మెట్లు దిగి కారు దగ్గరకి చేరేరు.

"ఇప్పుడేం చేద్దాం? లంచ్‌కి ఇంకా చాలా సమయముంది" అనడిగేడు కృష్ణారావు.

"ఈ ఊళ్లో ఏవైనా ప్రదేశాలు చూద్దాం! తాతయ్యా! నీ చిన్నప్పటి చదువు ఇక్కడేగా! నీ స్కూల్ ఎలా ఉందో చూద్దాం! తరువాత నువ్వు చదివిన కాలేజీకి వెళదాం!" అన్నారు ఉత్తమ్, వినయ్.

"నేను చదువుకున్న హైస్కూల్ చిన్న సందులో ఉంది. మన హోండా కారు వెళ్ళదు. నడిచి వెళ్ళాలి. అదీకాక ఆ మురికి సందులలో మీరు నడవలేరు. ఇబ్బందిపడతారు. మీరోసారి ఆలోచించండి!" అన్నాడు కృష్ణారావు.

"తాతయ్యా! డోంట్‌వర్రీ!" అన్నారు వినయ్, ఉత్తమ్.

"చెప్పాల్సింది చెప్పాను. కొన్నాళ్ళ క్రితం నేను వెళ్ళినపుడు బాధ పడ్డాను. అయినా ఓకే" అన్నాడు కృష్ణారావు.

"ఇక్కడ కారు నిలుపుచెయ్యి. మేం అర గంటలో తిరిగి వస్తాం" అంటూ ఒక సన్నటి సందులో నడవడం మొదలు పెట్టాడు కృష్ణారావు. ఒక పక్క మురికి కాలవ ప్రవహిస్తోంది. దానిని ఆనుకుని దానిమ్మ పండులో గింజలున్నట్లు, ఒకదాని మీద ఇంకోటి చిన్నచిన్న ఇళ్ళు. రుమాలుతో ముక్కు మూసుకుని "నీ స్కూల్ ఇక్కడ ఉందా?" అంటూ అతనిని అనుసరించేరు ఉత్తమ్, వినయ్. చెత్తాచెదారం కుప్పలు కుప్పలుగా పోగులు పడున్న వీధిలోంచి స్కూల్ ఆవరణలోనికి ప్రవేశించేరు ముగ్గురూ.

ఒక కొత్త కట్టడం, రెండు పాత కట్టడాలు ఉన్నాయి ఆ ప్రాంగణంలో. పోషణ లేక పాత కట్టడాలు వెలవెలా పోతున్నాయి. కట్టడాల మధ్య ఉన్న జాగాలోంచి అటూఇటూ పరిగెడుతున్నారు బాలబాలికలు. ఒక కట్టడం వరండాలో ప్లాస్టిక్ డబ్బాలో నీళ్లు ఉన్నాయి. ఒకర్ని ఒకరు తోసుకుంటూ అక్కడ ఉంచిన ఒకే ఒక చిన్న గ్లాసుతో నీళ్ళు తాగుతున్నారు. చీమ పుట్టని తవ్వితే ఏమయిందో తెలి

## కొత్తగాలి...

**పసితనాన్ని పీల్చుకు తాగిన**
**యవ్వనాన్ని**
**జున్ను ముక్కలా తినేస్తుంది**
**వృద్ధాప్యం!**

– జి. నరసింహమూర్తి,
హైదరాబాద్

యక అటూఇటూ పరిగెత్తే చీమల్లా వందలమంది విద్యార్థులు అక్కడ అస్తవ్యస్తంగా కదులుతున్నారు.

"ఇక్కడ చదువుకున్నావా తాతయ్యా?" అనడిగేడు వినయ్.

"నేను చదువుకున్నపుడు ఈ కట్టడాలు లేవు. అదిగో! ఆ మూలని పడిపోయిన బిల్డింగ్ చూసేవా? అందులో చదువుకున్నా. హెడ్‌మాస్టర్‌గారు ఈ ఖాళీ జాగాలో స్వాతంత్ర్యదినోత్సవం నాడు జెండా ఎగురవేసేవారు, ఉపన్యాసం ఇచ్చేవారు" అంటూ చిరునవ్వు నవ్వేడు కృష్ణారావు.

"నీకు నీ స్కూలంటే గర్వంగా ఉందా?"

"ఎందుకుండదు? ఈ స్కూల్‌లోనే లెక్కలు, ఇతర సబ్జెక్టులు నేర్చుకున్నాను. ఈ స్కూలే నాకు భిక్ష పెట్టింది. నేను చదువుకున్న రోజుల్లో ఇంత గలీజు ఉండేది కాదు. నే చదువుకున్న స్కూల్ నా కళ్ళల్లో ఇప్పటికీ పచ్చగా ఉంది" అన్నాడు కృష్ణారావు.

"వాట్ నెక్స్ట్? నువ్వు చదువుకున్న కాలేజీ దూరం కాకపోతే అదీ చూద్దాం"

"సరే!" అన్నాడు కృష్ణారావు.

"ఆ జవాబులో ఉత్సాహం కానీ, ఉద్వేగం కానీ లేకపోవడం వినయ్, ఉత్తమ్‌లు కనిపెట్టేరు.

కారులో కూర్చున్నాక, ఐదు నిమిషాలలో కాలేజీ గేటు దగ్గర కారు ఆపేడు సత్యం. జీవం లేకుండా ఉంది కాలేజి బోర్డు. పద్దెనిమిది, ఇరవై ఏళ్ళ వయస్సు గల విద్యార్థులు అటూఇటూ తిరుగుతున్నారు. ఎటు నడవాలో తెలియక సందిగ్ధంలో ఉన్న వినయ్, ఉత్తమ్‌లతో "ఇటు రండి!" అంటూ మేడమెట్ల వైపు దారితీశాడు కృష్ణారావు. మేడమెట్లు ఎక్కేక, వరండాలో శబ్దం చేయకుండా నడుస్తున్న కృష్ణారావు కిటికీలోంచి క్లాసులోకి చూసేడు.

చాలాకాలంగా సున్నం వేయని గోడలు, బ్లేక్ బోర్డుమీద ఏదో రాస్తున్న లెక్చరర్ వీపు పూర్తిగా విద్యార్థుల వేపు తిరిగి ఉంది. జాగా సరిపోక ఇరుకుగా కూర్చున్న విద్యార్థులు గుసగుసలాడుకుంటూ బోర్డ్ మీద రాసింది కాపీ చేస్తున్నారు. రెండడుగులు వేసేక "ఈ గేలరీలో మేం లెఖ్ఖలు, భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం చదువుకున్నాం. ఆ రోజుల్లో హుషారుగా బోధన జరిగేది. ఇప్పుడు రోజులు మారేయి" అన్నాడు కృష్ణారావు.

"ఎంతమంది ఉండేవారు నీ క్లాస్‌లో?"

"నూరుమంది"

"అమ్మ బాబోయ్!"

నిరాసక్తితో కృష్ణారావు, రవ్వంత ఆసక్తితో వినయ్, ఉత్తమ్‌లు పదినిమిషాలు కాలేజీలో తిరిగి, కారు దగ్గరకి చేరేరు. "దాదాపు ఒంటిగంటవుతోంది. లంచ్ చేద్దాం" అన్నాడు కృష్ణారావు.

పదార్థాలకి ఆర్డరిచ్చేక, వాష్ బేసిన్ దగ్గర చేతులు కడుక్కొచ్చేడు కృష్ణారావు.

"ఈవేళ మనకి తెలిసిన తాతయ్య గురించి తెలియని విషయాలు తెలుసుకున్నాం. అందులో ఒకటి దారుణంగా, అశుభ్రంగా ఉన్న జిమ్ ఉపయోగిస్తాడని తెలిసింది" అన్నాడు వినయ్ నవ్వుతూ.

చప్పట్లు కొట్టేడు ఉత్తమ్.

"అబద్ధాలు వాగేరంటే చంపేస్తా. నేను ఒక జిమ్‌కి వెళ్దామనుకున్నా. అక్కడ వాతావరణం బాగోక మానేశాను"

"జోక్, జోకే! కోపం తెచ్చుకోకు!" అన్నారు వినయ్, ఉత్తమ్‌లు కృష్ణారావుని ఆటపట్టిస్తూ.

"రెండోది తాతయ్య చదువుకున్న స్కూల్, కాలేజీ. అవి బాగోలేవు. అవి బాగోలేవని తెలిసినా అక్కడి పూర్వ విద్యార్థి అయిన తాతయ్య ఏమీ పట్టించుకోకపోవడం క్షమించరానిది. నువ్వు నా ఊహలో పడిపోయేవు" అన్నాడు వినయ్.

"ఇప్పటికైనా మించిపోలేదు. ఏదో ఒకటి చెయ్యి తాతయ్యా!" అన్నాడు ఉత్తమ్.

"ఒప్పుకుంటాను, నేనేమీ చేయలేకపోయేనని. ఇండియా వచ్చిన కొత్తలో స్కూల్‌కు వెళ్ళి 'నేనేమైనా సహాయం చేయనా?' అని అడిగితే 'నా గదిలో అతిథుల కోసం కుర్చీలు కొనండి. ఎవరైనా వస్తే కూర్చోమనడానికి కుర్చీలు లేవు' అన్నాడు హెడ్‌మాస్టర్. అవి కొన్నాను. తరువాత వెళ్ళాలనిపించలేదు. కాలేజీకి వెళ్తే ఆనందానికి బదులు చెప్పలేనంత బాధ కలుగుతోంది. దానిని బాగు చేసేంత సత్తు వనాలో లేదనిపించింది. ఏంచేయను? ఐ యామ్ సారీ!" అన్నాడు కృష్ణారావు.

"డోంట్ వర్రీ! తాతయ్యా! ప్రతీ మనిషికి ఇబ్బందులుంటాయి. పరిధులు ఉంటాయి. ఏదో నిన్ను కవ్వించాలని అన్నాను. ఏదీ నువ్వు ఆర్డరిచ్చిన పూరీకూర? ఆకలి దంచేస్తోంది" అన్నాడు వినయ్.

"ఇక్కడకి దగ్గరగా ఉన్న ఒక ప్రైవేట్ ఇంజినీరింగ్ కాలేజీలో నాకు తెలిసిన ఒక ప్రొఫెసర్ ఉన్నాడు. అతనిని ఒకసారి పలకరించేక ఇంటికి వెళ్దాం" అన్నాడు కృష్ణారావు.

"ఐ డోంట్ కేర్"

"మి టూ!"

"ఐడోంట్ కేర్ అన్నది అమెరికాలో వాడొచ్చు. కానీ ఇక్కడ 'ఐ డోంట్ మైండ్' నాకేమీ అభ్యంతరం లేదన్నది ఎక్కువగా వాడతారు" అన్నాడు కృష్ణారావు.

"వుయ్ డోంట్ కేర్" అన్నారు వినయ్, ఉత్తమ్ కోరస్‌గా.

★ ★ ★

"ఏమిటి తాతయ్యా ఈ కంపు? ఆ కోళ్ళ ఫారం నుంచేనా? ఇంజినీరింగ్ కాలేజీ అన్నావు. ఇక్కడికి తీసుకువచ్చేవు?" అంటూ పరిసర ప్రాంతాలని గమనిస్తున్న వినయ్ మాటల్ని పట్టించుకోకుండా ద్వారం దగ్గర ఉన్న జవాన్‌తో "శివరావుగారిని కలవడానికి వచ్చేం" అన్నాడు కృష్ణారావు.

గేటు తలుపు తెరచి "ఆ బిల్డింగ్ మూడో అంతస్తులో ఉంటారు" అన్నాడు జవాను. వరి పొలాల మధ్య వేసిన మంచి తారురోడ్డుకి ఇరువైపులా కట్టడాలు తళతళా మెరుస్తున్నాయి. వంద మీటర్లు తారురోడ్డు మీద ప్రయాణం చేసేక జవాను చూపించిన బిల్డింగ్ పోర్టికోలో కారు ఆపాడు సత్యం.

"మూడో అంతస్తు. ఎలక్ట్రిసిటీ లేదు, మెట్లు ఎక్కాల్సిందే" అంటూ కృష్ణారావు మెల్లిగా మెట్లెక్కుతుంటే వినయ్, ఉత్తమ్ హుషారుగా రెండేసి మెట్లు ఎక్కి కృష్ణారావు గురించి నిరీక్షిస్తున్నారు.

కష్టపడి మెట్లెక్కుతున్న కృష్ణారావుని చూసి "ఆర్ యూ ఆల్‌రైట్?" అనడిగేడు వినయ్.

"ఇక్కడ లిఫ్ట్ ఉందో? లేదో? నాకు తెలియదు. కానీ అంగవైకల్యం ఉన్న వి

## భలేభలే!

విన్సెంట్ వ్యాంగోకు ప్రసిద్ధ చిత్రకారులైన పాల్ గాగిన్, సెజాన్, పిసారో, బెర్నార్డ్‌వంటి కళాకారుల సాహచర్యం లభించింది. దాంతో తన సంప్రదాయపద్ధతిని వదిలి లావాలా ఎగిసిపడ్డాడు. ఎవరో తరుముకొస్తున్నట్లు చిత్రరచన చేసి ఒకసారి ఏడాదిలో రెండువందల చిత్రాలను గీశాడు. మానసికస్థితి సరిగా లేక 37వఏట తుపాకితో కాల్చుకుని చనిపోయాడు.

ద్యార్థులు ఇంత మీదకి ఎలా వస్తారు? " అనడిగేడు ఉత్తమ్.

"అవన్నీ తరువాత చెబుతాను.." అని కృష్ణారావు అంటుంటే..

గదిలోంచి వచ్చిన వ్యక్తి "నీలో మార్పు వచ్చింది" అంటే "నీలో మార్పు వచ్చింది" అంటూ కరచాలనం చేశాడు అతనితో.

"నేనూ శివరావు కబుర్లు చెప్పుకుంటాం.. మీరు అలా తిరిగిరండి" అంటూ శివరావ్‌తో కబుర్లలో పడ్డాడు కృష్ణారావు.

"ఇక్కడ ఇంకెన్నాళ్ళుంటారు నీ మనవలు? "

"మరో ఐదు రోజులు"

కాలేజీలు నడుస్తున్న తీరు, నడపడంలో ఉన్న ఇబ్బందుల గురించి మాట్లాడుకున్నాక "మాస్టారితో నీకు బంధుత్వం ఉందని నాకు తెలుసు. శారద చనిపోయిన వార్త విన్నాను. ఏం జరిగింది? "

"నూటికి నూరు శాతం 'ఇది' అని నేను చెప్పలేను. ఇది ఎవరికి చెప్పినా నమ్మరు. వంటింట్లో స్టౌమీదుంచిన కూర మాడిపోతుంటే స్టౌవ్ ఆర్పడానికి పరిగెడుతూ, వంటింట్లో డబ్బాలు పెట్టుకునే సిమెంట్ దిమ్మకి తల తగిలి చనిపోయింది. ఇంట్లో ఎవరూ లేకపోవడంతో వైద్యసహాయం అందలేదు" అంటూ శారద మరణ వివరాలు చెప్పేడు శివరావ్.

ఉత్తమ్, వినయ్‌లు తిరిగి రావడంతో కృష్ణారావు లేవబోతుంటే "మీ తాతయ్యని మా విద్యార్థులకి పాఠాలు చెప్పమనకూడదూ? " అన్నాడు శివరావు.

"నేను మళ్ళీ నీతో మాట్లాడతాను" అంటూ మెట్లవేపు దారితీసేడు కృష్ణారావు.

కారులో కూర్చున్నాక "బయట చాలా వేడిగా ఉంది. ఎయిర్ కండిషనర్ ఆన్ చెయ్యి" అన్నాడు ఉత్తమ్.

"తాతయ్యా! ఆయన నిన్ను పాఠాలు చెప్పమన్నారు, చెప్పకూడదూ? ఒక వ్యాపకం ఏర్పడుతుంది" అన్నాడు వినయ్.

"ఐ డోంట్ నో! కొన్నాళ్ళ క్రితం అమెరికా నుంచి వచ్చిన ఒక స్నేహితుడు, నేనూ ఒక కోర్స్ లాంటిది నడిపేం. డబ్బుకి కాదు, ఫ్రీగానే! మొదటి రెండు రోజుల్లో అసలు విషయం బోధించడానికి, అది అవగాహన చేసుకోవడానికి కావలసిన పాఠాలు చెప్పేం. మొదటిరోజు నలభై మంది వినడానికి వచ్చేరు. మూడో రోజుకి ఆ సంఖ్య ఇరవైకి దిగింది. సెమినార్ పూర్తయేసరికి పదిమంది మాత్రమే మిగిలేరు. సెమినార్‌కి వచ్చిన విద్యార్థులకి సెమినార్‌లో చెబుతున్న దానిమీద కంటే ఇతర విషయాలకే ప్రాధాన్యం ఉండేది. ఇంజినీరింగ్ ఎందుకు చదువుతున్నారు? అనడిగితే 'ప్రభుత్వం ఫీజు కడుతోంది', 'మా నాన్న బలవంతంగా చేర్పించాడు', 'ఇది పూర్తిచేస్తే అమెరికా వెళ్ళొచ్చు' లాంటి సమాధానాలు విన్నాను. ఒకే ఒక్కడు 'నాకు ఇంజినీరింగ్ అంటే ఇష్టం' అన్నది వ్యక్తపరిచేడు.

ఒక వ్యక్తి బస్ దిగి గ్రామంలో ప్రవేశిస్తూ 'నీకు మామిడి పండు ఇష్టమా? ' అనడిగేడు. 'లేదు' అన్నాడు. ఆ తరువాత తటస్థపడిన మరో ఇద్దరు 'మామిడి పండు ఇష్టం లేదు' అని చెప్పగానే 'ఈ ఊరిలో అందరికీ మామిడి పళ్ళు ఇష్టం లేదు' అన్న నిర్ధారణకి వస్తే ఎలా? నేను చూసిన ఇంజినీరింగ్ కాలేజీలో వాతావరణం నాకు ఆహ్లాదం కలిగించలేదు. అన్నీ అలా కాకపోవచ్చు.

ఒక లెఖ్ఖల మాస్టారి భార్య ఇరవై రెండేళ్ళ కూతురికి ఇరవై ఆరేళ్ళ వరుడు కావాలని, బాగా గాలించకపోతే దొరకడని వాపోతుంటే..

'ఫరవాలేదు లేవే! పదమూడేళ్ళ కుర్రాళ్ళని ఇద్దర్ని తెస్తా' అన్నారుట. మంచి అనుభవం, అర్హతలున్న ఒక ప్రొఫెసర్‌ని నియోగించే కంటే ఇద్దరు అనుభవంలేని వాళ్ళని చవుకగా నియోగించి కాలేజీలు

నడుపుతున్నారు. అలాంటి చోట ఎలా పనిచేయగలం? " అన్నాడు కృష్ణారావు విచారంగా.

"నేను దానితో ఏకీభవించను. నువ్వు చెప్పిన వాతావరణం ఉండవచ్చు. కాదన లేను. ఇంజినీరింగ్ కాలేజీ గురించి నేను వాదించను. కానీ నువ్వు చదువుకున్న హై స్కూల్, కాలేజీల గురించి నీ నిర్లిప్తతని నేను సమర్థించను. శ్రమతో కూడినపనే అయినప్పటికీ, వాకబు చేసి నీ చిన్నప్పటి క్లాస్‌మేట్లని కలిసి ఏదో ఒకటి చేయా ల్సింది. వచ్చిన మొదటి అవరోధంతోనే నువ్వు తెల్లజెండా చూపించేవు. సలహా ఇవ్వడం తేలికే, అందుకే ఇస్తున్నాను. శివ రావుగారు అన్నట్లు ఒక సెమిస్టర్ పాఠం చెప్పకూడదూ? " అడిగేడు ఉత్తమ్.

"హైస్కూల్, కాలేజీ విషయాల్లో నే చొరవ చూపకపోవడంపై మీరు తప్పు పట్టినా నేనేమీ అనుకోను. కానీ ఇంజినీ రింగ్‌కాలేజీ విషయంలో నా తప్పేమీలే దు. ఎనీవే! ఆ టాపిక్ వదిలేద్దాం! ఇపుడు ఇంటికేనా? " అడిగేడు కృష్ణారావు.

"ఈవేళ మనం చెరకు రసం తాగాలి" అన్నాడు వినయ్ తాతా భుజం తడుతూ.

"జాగ్రత్తగా ఉండకపోతే టైఫాయిడ్ జ్వ రాన్ని ఆహ్వానించినట్టే" అన్నాడు కృష్ణారావు.

"చెరకు రసం తాగాల్సిందే" అన్నాడు ఉత్తమ్ స్వరం పెంచి.

"ఈ కాలంలో చెరకు రసం దొరుకు తుందో? లేదో? సత్యాన్ని అడుగుదాం"

"తాతయ్యా! ఒకటి అడగాలని ఉంది. నీ దగ్గర ఉన్న డబ్బు అంతా ఏం చేసుకుం టావు? " అన్నాడు వినయ్.

"అది నీకనవసరం! ఏ బృహత్కార్యా నికో డబ్బు ఇస్తాడు. అనాథశరణాలయా నికి ఇస్తాడు, నాకు ఇవ్వొచ్చు! అదంతా తాతయ్య ఇష్టం!" అన్నాడు వినయ్.

"కాకా పట్టకు. నేను రుణం తెచ్చి చదు వుకుంటున్నాను. నా అవసరం ముఖ్యమై నది" అన్నాడు వినయ్.

## కొత్తగాలి...

**కన్నీటిని కార్పిస్తుంది**
**కారం!**
**ఆ కన్నీటిని తుడుస్తుంది**
**మమకారం!**

– కాళ్ల గోవిందరావు,
ఆముదాలవలస, శ్రీకాకుళం జిల్లా

"గయ్స్! గయ్స్! నేను ఎవరికీ పెద్దమొ త్తంలో డబ్బు ఇవ్వడంలేదు. మీరిద్దరూ కూడబలుకుకుని నన్ను బోల్తా కొట్టిద్దామ నుకుంటున్నారా" అన్నాడు కృష్ణారావు.

ముగ్గురూ నవ్వుకున్నారు.

"డబ్బు సంగతి తరువాత చూద్దాం! ఇది చెప్పు తాతయ్యా! నీకిక్కడ సమయం ఎలా గడుస్తోంది? ఇక్కడ నీకు స్నేహితులు ఎవ్వరూ ఉన్నట్లులేరు" అని వినయ్ ప్రశ్ని స్తుంటే సత్యం కారుని చెరకురసం దుకాణం దగ్గర ఆపాడు. కారులోంచి బైటకి దిగి "శుభ్రంగా గిన్నెలన్నీ కడిగి చెరుకు రసం తయారు చేయగలవా? " అనడిగేడు.

తలూపేడు చెరకురసం అంగడివాడు.

"రేపు ఉదయం బయలుదేరి ఒక హిల్ స్టేషన్‌కి వెళ్ళబోతున్నాం. రాత్రికి మకాం అక్కడే" అని కృష్ణారావు ప్రకటించేడు.

"ఎక్కడికి తాతయ్యా? " అని వినయ్, "ఎంత దూరం? " అని ఉత్తమ్ ప్రశ్ని స్తుంటే "వాటన్నింటికి రేపే సమధానం" అన్నాడు కృష్ణారావు.

★ ★ ★

మోతాదుకి మించి తిన్న తిండి ఉత్తమ్, వినయ్‌లని ప్రయాణం ఆరంభమైన అర గంటలోనే నిద్రలోకి నెట్టేసింది. దాదాపు అరవై కిలోమీటర్లు ప్రయాణం చేసేక,

చోడవరం, నర్సీపట్నం ఊళ్లని దాటి ఘాట్ రోడ్డులోనికి రాగానే "లేవండి" అంటూ మనవల్ని లేపేడు కృష్ణారావు. "ఇక్కడ నుంచి క్రమేణా దాదాపు పన్నెండు వందల మీటర్ల ఎత్తు ప్రయాణం చేస్తాం" అన్నాడు కృష్ణారావు.

"మీటర్లు నాకు తెలియవు. అడుగులలో చెప్పు" అన్నాడు ఉత్తమ్.

"దాదాపు మూడు వేలు"

సత్యం కారు కిటికీలని తెరచి ఎ.సి. ఆఫ్ చేశాడు. "ఎ.సి. ఉంటే ఎత్తు ఎక్కేకారు వేగం బాగా పడిపోతుంది" అన్నాడు.

చల్లని గాలి, కల్తీలేని గాలి లోపలే తచ్చాడుతున్న గాలితో కలిసింది. బలంగా లోపలికి చొచ్చుకువచ్చిన గాలి తాకిడికి ఉత్తమ్, వినయ్‌లు ఉక్కిరిబిక్కిరయి, కారు తలుపు, కిటికీలని సగం మూసి కృష్ణారావు వేపు చూసేరు. డ్రైవర్ సత్యం ఒడుపుగా, చాకచక్యంగా నడుపుతుంటే కారు పైపైకి ఎగబాకుతోంది. రోడ్డుపక్క నుంచి పనిముట్లతో ఆడ, మగ నడిచివెళ్తుంటే "వీళ్ళు ఈ దరిదాపులలో నివసించే ఆదివాసీలు. కొండ ఏటవాలులలో బియ్యం, కూరగాయలు పండించి అమ్ముకుంటారు. తరుముకువస్తున్న స్వార్థ నాగరికతని ఎదుర్కోలేక సతమతమవుతుంటారు. పేపర్లలో వీరి గురించి చదువుతూనే ఉంటాం" అన్నాడు కృష్ణారావు.

పనస, చింత, కుంకుడు చెట్లని కృష్ణారావు చూపిస్తుంటే, కారు ఎత్తుకి ప్రయాణం చేస్తోంది. ఉన్నట్టుండి వాతావరణం ఒక్కసారిగా చల్లపడింది. మేఘాలు, చెట్లు దగ్గరగా వచ్చినట్లనిపించింది.

"కిటికీలు మూసేయండి! వాన రాబోతోంది" అని సత్యం హెచ్చరించేలోగా వాన మొదలయింది.

దట్టంగా కురుస్తున్న వాన వలన నీటి ప్రవాహం రోడ్డు పక్క మట్టిని కోస్తుంటే "కాస్సేపు కారు ఆపుతాను. ఎందుకైనా మంచిది" అంటూ కారుని కొండవైపు వారగా నిలిపాడు సత్యం.

కాసేపటి తర్వాత "ఈ కొండ ప్రాంతంలో దట్టంగా వాన కురుస్తుంది. కానీ అట్టేసేపు ఉండదండి" అంటూ సన్నగా పడుతున్న చినుకులలోనికి కారుని తోలేడు సత్యం.

కారు ఎత్తుకి వెళ్తుంటే రోడ్డుని ఆనుకున్న కంతల్లోంచి, వరదల్లోంచి బుల్లి జలపాతాలతో నీళ్ళు చిమ్ముకువస్తున్నాయి. రెండోపక్క వింత వయ్యారాలు ఒలకపోస్తూ లోయలోంచి లేస్తున్న తెల్లని పొగమంచు!

"ఇండియాలో ఇలాంటి ప్రదేశాలు ఉన్నాయనే తెలియదు" అంటూ కృష్ణారావు తన్మయత్వాన్ని చెదరకొట్టేడు వినయ్.

"తెలియదని నే అనుకోవడం లేదు. ఇండియాకి చుట్టం చూపుగా వచ్చే చాలా మంది రెండు మూడు వారాలు ఉంటారు. అంత తక్కువ సమయంలో 'అరటికాయ ఆవకూర, మజ్జిగ మెంతిపులుసు' వంటివి చేయించుకు తినడం ఒక భాగం. ఇక్కడ ఉన్న వెరైటీలు అక్కడ ఉండవు. అదీకాక 'ఇక్కడ బంగారం చవుక' అంటూ నగల దుకాణం, బట్టల దుకాణాల్లో గడపడం ఇంకో భాగం. అమెరికన్ స్కూళ్ళలో పూర్వ చరిత్ర ఏమిటి? అని ఆలోచింపజేస్తారు. ఇండియా వచ్చిన పిల్లలు తమ బంధుత్వపు వేళ్ళ గురించి తెలుసుకునే అవకాశం ఉన్నా, తల్లిదండ్రులు తిరిగే కక్ష్య వేరుగా ఉండడంతో అది సాధ్యపడక పోవచ్చు. రెండుమూడుసార్లు అలా జరిగి పిల్లలు ప్రేక్షకులుగా ఉండిపోవడంతో 'ఇండియా వెళ్దామా? ' అంటే 'ఐ డోంట్ కేర్' అంటూ భుజాలెగరేస్తారు. 'స్కూల్లో ప్రాజెక్ట్ చేస్తున్నాను' అంటూ తప్పించుకోచూస్తారు" అన్నాడు కృష్ణారావు.

"తాతయ్యా!" అన్నారు మనవలు.

"నేను ఒప్పుకుంటాను. అందరూ అలా అని నే అనడం లేదు. ఉదాహరణ మీరే!

నేనెప్పుడూ మిమ్మల్ని ఇండియా రమ్మని బలవంతపెట్టలేదు. అయినా మీరు వచ్చేరు. ఇది నన్ను చాలా ఆనందపరిచింది. 'స్కైప్' లాంటి వీడియో సదుపాయాలు రావడంతో పిల్లలు తల్లిదండ్రులను చూస్తూ మాట్లాడగలుగుతున్నారు. దీని వలన ఇండియా ట్రిప్ అనవసరమనుకుంటున్నారేమో!"

"యు ఆర్ ఎ సినిక్! నిత్యశంకితుడివి!"

"ఏమో! కాస్సేపట్లో పల్లం ప్రాంతానికి వచ్చేస్తాం. 'మాడుగుల' పట్టణానికి వచ్చేసరికి తేడా స్పష్టంగా కనిపిస్తుంది. మనకి అరకు దాటి అనంతగిరి చేరడానికి ఇంకా రెండుగంటలు పైనే పడుతుంది. దారిలో ఎక్కడో దిగి మనం తెచ్చుకున్న టిఫిన్ తినేద్దాం" అన్నాడు కృష్ణారావు.

★ ★ ★

"రాత్రి గదిలోంచి బైటకి వస్తే చాలా చలి వేసింది తాతయ్యా!" అంటూ బాల్కనీలో కృష్ణారావు ఎదురుగా కూర్చున్నాడు వినయ్.

చలికి వణికిన లోయ సూర్యకిరణాలతో చలికాచుకుంటోంటే.. లోయలో పేరుకున్న మంచు మెల్లిగా మీదకి లేస్తోంది.

"బాగుంది తాతయ్యా ఇక్కడ! నువ్వు తరచూ వస్తుంటావా? " ఉత్తమ్ వచ్చి ఇంకో కుర్చీలో సర్దుకున్నాడు.

"ఐదారుసార్లు వచ్చేను. ఈ నిశ్చలత అంటే నాకిష్టం"

"ఒక్కడివి వస్తే భయం వేయదా? ఒంటరి తనం ఫీలవవా? "

"అదిగో! ఆ రోడ్డు మీద నుంచే నిన్న వచ్చేం" అన్నాడు కృష్ణారావు.

"టాపిక్ మార్చకు. నీ ఆరోగ్యం ఎలా ఉంటోంది? "

"నాకేం? ఫస్ట్‌క్లాస్‌గా ఉన్నాను. నువ్వు నన్ను చూస్తూనే ఉన్నావుగా!"

"కాళ్ళ నొప్పులకి తప్ప ఇంకెందుకూ నువ్వు మందులు తింటున్నట్లు కనిపించలేదు. కానీ యు ఆర్ సిక్స్టీఫైవ్. నీకు అరవైఐదు వచ్చేయి. కొంతవయసు వచ్చేక ఒంటరిగా ప్రయాణాలు చేయరు. నువ్వు ఈ దేశం ఎందుకు పరిగెత్తుకొచ్చేవో మాకు తెలియదు. ఇక్కడ నువ్వు నివసిస్తున్న తీరులో ఏ ప్రత్యేకతా లేదు. ఎవరికీ పట్టకుండా ఇక్కడ ఉన్నట్లు నువ్వు అమెరికాలో నూ ఉండవచ్చు. తిరిగి అమెరికా వచ్చేసేయ్. అసంపూర్తిగా ఏవైనా పనులు మిగిలిపోతే పూర్తిచేసేసి తొందరగా వచ్చేయ్ తాతయ్యా!"

"చూద్దాం! ఈ గదులని పదిగంటలకల్లా ఖాళీ చేయాలి. మనం తయారయి, బ్రేక్‌ఫాస్ట్ చేసేసరికి పదిగంటలవుతుంది. నిన్న వచ్చిన రోడ్డు మీద కాకుండా ఇంకో దారంబట వెళ్దాం. ఆ దారిలో గిరిజనులు కనిపిస్తారు. వాళ్ళ వేషధారణ, ఉచ్చారణ వేరుగా ఉంటాయి. వీళ్ళు అమెరికాలో నేటివ్ అమెరికన్ల లాంటివాళ్ళు. మీకు వాళ్ళ విభిన్నత స్పష్టంగా తెలియవస్తుంది" అంటూ తయారవడానికి లేచేడు కృష్ణారావు.

"పది గంటలయినా చలి తగ్గలేదు" అంటూ కారు కిటికీలు సరిగ్గా మూతపడ్డాయో? లేదో? అని చూసేడు వినయ్.

"మనం బస చేసిన ప్రదేశం దాదాపు రెండువేల ఎనిమిది వందల అడుగుల ఎత్తులో ఉంది. మనం మహాఅయితే నలభైనిమిషాలలో ఈ ఎత్తునించి దిగిపోతాం. బేగ్‌లో దుప్పటి ఉంది కావాలా? " అనడిగేడు కృష్ణారావు.

"తాతయ్యా" అంటూ బైటకి చూసేడు వినయ్.

ఘాట్‌రోడ్డు మీద నుంచి కారు కిందకి ప్రయాణం చేస్తుంటే రెండుమూడు కిలోమీటర్ల దూరంలో చిన్న ఇళ్ళ సముదాయం. ఆనుకుని చిన్నచిన్న దుకాణాలు. రోడ్లపై గిరిజనులు గోనెసంచులు పరచి వాటి మీద కూరగాయలు అమ్ముతున్నారు.

"దిసీజ్ ఫార్మర్స్ మార్కెట్! తాతయ్యా!

# అమెరికా నగరాల విశిష్టతలు

చతుర సమాచారం

అమెరికన్ నగరాలకి చెందిన గణాంకాలు ఇటీవల సేకరించారు. ఆ వివరాలు..

★ అమెరికాలోని ప్రతీ నగగరంలో ఆకాశ హర్మ్యాలు విరివిగా కనిపిస్తాయి. కానీ రాజ ధాని వాషింగ్టన్ డీసీలో మాత్రం అలాంటి నిర్మాణం ఒక్కటీ లేదు! కారణం? కేపిటల్



డోమ్‌ని మించిన ఎత్తయిన కట్టడాలని హైట్ ఆఫ్ బిల్డింగ్స్ ఏక్ట్ 1910 నిషేధించడమే.

★ ఎడారిలో నిర్మించిన నగరం ఫీనిక్స్. ఆధునిక రవాణా సౌకర్యాల వల్లే ఆ నగరం అభివృద్ధి చెందింది. 1920లలో ఫీనిక్స్ నగర జనాభా 30వేలే!

★ అమెరికాలో జనాభా తగ్గుముఖం పట్టిన నగరం డెట్రాయిట్. 1950లో 18 లక్షల 50వేల జనాభా ఉండేది. అక్కడి కార్ల పరిశ్రమ దెబ్బ తినడంతో నేడది 7 లక్షలకి తగ్గిపోయింది.

★ అమెరికాలోని అతి ప్రాచీన నగరం ఫిలడెల్ఫియా. 1970లో దీని నిర్మాణం మొదలైంది. కొంతకాలం ఇది అమె రికా రాజధానిగా ఉంది. అమెరికాలోని పశ్చి మ నగరాలు తూర్పు నగరాలకన్నా కొత్తవి.

★ లాస్ ఏంజెలెస్‌కి శివార్లు అధికం. లాంగ్‌బీచ్ అనే శివారు అతిపెద్దది. దీని జనాభా నాలుగున్నర లక్షలు!

★ శాన్‌ఫ్రాన్సిస్కో విస్తరించుకునేందుకు ఇక చోటులేదు. దీంతో చదరపు మైలుకి 17వేల మంది ఇక్కడ నివసిస్తున్నారు.

★ జాక్సన్‌విల్లే అధిక విస్తీర్ణం గల నగరం, మొత్తం విస్తీర్ణం 744 చదరపు మైళ్ళు. దాంతో ఈ నగరంలో చదరపు మైలుకి నివసించే జనాభా అతి తక్కువ.

★ అమెరికాలో చాలా నగరాలు చుట్టుపక్కల నగరాలని తమలో కలిపేసుకుం టాయి. ఫోర్ట్‌వర్త్ నగరం డల్లాస్‌లో భాగంగా, బ్రూక్లిన్ నగరం న్యూయార్క్‌లో భాగంగా, అలాగే లాంగ్ బీచ్ నగరం లాస్ ఏంజెలె స్‌లో భాగంగా మారిపోయాయి.

రైతుబజార్లు" అన్నాడు ఉత్తమ్.

"అమెరికాలో రైతుబజార్లలో, తాజా సరుకులకి ధర ఎక్కువ. ఇక్కడ అలా కాదు, చవక. అందుకే అదిగో చూడు, వేన్లు, పెద్ద పెద్ద ఆటోలలో చవకగా కొను క్కొని పట్టణాల్లో వాటిని మూడింతలకి అమ్ముతారు ఈ దళారులు. ఇక్కడ దళా రులదే రాజ్యం" అన్నాడు కృష్ణారావు.

★ ★ ★

"మేం ఇంకా విద్యార్థులమే. థాంక్స్ తాతయ్యా! టిక్కెట్ కొన్నందుకు. నిన్ను గమనిస్తూనే ఉన్నాం. నీ ఇల్లు ఏ కొండల లోనో, సరస్సు పక్కనో ఉంటే 'ఓహోహో!' అనుకోవచ్చు. కానీ అది పొలంలో కట్టిన ఇల్లు. పరిసరాల్లో ప్రత్యేకత ఏమీలేదు. నీకు అమెరి కాలో ఇల్లు ఉంది. పెట్టే బేడా సర్దు కు వచ్చేసేయ్. పెరిగిన పెద్ద చెట్టుని పె ళ్ళ గించి మరొక చోట నాటితే అది బతుకు తుందని చెప్పలేం" అన్నాడు ఉత్తమ్.

"ఒకసారి అడిగి 'నో' అనిపించుకున్నా ను. ఆర్థికంగా నాకెందుకు సహాయపడ వు? " అని వాదనని సాగతీసేడు వినయ్.

"ముందు వినయ్ గురించి.. నువ్వు వడ్డీలేని అప్పులు తెచ్చుకుని చదువుకుంటు న్నావు. నీ చదువు పూర్తయ్యేవరకు దాని మీద వడ్డీ ఉండదు. అది ఇప్పుడే తీర్చవ లసిన అవసరం లేదు. నీకు డిగ్రీ చేతికి

వచ్చేక నువ్వు నీ కాళ్ళ మీద నిలబడు. అది సాధ్యం కానపుడు చూద్దాం! నీ ఆత్మ విశ్వాసం పెరగడానికి ఈ ఒత్తిడి నీకవ సరం. ఊరికే వచ్చిన డబ్బుకి విలువ లేదు. మీ నాన్న ఏమంటాడు? ఇహ ఉత్తమ్ అడిగిన దాని గురించి.. అమెరి కాలో యాంత్రిక పరుగు విసుగేసింది. నలభై ఏళ్ల తరువాత ఇక్కడ వాతవరణం, జీవనసరళి ఎంత మారిందో! 'జారిపో యిన ఆ జీవితం ఏమైనా చవిచూడగ లనా?' అన్న ఊహతో ఈ దేశం వచ్చేను. అన్నిదేశాలలాగే ఈ దేశమూ మారింది. నదిలో పరిగెత్తికెళ్ళిపోయిన నీటిని పట్టుకో లేం" అన్నాడు కృష్ణారావు.

"నిన్ను కష్టించడానికి ఆర్థికంగా ఎందుకు సహాయపడవు? అని రెట్టిం చేను. ఐ యామ్ ఓకే! నాకేమీ పెద్ద ఆర్థిక ఒత్తిడి లేదు" అన్నాడు వినయ్.

కస్టమ్స్ చెక్‌వేపు చేతులూపుతూ కదలి వెళ్తున్న మనవలని రవ్వంత బరువెక్కిన గుండెతో ఆనందాన్ని ప్రదర్శిస్తూ తిరిగి చేతులు ఊపేడు కృష్ణారావు.




**కాలిఫోర్నియా:**

"ఈ మధ్య ఉష మూడీగా ఉంటోంది. ఇదివరకు లేని చిరాకు బైటకి కనపడు తోంది" అంది వైదేహి.

"అనంత్ చదువుకి హైదరాబాదుకి వెళ్ళిన ప్పటినుంచి ఈ చిరాకు ఎక్కువైందా? అన్న అనుమానం వస్తోంది. అదీకాక, ఇదివరలో ప్రతిరోజూ హాస్పిటల్‌కి ఠంచ నుగా తొమ్మిదిగంటలకి చేరుకునేది. ఇప్పు డలా కాదు. కొన్నిరోజులు హాస్పిటల్‌కి వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోతోంది" అన్నాడు రామారావు.

"నాకు మరో సందేహం"

"ఏమిటది?"

"నేను కళ్ళు తిరిగి కిందపడి చెయ్యి విర గకొట్టుకున్న దగ్గరనుంచి ఆమె పద్ధతిలో మార్పు వచ్చిందా?"

"సందేహం, అనుమానం పదాల్ని వాడు తున్నావు. అయినదానికి కానిదానికి అనవ సరమైన సంకోచాల్ని పెట్టుకుని వాటిని బైటకి వ్యక్తపరచకు, లోపలే దాచుకో!" కసిరినంత పనిచేసేడు రామారావు.

"వేళాకోళంగా ఉందా? దేశం కాని దేశంలో మీతో కాకపోతే ఇంకెవరితో నా కష్టాన్ని చర్చించాలి? సర్లెండి! మీకు టీ టైమయింది" అంటూ లేచింది వైదేహి.

అర్జునుని బాణం కర్ణుని మీద వాలితే కర్ణుడు విలవిలలాడినట్లు, రామారావు శరీ రమంతా ఒక్కసారి విలవిలలాడింది. 'రాహుకాలం, యమగండాల మాట ఎలా గున్నా, సరిగ్గా నాలుగు గంటలకి పరుపు మీద నుంచి లేచి 'మీ ఒంటికి మంచిది' అంటూ ఆ దిక్కుమాలిన 'గ్రీన్ టీ' అస్త్రాన్ని నా మీద ప్రయోగిస్తుంది వైదేహి' అనుకున్నాడు రామారావు. అదేదో సిని మాలో హీరో కాంతారావో? ఇంకెవరో? తలమీద మూలిక లాంటిదేదో పెట్టుకుంటే కావలసినంతసేపు మాయమైనట్లు తనూ రోజూ నాలుగు గంటలకి మాయమైతే బాగుండును అనుకున్నాడు.

"అబ్బాయి మరిచిపోయినట్లున్నాడు, బిస్కట్లు లేవు" అంటూ కాగుతున్న నీళ్ళతో ఉన్న మగ్‌ని అందిచ్చింది వైదేహి.

'ఇది మీ ఒంటికి మంచిది' అన్న నమ్మ కంతోనే తన హితవుకోరేటీ ఇస్తుంది

వైదేహి. దానిలో ఏమీ శంకించవలసింది లేదు. కానీ ఆ టీ తాగుతున్నంతసేపూ పూర్వజన్మల సుకృతం మీద నమ్మకంలేని తనకి క్రితంజన్మలో తను చాలామందిని హింసించి ఉండాలన్న భావన రాకమాన దు. పోనీ సింక్‌లో పారపోద్దామనుకుంటే, తను టీని పూర్తిగా తాగేవరకు ఎదురుగా కూర్చుని అక్కడ నుంచి కదలదు.

ఆనందం, విషాదం, భయం కలిగిన పుడు మొహం మీద పొడచూపిన భావాల్ని ఫొటోతో బంధించేసి దాన్ని కాంపిటీషన్‌కి పంపడం గురించి తను విన్నాడు. ఈ టీ తాగడం ముగించేక తన ఫొటో తీసి 'వెగటు' అన్న హెడ్‌లైన్ పెట్టి ఏ కాంపిటీషన్‌కి పంపినా అవలీలగా ఫస్ట్ ప్రైజ్ వచ్చేస్తుందని తలపోసి, వెగటుతో నోటి దగ్గర నుంచి పారిపోయిన చెక్కిళ్లని చేతితో వాటి పాత స్థానానికి తీసుకువ చ్చేడు రామారావు.

"టీ బాగాలేదా? " అనడిగింది వైదేహి.

రామారావు నోటెంబట మాట బైటికి రాలేదు. నంగిరిగా ఉన్న భర్త మొహం చూసి "టీ ఒగరుగా ఉందా? చెబితే కాస్త పంచదార వేసేదాన్నిగా!" అంది వైదేహి.

రామారావు మొహం మామూలవడానికి ఐదు నిమిషాలు పట్టింది. బాక్సింగ్ మేచ్‌లో ప్రత్యర్థి మొహం మీద గుద్దితే కళ్ళు బైర్లుకమ్మేక, స్పృహలోకి వచ్చి తిరిగి వెలుతురు కనిపించినట్లు వైదేహి వేసిన ప్రశ్నకి "అనవసరంగా పంచదార కోసం నిన్ను లేపడమెందుకని.." అంటూ నసి గేడు రామారావు.

"ఏమండీ! నా చేయి విరగడం వలన వినోద్‌కి ఎంత ఖర్చయి ఉంటుంది? ఖ ర్చంతా ఇన్సూరెన్స్ కంపెనీ ఇవ్వదా? "

"దీనికి సమాధానం వినోద్, లేదా ఇన్సూరెన్స్ కంపెనీ ఇవ్వగలదు"

"పోదురూ బడాయి పోతారు! ఇంజినీ రింగ్‌లో డాక్టరేట్ డిగ్రీ సంపాదించేరు. ఈ మాత్రం చెప్పలేరా? "

## కొత్తగాలి...

**అందరి ఆరోగ్యానికి**
**దేశ సౌభాగ్యానికి**
**వేద్దాం ప్రకృతి మాత మెడలో**
**హరితహారం!**

– బిక్కనూరి రాజేశ్వరి,
పొన్కల్, ఆదిలాబాద్ జిల్లా

"అంత లావుగా ఉన్నావు, పాము మంత్రం తెలియదా? అన్నట్లుంది నీ ప్ర శ్న. వినోద్ చేతిలోంచి ఎనిమిది, తొమ్మిది వందల డాలర్లు పడి ఉంటాయి"

"మీదంతా మిడిమిడి జ్ఞానం. అంత ఎందుకవుతుందండీ? "

"వినోద్ తీసుకున్న ఇన్సూరెన్స్ పాలసీ లో ఉన్న ఒప్పందాలు బట్టి, మనమెంత సమర్పించుకోవాలో మారుతుంది. నువ్వు అన్నట్లు నాది మిడిమిడి జ్ఞానమే కావచ్చు"

"మీ సెల్ఫ్ డబ్బా మాని పాయింట్‌లోకి రండి. ఎందుకు అంత అవుతుంది? "

"నువ్వు ఒకరోజు హాస్పిటల్‌లో, వాళ్ళ పర్యవేక్షణలో ఉన్నందుకు పదిహేను వందల నుంచి రెండువేల డాలర్ల బిల్. నీకు ప్లేస్టర్ వేసినందుకు ఐదువందలు. మొత్తం రెండువేలనుకో! సాధారణంగా ఇలాంటి పాలసీలలో మొదట ఐదువందల డాలర్లు నువ్వు భరించాలి. మిగతా పైకం లో ఇరవైశాతం అంటే మూడువందలు. అంటే వినోద్ చేతిలోంచి దాదాపు ఎనిమి దొందల వరకు పడే ఆస్కారం ఉంది".

"అంటే ఏభైవేల రూపాయలు"

"ఈ లెక్క మనం అతని ఇన్సూరెన్స్‌లో భాగమైతేనే, లేదా రెండువేల డాలర్లు"

"మనల్ని వాళ్ల ఇన్సూరెన్స్ పాలసీలో కలపడానికి వినోద్ ఎంత ఎక్కువ ఖర్చు

పెడుతున్నాడు? "

"ఏమో తెలియదు. బహుశా నెలకి రెండువందల డాలర్లు"

"గత రెండున్నరేళ్లుగా వినోద్ కట్టిన డాలర్లు, మనం ఏమీ ఉపయోగించలేదు కాబట్టి.." అంటూ భర్త మొహంలో ఉన్న తీవ్రతని చూసి ఆగింది వైదేహి.

"మున్ముందు రోజులలో ఏమవుతుందో! మనం ఇండియా వెళ్ళిపోదాం" అంది వైదేహి మెల్లిగా.

"మనం వెళ్ళడానికి అక్కడ ఏముంది? " అన్నాడు రామారావు.

ఇద్దరూ ఆలోచనలో పడ్డారు.

ఉజ్జాయింపుగా చూస్తే వినోద్ తమ గురించి నాలుగు లక్షలు కేవలం ఇన్సూరెన్స్ కంపెనీకి కట్టేడు. రాబోయే కాలంలో, ఆరోగ్యం దిగజారుతుందే కానీ మెరుగవ్వదు. తనకి భర్తకి కేటరేక్ట్ పొరలు మొలుస్తున్నాయి. ఈ ఆపరేషన్‌కి ఎంత ఖర్చవుతుందో! అంతలేసి ఖర్చులు వినోద్ భరించగలడా? తాము ఉండి ఏంచేస్తున్నారు కనుక? తను ఉండబట్టే వంకాయ మెంతికూర, బచ్చలికూర పులుసు అంటూ ఏదో తాపత్రయపడుతోంది. లభ్యమవుతోంది కాబట్టి వాళ్ళు తింటున్నారు. తను లేకపోతే వాళ్ళకి అదేమీ పెద్ద వెలితి కాదు. పిజ్జా ఆర్డర్ చేసుకుని దానినే రెండు రోజులు వేడి చేసుకుని తింటారు. వంటింట్లో గిన్నెల అవసరం లేకుండానే రోజులు దొర్లిపోతాయి. నరక చతుర్దశి నాడు తలంటుకుని దేమునికి దీపం పెట్టుకోవడం, శ్రావణ మంగళవారాలులాంటివి వీళ్ళకి జ్ఞాపకమే ఉండదు. ఎవరైనా 'ఈవేళ దసరా పండుగ' అంటే 'థాంక్యూ! విష్‌యూ ది సేమ్!' అంటూ తిరుగు శుభాకాంక్షలు సర్వసామాన్యం. ఇదో ప్రపంచం. వినోద్, ఉష ఈ ప్రపంచంలో ఆనందంగానే గడుపుతున్నారు. 'మరో ప్రపంచం' లాంటిది వాళ్ళ నిఘంటువులో లేదు. 'కొత్త చింతపండు, ఇంగువ వేసి ఘుమఘుమలాడుతున్న పులిహోర తిన్నావంటే జిహ్వ లేచి వస్తుంది' అని వైదేహి అంటే 'ఐ డోంట్ నో! నాకు తెలియదు బామ్మా! ఒక రోజు నిన్ను ఇక్కడ ఉన్న థాయ్ రెస్టారెంట్‌కి తీసుకెళ్ళి కారం బాగా ఉన్న ఫ్రైడ్‌రైస్ తినిపిస్తాను, అప్పుడు ఉంటుంది మజా' అన్నాడు అనంత్.

మనవడి తిండి ప్రపంచం వేరు, తనది వేరు. బంగాళాదుంప వేపుడు తింటూ వంటగదిలోకి వచ్చినప్పుడు కబుర్లు చెప్పడం కంటే ఆప్యాయత జనించలేదు. అనంత్ ఉపయోగించే తెలుగు పదాల ఉచ్చారణని తప్పుపట్టి సరయిన పదం ఎలా వాడాలో తను నవ్వి చెబుతుంటే 'చిన్నప్పటి నుంచి నేర్చుకుని ఉంటే, ఈపాటికి తెలుగులో మాట్లాడడం వచ్చేది. ఇప్పుడు తెలుగు అక్షరాలు గుర్తుపట్టగలను, అంతే!' అన్నాడు ఒకరోజు. అనంత్ కాలేజీకి వెళ్ళి దాదాపు ఆరు నెలలవుతోంది. పిచ్చి సన్నాసి! ఎలా ఉన్నాడో! సరిగ్గా తింటున్నాడో? లేదో? అనుకుంటూ జాలిపడింది. అనంత్ గురించి రెండు మూడు ప్రశ్నలు వేద్దామని ఉన్నా రామారావు ఆలోచనలో ఉండడం చూసి మౌనం వహించింది వైదేహి.

వినోద్ అమెరికాలో కాస్త స్థిరపడ్డాక 'ఈ దేశం చూడడానికి ఎప్పుడు వస్తున్నారు' అని రెండు మూడుసార్లు అడిగేడు. 'నేను ఇంకా ఉద్యోగంలో ఉన్నాను కాబట్టి వీలవదు. నువ్వే వీలుచూసుకుని ఇండియా రా!' అంటూ అమెరికా ప్రయాణం వాయిదా వేసేడు తను. ఉష గర్భంతో ఉన్నపుడు 'సహాయానికి రాగలవా? ' అని తల్లిని అడగలేదు వినోద్. తనకి ఇబ్బంది అవుతుందన్న భయంతో వైదేహి 'తను రాలేనని' చెప్పింది. రిటైరయేంతవరకు తను అమెరికా వెళ్ళే ఆలోచనని అణగతొ

క్కేడు. 'జీవితంలో చివరిఅంకం కొడుకు దగ్గర గడపాలి', 'మనకి ఉన్నది వాడొక్కడే కదా?' అంటూ చిన్నప్పుడు సుమతీ శత కంలో పద్యాలు వల్లె వేసి వేసి ఉండడం తో వైదేహి సంశయాలకి, సందేహాలకి విలువ ఇవ్వకుండా అమెరికా తరలివ చ్చేడు. పెన్షన్‌కి సంబంధించి 'బతికే ఉన్నాను' అని సర్టిఫికెట్ బేంక్‌లో ఇచ్చివ చ్చేడు. రెండు సంవత్సరాలు పరమే శ్వరరావుగారి పలుకుబడితో పోస్ట్‌లో సర్టి ఫికెట్ పంపేడు. బేంక్ మేనేజరు కొత్త వాడు, పోస్ట్‌లో ఈ సంవత్సరం పంపితే స్వీకరిస్తారో? లేదో? తెలియదు. అంగీక రించకపోతే? 'మనకి అక్కడికి వెళ్లడానికి ఏముంది?' అనడిగేడు తను వైదేహిని. పెరిగిన డి.ఏ.లో నెలకి వస్తున్న నలభై వేల పెన్షన్ తగిన కారణం కాదా? వనజ క్క ఉంది, వైదేహికి ఇద్దరు సోదరులు ఉన్నారు, వాళ్ళ పిల్లలు ఉన్నారు. ఇల్లు కట్టుకొని కృష్ణారావు అన్నయ్య అక్కడే ఉన్నాడు.

'అక్కడ ఏముంది?' అనుకుంటే ఏమీ కనిపించదు. 'అక్కడ లేనిదేమిటి?' అని ప్రశ్నించుకుంటే అన్నీ ఉన్నట్లు కనిపి స్తాయి.

వినోద్ అమెరికాలో స్థిరపడ్డాక తననె ప్పుడూ 'మూటాముల్లె పట్టుకువచ్చేయండి' అనలేదు. 'మేం అమెరికా వలసవచ్చే స్తున్నాం! నీ ఉద్దేశ్యమేమిటి?' అని తను అడగలేదు. వినోద్ దగ్గరికి చేరుకోవడం తన నిశ్చయమే. వైదేహి అనాసక్తిని గమ నించకుండా 'వచ్చేస్తున్నాం' అంటే వినోద్ అభ్యంతరం చెప్పలేదు, ఎలా చెప్పగలడు? ఇంజినీరింగ్ పూర్తవగానే వినోద్‌కి ఉద్యోగం వచ్చినప్పుడు 'వెళతాను' అని వినోద్ ఉత్సాహం ప్రకటించేడా? ఏమో? జ్ఞాపకానికి రావడం లేదు. 'చిన్నవాడు వాడికేం తెలుసు? మనం తల్లిదండ్రులం! వాడి బాగుకోరే కదా ఏదైనా చేస్తాం!' అన్న వేళ్ళు లేని చెట్టుకి ఉన్న బలంలాంటి

## కొత్తగాలి...

**కృతజ్ఞత**
**కుక్కనుంచి నేర్వాలి**
**పారేసిన మెతుకులు తిని**
**పట్టుకుంటుంది దొంగల్ని!**

– కుంటముక్కల సత్యవాణి,
కాకినాడ

సిద్ధాంతాన్ని నమ్మి వినోద్‌ని విమానం ఎక్కించేడు ఆనాడు. రిటైరయేక ప్రయాణం కడుతుంటే 'ఇష్టం లేదు' అంటూనే ఉంది కానీ తీవ్రంగా ప్రతిఘటిం చలేదు భార్య. వైదేహి ఒక మంచి ధర్మ పత్ని! 'అన్నీ ఆయనే చూసుకుంటారు' అని బాహాటంగా ప్రకటించే చాలామంది స్త్రీల నైపుణ్యం లేకపోయినా, అదే భావనని ప్రదర్శిస్తుంది. భార్య కాళ్ళు ఒత్తుతుంటే మెత్తని పాము మీద పాల సముద్రంలో ఆయన ఉన్నట్లు, అమెరికా జీవితం చీకూ చింతా లేకుండా ఉందనుకుం టే, కొత్తగా మొలిచిన ఆందోళన గాలి దుమారం తనని కకావికలం చేస్తోంది.

"ఇండియా తిరిగి వెళ్ళిపోతే?" అనడి గింది వైదేహి.

తిరిగి వెళ్ళడం మాట అటుంచి 'వినోద్! మేం ఇండియా తిరిగి వెళ్దామనుకుం టున్నాం' అని చెబితే 'ఎందుకు నాన్నా? ఇక్కడ బాగా లేదా? వెలితిగా ఉందా? ఎంతో ఆసక్తితో ఇక్కడ స్థిరపడడానికి వచ్చిన మీరు ఇలా ఎందుకు ఆలోచిస్తు న్నారు?' అనడిగితే ఏదీ సమాధానం?

ముందుముందు రోజులలో 'మేం నీకు మోయలేనంత భారం' అని తనంటే 'పిల్ల లకి తల్లిదండ్రులు మోయలేనంత భారం అవుతారా నాన్నా? అర్ధాంతరంగా మీరు

ఇండియా వెళ్ళిపోతే ఇక్కడ నాకు తెలిసినవాళ్ళు ఏమనుకుంటారు?' అనడిగితే అంతకన్నా పెద్ద చెంపపెట్టు ఉండదు. ఇప్పుడేం చేయడం? అలా రెండడుగులు వేసి విస్కీ తెచ్చుకుని, దుమ్మలగుండు మొహంలాంటి మొహం ఉన్న హీరో, సినిమాలలో తాగినట్లు తాగేస్తే? అయినా ఏ విస్కీ తెచ్చుకోవాలి? 'విస్కీ తాగుతారా? బ్రాందీ తాగుతారా? ఏమిటీ అసందర్భపు వికృత ఆలోచనలు?' అనుకుంటూ తల విదుల్చుకున్నాడు రామారావు.

"ఏమండీ" అంది వైదేహి.

"ఆ! ఏమిటి?" అంటూ కసిరినట్లు అరిస్తే, భర్త ఎందుకంత విరుచుకుపడ్డాడో తెలియక చిన్నబుచ్చుకుంది వైదేహి.

★ ★ ★

"ఇప్పుడు రాత్రి పదకొండు గంటలయిందేమో! ఇంత రాత్రపుడు కొడుకు కోడలు అంత తీక్షణంగా ఎందుకు మథనపడుతున్నారో?" అంది వైదేహి రామారావుతో.

"అయినదానికి, కానిదానికి సన్నాయి నొక్కులు నొక్కుతావు. మాటలాపి పడుకో" అన్నాడు రామారావు.

లైట్లన్నీ ఆర్పేసి తొమ్మిది గంటలకి పక్క ఎక్కేస్తారు రామారావు, వైదేహిలు. వినోద్, ఉషల మధ్య జరుగుతున్న చర్చ రామారావు, వైదేహీలని మేల్కొలిపింది.

"..అది బయటకి వచ్చిన దగ్గరనుంచి పేషెంట్లు తక్కువవుతున్నారు. ఇంకో నెలలో నా కాంట్రాక్ట్ రెన్యువల్ అవాల్సి ఉంది. అదయేక ఈ హాస్పిటల్‌వాళ్ళు కాంట్రాక్ట్ పెంచేముందు ఎలా స్పందిస్తారో చెప్పలేం. నా జీతం తగ్గవచ్చు లేదా కాంట్రాక్ట్ రద్దు కావచ్చు. ఇతర హాస్పిటల్స్‌కి దరఖాస్తులు పంపేను. ఈ ఇంటర్‌నెట్ వచ్చేక ఏదీ దాగదు. ఒక చిన్న పొరపాటుకి రెండు మిలియన్ల పరిహారం కావాలంటూ దావావేసేరు"

"దావా వేయబోతున్నారని ఇంతకు ముందు చెప్పేవు. పరిహారం రెండు మిలియన్లని నాకు తెలియదు"

"నన్ను, నే పనిచేస్తున్న హాస్పిటల్‌కి ఆ దావాలో ప్రతివాదులుగా పేర్కొన్నారు. ఇలాంటి అవాంతరాలని ఎదుర్కొనేందుకు నే తీసుకున్న బీమా దీనికంటే ఎక్కువే. హాస్పిటల్‌కీ బీమా పాలసీలు ఉన్నాయి. ఇప్పుడు లాయర్లు చర్చలలో పడ్డారు. ఈ వ్యాజ్యం కోర్టుకి వెళ్లకుండా సామరస్యంగా పరిష్కారించాలని ప్రయత్నిస్తున్నారు. కోర్టుకి వెళ్తే ఎలాంటి తీర్పు ఇస్తారో ఏమీ ఊహించలేం. వైద్యం అందరికీ అందుబాటులో లేదని సామాన్య ప్రజలకి కోపం. అది వాళ్ళ తీర్పుని ప్రభావితం చేయవచ్చు"

"వాట్ నెక్స్ట్? తరువాత ఏమిటి?"

"ఈ దావా వ్యవహారం తేలిపోయేక, నేను తీసుకున్న పాలసీ అమలులో ఉంచాలంటే నేను బీమా కోసం ఎక్కువ ప్రీమియమ్ కట్టాల్సి వస్తుంది. నేను ఎక్కడికి దరఖాస్తు పెట్టినా దీని గురించి రాయాలి, గోప్యంగా ఉంచలేం. ఈ మరక వాళ్ళకి ఆయుధంగా ఉపయోగపడుతుంది. అందుకే చెడ్డపేరు రాకుండా ఉండాలని అందరూ ప్రయత్నిస్తారు. లాయర్లు రాజీకి పరిగెడతారు"

"ఏమిటీ దరిద్రం? ఇలాంటి దావాల వలన డాక్టర్ల, హాస్పిటళ్ల ఖర్చులు పెరుగుతాయి, వాళ్ళు తమ ఛార్జీలని పెంచుతారు. సామాన్యుడికి ఇన్సూరెన్స్ తీసుకోవడం మరింత కష్టమవుతుంది"

"ఎవడికి పట్టింది? డబ్బు చేసుకోవడమే ప్రధానం. కంపెనీ పని మీద రెండురోజులు అట్లాంటా, జార్జియాకి రేపు మధ్యాహ్నం బయలుదేరి వెళ్ళాలి. ఇందాక మెసేజ్ వచ్చింది"

"మీ అమ్మగారి హాస్పిటల్ బిల్ వచ్చింది. రేపు చూడు!" అంది ఉష.

"అనంత్ ఫోన్ చేసేడా? వాడితో

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, కాలాతీతం, నవలావలోకనం ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ.116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతో పాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ 17. – సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

మాట్లాడేవా? వాడి ధోరణి, బాగాలేదు. నాకేదో భయంగా ఉంది. నన్ను తప్పించుకుని తిరుగుతున్నట్లు కనిపిస్తాడు"

"నాకూ వాడి వాలకం బాగా అనిపించడంలేదు. ఇంకో నెల్లాళ్లలో సెలవులకి వస్తాడు. చూద్దాం వాడిలో మార్పులు ఏమైనా వచ్చేయో!"

మాటలాగిపోవడంతో వినోద్, ఉషల మధ్య సంభాషణ ముగిసిందనుకుని మెల్లిగా మంచం దిగి, తడుముకుంటూ బాత్రూంకి వెళ్ళింది వైదేహి.

★ ★ ★

వైదేహి చేతికున్న ప్లేస్టర్ తీసేస్తూ "కొన్నాళ్ళు బరువైన పనులు ఈ చేతితో చేయకండి. అవుతుందని కాదు, జాగ్రత్త పాటించడం మంచిది" అంది ఉష.

"అబ్బ! ఎంత రిలీఫ్‌గా ఉందో!" అంటూ ఆనందపడింది వైదేహి.

"మీకు దెబ్బ తగిలితే ఒక పట్టాన మానదన్న సంగతి తెలుసుగా! అందుకే జాగ్రత్త చెప్పాల్సి వచ్చింది. నాకు హాస్పిటల్‌లో పని ఉంది" అంటూ ఇంటి నుంచి బైటపడింది ఉష.

ఆఫీసు పని మీద వినోద్ తరచూ జార్జియా రాష్ట్రంలో ఉన్న అట్లాంటాకి వెళ్తుంటే, ఇల్లంతా నిండు గర్భిణిలా నిశ్శబ్దాన్ని భరిస్తోంది.

"ఏమండీ! పరమేశ్వరరావుగారు ఇండియా వెళ్ళి చాలారోజులయింది. మీకేమైనా వార్త వచ్చిందా? అదేనండి మీ పెన్షన్ గురించి" అనడిగింది వైదేహి.

"బేంక్ మేనేజరు కొత్తవాడట! నవంబరులో బేంక్‌కెళ్ళి వాకబు చేస్తానన్నారు"

"అతను ఒప్పుకుంటే సరే! లేకపోతే?"

"జనవరి ఒకటో తారీఖు నుంచి పెన్షన్ ఎకౌంట్‌లో జమ అవదు. మనం వెళ్ళి

## కొత్తగాలి...

**పుణ్యానికి ప్రతీక**
**ఆవు దానం**
**పాండిత్యానికి పరాకాష్ఠ**
**అవధానం!**

– బి.ఎ.ఎస్. ప్రసాద్,
చాగల్లు, ప.గో. జిల్లా

మళ్ళీ కుస్తీలు పడితేకానీ మామూలవదు"

"వెధవ రూల్స్! వెధవ పెన్షన్..! వెధవ టెన్షన్..!" అంటూ వైదేహి నిరసించింది.

"దుర్వినియోగం కాకుండా ఉండాలంటే ఆంక్షలు తప్పవు. ఈ దేశంలో హెల్త్‌కేర్, సోషల్ సెక్యూరిటీ విభాగాలలో గూడుపు ఠాణీలు ఉన్నాయి. అలాంటివి ఇంకెన్నో! ఎకౌంట్‌లో జొరపడి డబ్బు కాజేయడం, క్రెడిట్ కార్డులలో టోకరాలు. అయితే మనకీ బాధలు లేవు. మనకి బేంక్‌లో ఎకౌంట్ లేదు, క్రెడిట్ కార్డ్ లేదు. 'వెధవ పెన్షన్' అంటూ ఈసడించేవు. ప్రతీనెలా ఒకటో తారీకున నలభైవేలు నా జీవితాంతం పడతాయి. నా తరువాత నీకు నీ జీవిత కాలమంతా నెలకి ఇరవై వేలు ఇస్తారు. ముష్టెత్తుకోకుండా జీవితం గడుస్తుంది. ఈ దేశంలో అతి తక్కువ మందికి మాత్రమే పెన్షన్ సౌకర్యం ఉంది. కొంతమంది వయస్సు మళ్ళిన వాళ్ళ జీవితాలు పెనం మీద నీటి బిందువుల్లా మాడిపోతాయి" అంటూ ఆలోచనలో పడ్డాడు రామారావు.

"పరమేశ్వరరావుగారు దాదాపు మీ వయసువారే కదూ? మళ్ళీ ఇక్కడికి ఎప్పుడు వస్తారు? " అనడిగింది వైదేహి.

"నిరంతరం ప్రశ్నలు వేసేవాళ్ళకి ఏదైనా అవార్డు ఉంటే అది నీకు వచ్చేస్తుంది. ఆయన ప్రైవేట్ ఇంజినీరింగ్ కాలేజీలో పనిచేస్తున్నారు. వాళ్ళు సెలవిస్తే మళ్ళీ వస్తారు" అన్నాడు రామారావు.

"ఎంచక్కా ఒక చేత్తో పెన్షన్, ఇంకో చేతితో మరో నలభైవేలు సంపాదిస్తున్నారు. మీరూ అలాగ మూడు నాలుగు సంవత్సరాలు పనిచేసి ఉంటే దాదాపు పదిహేను లక్షలు వచ్చేవి. మీరేమో కాళ్ళు నిగడతన్ని పడుకోవడానికి గెంతుకుంటూ అమెరికాకి వచ్చేసేరు. ఈ మూడేళ్ళలో మన గురించి వినోద్‌కి ఇన్సూరెన్స్ కొనడానికి డబ్బు ఖర్చయేది కాదు" అంది వైదేహి చేతివేళ్ళతో లెఖ్ఖలు కడుతూ.

"నీకు డబ్బు మీద ఇంత కాపీనం ఉందని నాకు తెలియదు. అయినా అంత డబ్బు అవసరం మనకి ఇప్పుడు ఏమొచ్చింది? ఏం చేసుకుంటాం? "

"సిరి రా మోకాలడ్డు వాడు.. అన్న సామెత మిమ్మల్ని చూస్తుంటే జ్ఞాపకానికి వస్తోంది. డబ్బు చేదా? ఊc!.. రూపాయల్ని ఎలోగోలాగ డాలర్ల కింద మారిస్తే.." అంటూ రామారావు మొహం లోనికి చూసి ఆగింది.

"మనం జీవితంలో ఎన్నో నిర్ణయాలు తీసుకుంటాం! అప్పుడు తీసుకున్న నిర్ణయాల వలన, తరువాత కాలంలో జరిగిన సంఘటనలు, పర్యవసానాలు మనం ఊహించినట్లు జరగకపోవచ్చు. బెడిసికొడతాయి. ఇప్పుడు నువ్వు మన పాతనిర్ణయాల మీద శవపరీక్ష చేస్తున్నావు. ఇక్కడికి రావడానికి కారణం నేనే! అది సరైనదా? కాదా? అన్న ప్రశ్న నువ్వు లేవదీసేవు. 'దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలి' అంటారు. ఇల్లు చక్కగా ఉన్నపుడు ఇంక సర్దడం ఎందుకనుకున్నాను. అప్పుడప్పుడు నువ్వు సందేహాలు వ్యక్తపరచినపుడు, ఇక్కడ పరిస్థితులు పరికించి చూస్తే నాకూ కొన్ని అనుమానాలు వస్తున్నాయి, చూద్దాం!" అన్నాడు రామారావు.

"ఏం చూడడమో! చూద్దాం! అంటూ

ఆలోచనలో పడతారు. సిగరెట్ పేకెట్ తెచ్చుకుని సిగరెట్ పొగని బైటకి వదలండి. ఫిలాసఫర్ పోజు వస్తుంది" చిరాకుగా వంటగదిలోకి నడిచింది వైదేహి.

రుసరుసలాడుతూ వంటింటిలోకి వెళ్తున్న వైదేహిని ఆశ్చర్యంగా చూసేడు రామారావు.

★ ★ ★

"ఉషా! ఇక్కడ ఉన్న మా ఆఫీసు మూసేస్తున్నారు. మా కంపెనీ, ఇంకో కంపెనీ కలిసి కొత్త కంపెనీ ఏర్పడింది. ఈ కంపెనీ ఖాతాదార్లు ఎక్కువ మంది జార్జియాలోనే ఉన్నారు" అన్నాడు వినోద్.

"అయితే మీ సంగతేమిటి? "

"నన్ను జార్జియా ఆఫీసుకి మారమన్నారు. వద్దంటే ఉద్యోగం పోతుంది"

"ఇది చాలా ఘోరం!"

"నా పరిస్థితి గుడ్డిలోమెల్ల. చాలామందికి రెండువారాల నోటీసిచ్చేరు"

"ఇక్కడే ఏదైనా ఉద్యోగం చూసుకోకూడదూ? మీకు అనుభవం ఉంది కదా"

"ప్రయత్నం చేయవచ్చు. ఒకటి రెండు నెలల్లో ఉద్యోగం దొరకవచ్చు. కానీ ఆ కొత్త కంపెనీలో ఎలాంటి హెల్త్ ఇన్సూరెన్స్ అమలుపరుస్తున్నారో చెప్పలేం. చిక్కుల్లో పడవచ్చు. ఉదాహరణకి మా అమ్మ, నాన్నల సంగతే తీసుకో! దరఖాస్తు పెట్టేటప్పుడు నేను మా అమ్మకి 'మధుమేహం' ఉందని రాయలేదు. కొత్తకంపెనీలో ఉన్న హెల్త్ ఇన్సూరెన్స్ ఈ విషయంలో అభ్యంతరం చెప్పవచ్చు. ఒక కంపెనీ నుంచి ఇంకో కంపెనీకి మారేటప్పుడు ఒబామా ప్రభుత్వం కొన్ని వెసులుబాట్లని కలిగించింది. కానీ ఉద్యోగం వదిలేస్తే ఏమవుతుంది? తెలియదు. ఒక కంపెనీ నుంచి ఇంకొక కంపెనీకి మారడం, ఉద్యోగం వదిలేసి ఇంకో కంపెనీలో చేరడం కన్నా తేలిక. అందుచేత నాకు జార్జియా వెళ్ళడం కంటే ఇంకో మార్గం లేదు. సోమవారం ఉదయం

**కొత్తగాలి...**

**అతడు ఎర్రబస్సు**
**ఆమె ఎయిర్ బస్సు**
**ఇద్దరూ కలిస్తే**
**కస్సు బుస్సు**

– ముడుంబ సీత,
భద్రాచలం

విమానంలో వెళతా, తిరిగి శుక్రవారం రాత్రికి వస్తా. ఈలోగా ఇక్కడే ఏదైనా దొరుకుతుందేమోనని ప్రయత్నిద్దాం" అన్నాడు వినోద్.

"ఇన్సూరెన్స్ కంపెనీల మధ్య ఒప్పందం కుదిరింది. ఈ కేస్ విషయం బహిర్గతం చేయకుండా ఉంచడానికి వాళ్ళు ఒప్పుకున్నారు. అధికారికంగా ఈ వ్యాజ్యం ఉందని నమోదు అవదు. వాళ్ళు అడిగిన రెండు మిలియన్లు వాళ్ళకి ముట్టబోతున్నాయి" అంది ఉష.

"రోజులు బాగులేవంటూంటారు కొందరు! ఇది అలాంటిదే కాబోలు!"

"ఈ శనాదివారాల్లో లివర్‌మోర్ దేవాలయంలో పూజ చేయిద్దాం. అత్తయ్యని, మావయ్యని అక్కడికి తీసుకెళ్ళినట్లుంటుంది"

పరుపు మీద అటూ ఇటూ కదులుతూ నిద్రపట్టని వైదేహి "ఏమండోయ్! కోడలు మనల్ని గుడికి తీసుకెళ్తుందిట" అంటూ భుజంతో భర్తని పొడిచింది.

దానికి ఏం సమాధానం చెప్పాలో తెలియక రామారావు మౌనం వహించేడు.

★ ★ ★

ఉషలో వచ్చిన మార్పు రామారావు, వైదేహిలని ఆశ్చర్యపరుస్తోంది. ఉన్నట్టుండి కోడలికి దేవుడంటే భక్తి పెరగడం విచిత్రంగానే ఉంది ఇద్దరికి.

కోడలి ఈ ప్రవర్తనకి కారణం కొంత ఊహించగలిగినా "ఏమండీ! గుడికి వెళ్ళివచ్చేక ఉష ప్రతిరోజూ దీపం వెలిగిస్తోందండీ! గమనించేరా? " అనడిగింది వైదేహి భర్తని.

తల ఊపేడు రామారావు.

"అనంత్ ఒక వారంలో కాలేజీ నుంచి శెలవులకి వస్తాడట. వాళ్ల మాటల వల్ల ఇది తెలిసింది. కానీ వాడు రాబోతున్నాడన్న ఉత్సాహం, ఆనందం వాళ్ళలో కనపడలేదు. ఏమిటి దీనికి కారణం? "

"ఏడాదిగా అనంత్‌లో మార్పు వచ్చింది. అది ఏమిటో వివరించలేను. తల్లిదండ్రులతో వాడి ముభావంగా ఉండడం పెరిగింది. వాళ్ళని తప్పించుకుని తిరిగేవాడు. మనతో అప్పుడప్పుడు కబుర్లు చెప్పేవాడు కానీ వాళ్ళకి దూరంగా ఉండేవాడు. వినోద్, ఉషల నిరాసక్తికి అదే కారణం కావచ్చు"

"ఆ వయస్సులో ఉండే విప్లవ ధోరణి కానీ, ఉత్సాహం కానీ అనంత్‌లో కనిపించలేదు. కారు డ్రైవింగ్ నేర్చుకుంటానని కానీ, పార్టీలకి వెళ్తానని కానీ అనంత్ మారాం చేయడం నా కంటపడలేదు" అంది వైదేహి.

"అనంత్ కాలేజీకి వెళ్ళి ఆరునెలలయింది. హాస్టల్‌లో కొత్త వాతావరణం వాడిలో ఎంత మార్పు తెచ్చిందో! ఒకసారి నాతో నడకకి వచ్చినపుడు 'నేను తెలుగు నేర్చుకోగలనా? ' అనడిగేడు. మారిన ఇంటి వాతావరణం చూసి వాడు ఎలా స్పందిస్తాడో? " అంటూ ఆలోచనలో పడ్డాడు రామారావు.

తనకి, కృష్ణారావు అన్నయ్యకి వయస్సులో తేడా రెండున్నర సంవత్సరాలే! అందుచేత అన్నయ్యతో తనూ ఆటలకి పాటలకి పరిగెత్తేవాడు. కృష్ణా! కృష్ణా! అంటూ అందరూ అన్నయ్యకే ప్రాముఖ్యం ఇవ్వడం చూసి అన్నయ్యంటే తనకి రవ్వంత ఈర్ష్య కలిగేది.

ఇంజినీరింగ్ పాసవగానే స్కాలర్‌షిప్ రావడంతో అన్నయ్య అమెరికా వెళ్ళడం, తనకి అలాంటి అవకాశం లభించకపోవడంతో ఆ ఈర్ష్య చాలాకాలం కరిగిపోలేదు. తరువాత కాలంలో ఆర్థికంగా ఆదుకుని తనని అన్నివిధాలా ప్రోత్సహించేడు అన్నయ్య. చిన్నప్పుడు జరిగిన ఒక చిన్న సంఘటన తనకి బాగా జ్ఞాపకం. తెగిన గాలిపటం గురించి ఇద్దరూ పరిగెత్తేరు. గాలిపటాన్నించి వేలాడుతున్న దారాన్ని చిక్కించుకోవడానికి రెండు చెట్టుకొమ్మల్ని అందుకుని పరిగెత్తేరు. తనకంటే అన్నయ్య రెండు అంగుళాలు పొడవు. కృష్ణారావు అన్నయ్య ఆ తెగిన గాలిపటాన్ని చేజిక్కించుకుంటే, తనలో ఈర్ష్య, కోపం పెల్లుబికాయి. కంటి నుంచి నీళ్ళు జలజలా రాలేయి. అది చూసి 'తీసుకో' అంటూ గాలిపటాన్ని ఇవ్వబోయేడు. మనసులో తీసుకోవాలని ఉన్నా బెట్టుగా 'నాకు వద్దు' అంటూ అన్నయ్య చేతులని విదిలించేడు తను.

'ఒరేయ్! ఇలాంటి చిన్నచిన్నవాటి గురించి కన్నీరు పెట్టుకుంటుంటే చాలా కష్టం' అన్నాడు, ఆలోచనలలో పరిణితి చెందిన కృష్ణారావు అన్నయ్య.

'కృష్ణారావు అన్నయ్య ఎలా ఉన్నాడో? ఒకసారి ఫోన్ చేసి మాట్లాడాలి' అనుకుంటుంటే..

"ఎందుకూ పనికిరాని ఆలోచనలు మెదడుని వేడెక్కిస్తాయి! పడిశం పడుతుంది!" అంటూ భుజంతో పొడిచింది వైదేహి.

సహధర్మచారిణి.. ఏడడుగులు నడిచింది ఆనాడు.. ఏడు సముద్రాలు దాటి వచ్చింది ఈనాడు. ఏ విషయంలోనూ తన నిర్ణయాన్ని ఒప్పుకోలేదన్న కోపం ఆమెలో ఉందా?

ఛ! 'మావారు' 'మావారు' అంటూ మోతాదుకి మించి చేతులు ఊపుకుంటూ

తన గురించి ఎవరితోనో చెబుతూ మురిసిపోతూ మాటలాడడం జ్ఞాపకానికి వచ్చి, ఆ లేత దెప్పుళ్ళలో ఉన్న లాలిత్యాన్ని గ్రహించి వైదేహిని దగ్గరకి లాక్కున్నాడు రామారావు.

"ఇదేమిటి? !" అనుకుంటూ ఆశ్చర్యంతో ఆనందపడింది వైదేహి.




**ఇండియా:**

ఉత్తమ్, వినయ్‌లకి వీడ్కోలు చెప్పి తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి దాదాపు రాత్రి రెండుగంటలయింది. అయినా అలవాటు ప్రకారం ఉదయమే తెలివి వచ్చింది కృష్ణారావుకి. స్టౌమీద పాలు కాగడానికి ఉంచి పళ్ళు తోముకుని, గెడ్డం గీసుకుంటుంటే చర్మం తెగి రక్తం కారడం ఆరంభమైంది. బొటనవేలిని తెగిన చోట బలంగా నొక్కితే కానీ రక్తం కారడం ఆగలేదు. పొయ్యిమీద పాలు పెట్టేనన్నది జ్ఞాపకానికి వచ్చి వడివడిగా వంటగదిలోనికి వచ్చి చూస్తే, పొంగగా మిగిలిన పాలు స్టౌమీద మరుగుతున్నాయి. స్టౌ ఆఫ్ చేసి, కాఫీ కలుపుకొని, రక్తం ఇంకా చిమ్ముతుందేమోనని అద్దంలోకి పరీక్షగా చూసేడు. పిస్తోల్ లోంచి ఒకేసారి పేలుతూ బైటకి వస్తున్న తుపాకీగుండ్లలా ప్రతిబింబం నుంచి ప్రశ్నల వర్షం వడలిపోయినట్లున్న మొహం మీద పడగానే ఉలిక్కిపడ్డాడు.

'ప్రశ్నిస్తున్నది ప్రతిబింబం! అబద్ధాల తడక వెనుక దాక్కోవడం వీలవదు!' అనుకుంటూ కాఫీ కప్పుతో తూర్పువేపు బాల్కనీలోకి వచ్చి కుర్చీలో చతికిలపడ్డాడు.

నీళ్ళు ఇళ్ళని చుట్టుముట్టినట్లు, సూర్యుడు భూమిమీద ప్రదేశాలని తన కిరణాలతో ముంచెత్తుతూ ఆకాశం మీదకి రాగా కృష్ణారావు లోపలికి వచ్చి కూర్చుంటుంటే.. ప్రతిబింబం సంధించి విసిరిన బాణాలు జ్ఞాపకానికి వచ్చేయి. తల విదిలించి వాటిని చెదరకొడుతుంటే నాలుగు నెలల క్రితం కొండడు తలుపు తట్టడం జ్ఞాపకానికి వచ్చింది. "కృష్ణయ్యా! నీ సహాయం కావాలి" అంటూ ఆరోజు కంగారుగా కొండడి గొంతు వినిపించింది.

"లోపలికి రా! కంగారు పడకుండా చెప్పు! ఏం జరిగిందో? " అంటూ కొండడిని శాంతపరచబోయేడు తను. కానీ కొండడి మొహంలో అలజడి పిసరంత కూడా తగ్గలేదు. ముందరరోజు రాత్రి నిద్రపోలేదు కాబోలు! కళ్లు ఎర్రగా దానిమ్మ గింజ రంగులో ఉన్నాయి. దుమ్ముధూళి నిండి ఉన్న కాళ్లని వేసుకున్న చెప్పులు కప్పలేకపోతున్నాయి. దీనంగా ఉన్న కొండడి భుజం మీద చేయి వేశాడు.

"ఆలస్యం అయిపోతోంది. మా వాడిని పోలీసులు అరెస్ట్ చేసి తీసుకెళ్లి రిమాండ్‌లో ఉంచేరు. వాడిని విడిపించాలి. బయలుదేరు కిష్టయ్యబాబు" అన్నాడు కంగారు పడుతూ కొండడు.

. "కంగారుపడకు! బయలుదేరుతాను! నేను తయారయ్యేలోగా కాఫీ తాగు!" అంటూ శాంతపరిచాడు తను. తను తయారయి బట్టలు వేసుకుంటుంటే- "మావాడు పనిచేస్తున్న ఫ్యాక్టరీలో జీతాలు పెంచమని జరిగిన ఆందోళనలో ఘర్షణ అయిందట. మావాడిని పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. రాత్రి నాకు కబురు వచ్చింది. ఎవరైనా లాయర్ని సంప్రదించి వాడిని విడిపించాలి" అన్నాడు కొండడు,

బొంగురుపోయిన గొంతుకతో.

"నాకు ఏ లాయర్‌తోనూ పరిచయం లేదే.. అయినా అక్కడికి వెళ్లి కనుక్కుందాం!"అన్నాడు తను.

ఉదయం పదకొండు గంటలయింది. విజయనగరం కోర్టు ప్రాంగణంలో నల్ల కోట్లు ధరించిన చాలామంది లాయర్లు బిజీగా అటు ఇటూ కదులుతున్నారు. తనకి, కొండడికి ఏభై అడుగుల దూరంలో ఆకులు తక్కువగా ఉన్న చెట్టుకింద సూర్య కిరణాలు మొహం మీద పడకుండా ఎడమచేతిని అడ్డుపెట్టుకొని ఎవరికోసమో నిరీక్షిస్తున్న ఒక ఆడలాయరు నిలబడి ఉంది. 'ఈమెని ఎక్కడో చూశానబ్బా!' అనుకుంటూ ఆమెని సమీపించి 'మీకు తీరుబడి ఉందా? మాకు ఒక లాయరు సహాయం కావాలి' అని అడిగాడు తను.

సూర్యకిరణాలకి అడ్డుపెట్టుకున్న చేతిని దించి, రిమ్‌లెస్ కళ్లద్దాలలోంచి దృష్టిని తన వైపు సారించి "నేను ఒకరి కోసం నిరీక్షిస్తున్నాను. అతను పది గంటల ముప్ఫయి నిమిషాలకి వస్తానన్నాడు. ఇక రాడేమో! ఆ రోడ్డు దాటగానే నా ఆఫీసు ఉంది. అక్కడ మాట్లాడుదాం" అంటూ తన ఆఫీసువేపు నడిచిందామె.

ఆమె ఆఫీసు గదిలో సర్దుకున్నాక "చెప్పండి" అంది.

కొండడి వేపు చూసేడు తను. కానీ కొండడు ఏమీ మాట్లాడక పోవడంతో తనకి అర్థమైంది వివరించేడు.

"మీ అబ్బాయి వివరాలు, అరెస్టు ఎక్కడ చేసేరో? రాసి ఇవ్వండి. నాకు తెలిసిన పోలీసాఫీసరు ఉన్నాడు, కనుక్కుంటాను. మీరిక్కడే కూర్చోండి!" అంటూ తను వివరాలు రాసిన కాగితం అందుకుంది.

టేబిల్ మీదున్న కర్ర చెక్కమీద రాసిన దానిని బట్టి ఆమె పేరు 'కవిత' అని తను గ్రహించేడు.

అరగంట గడిచేక ఆమె తిరిగి వచ్చి "మధ్యాహ్నం మూడు గంటలకి మీ అబ్బాయిని మెజిస్ట్రేటు దగ్గర హాజరుపరుస్తారు. ఆ మెజిస్ట్రేటు నాకు బాగా పరిచయస్తుడే! బెయిల్‌కి ప్రయత్నిద్దాం! నా పేరు కవిత" అంది.

తన గురించి పరిచయం చేసుకున్నాక, "మీఫీజు గురించి చెప్పండి"అన్నాడు తను.

"మరీ ఎక్కువ కాదు! డోంట్ వర్రీ! మూడు గంటలకి రండి!" అంది కవిత కుర్చీలోంచి లేస్తూ.

మధ్యాహ్నం మూడుగంటలకి ఆమెని కలిస్తే "సారీ! ఈవేళ మీవాడి కేసు చూసే సరికి సాయంకాలం అవుతుంది. బెయిల్ అనుమతించినా విడుదల ఈవేళ అవదు" అంది కవిత.

నిశితంగా ఆమె వేపు చూసేడు తను.

"మనం ఎంత ప్రయత్నించినా కొన్ని సానుకూల పడవు. కొన్ని కార్యవిధానాలు అంతే! వాటిని మార్చడం మనతరం కాదు. దాదాపు ఇరవై వేలు పూచీకత్తుగా కట్టాల్సి వస్తుంది. పైకం ఉందా? "

"కొంత ఉంది. లేకపోతే ఏ.టి.ఎమ్ లోంచి తెస్తా!" అన్నాడు తను.

కొండడు వడ్డీకి డబ్బు తెస్తానంటే వద్దని వారించి ఇరవైవేలు పైకం కట్టి కొండడి కొడుకుని విడిపించేడు. కవితకు కృతజ్ఞతలు చెబుతూ "మీ ఫీజు? " అనడిగేడు.

"రెండువేల రూపాయలు"

పర్సులోంచి రెండువేల రూపాయలు అందించి, "నేను ఇక్కడికి దగ్గరగానే ఉంటాను. ఇటువైపు వస్తే మీకు హలో చెబుతాను" అన్నాడు తను.

"ష్యూర్!' అంటూ చేయి చాచి కరచాలనం చేసింది కవిత.

గదిలోంచి బైటపడుతుంటే ఆహ్లాదంగా చేయి ఊపింది. దృఢంగా ఉన్నా ఆ కరచాలనంలో మృదుత్వం కనిపించింది తనకి. పదిహేను రోజుల తరువాత ఆమెని కోర్టు

ప్రాంగణంలో కలిసి "ఇంట్లోకి సరుకుల కోసం ఇటు వచ్చేను. దారిలో కోర్టు కని పిస్తే మీరు ఎలా ఉన్నారో? ఒకసారి పల కరిద్దామని ఆగాను" అన్నాడు తను.

"నిజంగా?" అనడిగింది కవిత.

"కొంత మట్టుకు నిజం. ఈ టైమ్‌లో విజయనగరానికి వస్తే లంచ్ హోటల్లో తింటాను. మీ లంచ్ అయిపోయిందా? వాదించడానికి కేసులు ఉన్నాయా?"

"లేదు.. లేదు. దగ్గరలో మంచి హోట ళ్లు లేవు. అందుకే ఇంటి నుంచి లంచ్ తెచ్చుకుంటాను. మధ్యాహ్నం కేసులు ఏమీ లేవు. ఇంటికి వెళదామనుకుంటున్నాను"

"గుడ్! ఇంటికి వెళ్లి లంచ్ తినాలిగా! నా దగ్గర కారు ఉంది. లంచ్‌కి వస్తారా?"

మందహాసం చేసి హ్యాండ్ బేగ్ అందు కుంది కవిత.

"ఏదో బలవంతం చేసినట్లు అత్యంత క్రమశిక్షణతో తింటున్నారు. నేను చూడం డి! ఎలా తింటున్నానో?" అంటూ కారం తినడంవల్ల ముఖానికి పట్టిన చెమట ని రుమాలుతో తుడుచుకుంది కవిత.

"మిమ్మల్ని గతంలో ఎక్కడ చూసేనో జ్ఞాపకానికి వచ్చింది" అన్నాడు తను.

"రియల్లీ?"

"అబద్ధం చెప్పవలసిన అవసరం ఏముంది?"

మూసిన గుప్పెట తెరిస్తే బైటపడిన విశిష్ట వస్తువుని చూసినపుడు కలిగిన ఆశ్చర్యం కవితలో చూసేడు తను. అది తన ఊహే కావచ్చు! కవితది బ్రహ్మాండమై న అందం కాదు. కానీ ఒకప్పటి అందం ఛాయలు కనిపించేయి. సాదా నేతచీరలో హుందాగా కనిపించింది తనకి.

ప్రశ్నార్థకంగా తనవైపు చూసింది.

"నిజం ఆనందాన్నిస్తుంది. అప్పుడ ప్పుడూ అది మనల్ని ఇరకాటంలో పెట్టినా, 'నిజం' అంటే నాకిష్టం. నేనూ, ఒక స్నేహి తుడు అరకు వెళ్లి 'అశోకా కేఫ్'లోనో? 'అజంతా కేఫ్'లోనో? నాకు సరిగ్గా జ్ఞాప కానికి రావడం లేదు, టిఫిన్ తిన్నాం. రుచికరంగానే ఉంది, టిఫిన్ చవుక కూడా! ఏనీవే లంచ్ చేసేక బైటకివచ్చి కారులో ఎక్కబోతున్నాను. మధ్యాహ్నం ఒంటి గంటయింది. లోయలో మధ్యాహ్నం వేడి సంగతి నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. రోడ్డుకి రెండోవైపు మీరు నిలబడి ఉన్నారు. బోటిల్ గ్రీన్ చీర కట్టుకున్నారు. పైటచెంగు ఒకపక్క మీ మొహాన్ని కప్పి వుంది. రెండోవైపు మొహం మీద చీర పమిట వడకట్టిన సూర్యకిరణాలు ఆకుపచ్చ రంగులో వాలు తున్నాయి. గతంలో ఒకసారి ఇరానియన్ పెయింటింగ్ ఒకటి చూసేను. అది జ్ఞాప కానికి రాగా పరీక్షగా మిమ్మల్ని గమనిం చేను అర నిమిషం" అన్నాడు తను, నిజం చెబుతూ.

ఆనందమా? ఆశ్చర్యమా? జంకా? ప్ర శ్నార్థకమా? ఏమో? తెలియదు కానీ, అద్దకం పట్టించిన ఎరుపుచీర మొదటిసారి నీళ్లలో గుంజితే వదిలిన ఎరుపు రంగులా కవిత మొహం రంగులని మార్చింది.

"వెయిటర్! ఈ కూరలో ఇంత కారం వేశారేంటి? ఒక లిమ్కా త్వరగా తీసుకురా!" అంటూ రుమాలుతో మొహం తుడుచుకుంది. భోజనం ముగించి కవితని కోర్టు దగ్గర వదులుతుంటే "మీతో అరకు వచ్చిన స్నేహితుడు ఇక్కడే ఉన్నాడా? థాంక్స్! ఫర్ ది లంచ్! రాత్రికి వంట తప్పింది" అంటూ కారు దిగింది కవిత.

"మళ్లీ ఇటు వచ్చినప్పుడు కలుస్తాను" అని తనంటే.. "ఫోన్ చేస్తారుగా?" అంటూ కారు తలుపు వేసింది.

తను మలుపు తిరిగేంత వరకు కవిత అక్కడే నిలబడి ఉండడం 'రియర్ వ్యూ' అద్దంలో కనిపించింది.

'ఫోన్ చేస్తారుగా!' అంది కవిత, అంటే లంచ్‌కి వచ్చేటప్పుడు ముందరగా ఫోన్

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# సామాజిక ప్రయోజనానికి సాక్షి!




నూతన సంవత్సర కానుకగా అందించిన కన్నెగంటి అనసూయ నవల 'కొత్తగా రెక్కలొచ్చెనా..!' సింప్లీ సుపర్బ్!

పాఠకుల దృష్టిలో నూరుశాతం మార్కులు పొందడానికి అర్హమైన నవల ఇది. ఉత్తమ నవలకి ప్రధాన లక్షణాలు రెండు ఉండాలి. మొదటిది సమాజంలోని సమస్యలపై చదువరులను ఆలోచింపజేయడం, రెండోది సమాజంలో నానాటికీ అడుగంటుతున్న మానవతా విలువలను, సంస్కృతీ సంప్రదాయాలను, కళలను, కళాకారులను కాపాడాల్సిన బాధ్యతను గుర్తించడం. ఈ రెండు విషయాల్లోనూ ఈ నవలా రచయిత్రి సఫలీకృతురాలయ్యారు.

ఈ వర్ధమాన రచయిత్రి తొలి నవలనే ఆద్యంతం ఆకట్టుకునే శైలితో, సందేశాత్మక పాత్రలతో, సమగ్ర విషయంతో తీర్చిదిద్దిన తీరు అద్భుతం.

అవనిజలాంటి అమ్మాయిలు, అబ్బాయిలు ఈ రోజుల్లో ఉన్నత చదువుల కోసం తల్లిదండ్రులకి, ఇంటికి దూరంగా హాస్టల్ జీవితం గడుపుతుండటం అనివార్యమైంది. ఎదిగీ ఎదగని వయసులో, అనుభవ రాహిత్యంతో వారు ఆ హాస్టల్ వాతావరణంలోని ఒత్తిళ్లకి, అసౌకర్యాలకి గురికావడమే కాకుండా తోటి విద్యార్థినీ విద్యార్థుల మానసిక, లైంగిక అత్యాచారాలను మౌనంగా భరించాల్సి వస్తోంది. దాంతో డిప్రెషన్ గురయి ఆత్మహత్యల వరకు పరిస్థితి దారితీస్తోంది. స్వలింగ సంపర్కం, లైంగిక అత్యాచారాలు, మత్తుమందుల (డ్రగ్స్) సేవనం, బూతుచిత్రాలు, లైఫ్‌స్టైల్ పేరుతో విచ్చలవిడితనం, సాంఘిక కట్టుబాట్లు తెంచుకోవడం, కనీస సామాజిక బాధ్యత లేకపోవడం వంటి సామాజిక రుగ్మతలపై ప్రజలందరూ ఆలోచించాల్సిన ఆవశ్యకతను ఈ నవల ప్రభావవంతంగా ఆవిష్కరించింది.

ఇంకా చతురకత 'సారాజకీయం', చమత్'కారం', 'టెక్‌గురూ' బాగున్నాయి. 'అక్షరాలు', ఆణిముత్యాలే! 'కొత్తగాలి' ఇంకా బలంగా వీచాలనిపిస్తోంది. 'చతుర సమ్‌గతులు' విజ్ఞానదాయకంగాను, 'సకినాలు' రుచిగాను ఉన్నాయి. 'చిట్కాలక్ష్మి', 'జోక్స్' అలరించాయి.



'చతుర'లో మరింత నచ్చిన శీర్షిక 'నవలావలోకనం'. రుద్రాభట్ల నరసింగరావుగారి పరిచయం, వారి 'ఆదర్శ శిఖరాలు' నవలపై విశ్లేషణ ఆసక్తికరంగా ఉంది. ఆ నవలను తప్పక చదవాలనిపించింది. పరిచయం చేసినందుకు ధన్యవాదాలు.

– ర్యాలి శ్రీనివాసరావు,
పిఠాపురం, తూ.గో. జిల్లా

చేయమనా? లేక వీలున్నప్పుడు ఫోన్ చేయమనా? లేతాకుపచ్చ రంగు తనకిష్ట మని ఆవేళ ఆ రంగు ఆమె మొహం మీద వెలిసిందని, తను చూసిన నిర్జీవమైన పెయింటింగ్ కన్నా, సజీవమైన మీ మొహం మెరిసిందని తను చెబ్దామని ఉన్నా, నోరు విప్పలేకపోయాడు. ఎలా చెప్పడం? ఎందుకు చెప్పడం? అది ఆమెకు ఆనందాన్ని కలగజేస్తుందని తె లిస్తే తను చెప్పవచ్చు. ఒకవేళ ఆమె దానిని తప్పు పట్టుకుంటే 'సరిగ్గా పురిలేని స్నేహదారం పుటుక్కున తెగిపోతే..' అను కుంటూ ఆలోచించాడు తను.

రెండుసార్లు ఫోన్ చేసి వాకబు చేస్తే, "ఈవేళ వాదించవలసిన కేసు ఉంది" అంటూ జవాబిచ్చింది. అది విన్నాక తను ఆలోచనలో పడ్డాడు. అపనమ్మకం, అను మానం తనని కలవర పెడుతుంటే "రేపు కావాలంటే లంచ్ చేయవచ్చు" అంటూ ఫోన్ వచ్చింది.

"ఈ మారు బిల్ నాది" అని కవిత బిల్ ఇవ్వబోతుంటే "వచ్చేసారి తప్పకుం డా మీరే ఇద్దురు గానీ" అన్నాడు తను.

తన మనస్సులో జరిగిన ఊగిసలాట గురించి చేప్పేడు. కప్పిపెట్టుకున్న ఆనం దాన్ని వెల్లడిస్తూ సన్నగా నవ్వింది.

"నేను లా ప్రాక్టీసు మొదలుపెట్టి ముప్ప యి ఏళ్లయ్యేయి" అంది మాట మారుస్తూ.

"రియల్లీ!"

"అబద్ధం ఆడవలసినదేముంది? " అంటూ హాయిగా నవ్వి, "రేపు ఆదివారం మా ఇంట్లో నా తోటిలాయర్లకి లంచ్, మీరూ రండి" అంటూ తన ఇంటికి ఎలా రావాలో చెప్పింది కవిత.

ఆదివారం కవిత ఇంటికి చేరేసరికి పన్నెండు గంటలయింది. తోటి లాయర్లు కాబోలు! నలుగురైదుగురు ఉన్నారు.

"థాంక్యూ!" అంటూ తనందిచ్చిన పుష్ప గుచ్ఛం అందుకుని ఆనందం వ్యక్తప రచింది కవిత. కానీ ఆమె మొహంలో, ధోరణిలో ఏదో బెరుకుదనం, ఆందోళన ఉందనిపించింది తనకి.

ఇద్దరు ముగ్గురు పురప్రముఖులు వచ్చి శుభాకాంక్షలు తెలిపేరు. ఐదారు టేబిళ్ల చుట్టూ నాలుగు కుర్చీలు, బఫే పద్ధతిలో పెద్దటేబిల్ మీద గిన్నెలో పదార్థాలు అమర్చి ఉన్నాయి.

"ఇవన్నీ మా అబ్బాయి రాంకీ, మా అమ్మాయి వర్ధని సిద్ధం చేశారు" అంటూ కొడుకు, కూతురుని పరిచయం చేసింది. క్రమేణా మాటల సందడి ఎక్కువయింది. కొందరి సంభాషణ తీరు చూస్తుంటే వాళ్లు తన గురించి చర్చిస్తున్నారా? అనిపిం చింది. దానికితోడు తను వాళ్లతో మా ట్లాడే తీరుని కవిత జాగ్రత్తగా గమ నిస్తోందని తనకి అనుమానం కూడా వ చ్చింది. ప్లేటులో పదార్థాలుంచుకొని ఒక టేబిల్ దగ్గర కూర్చుని నేప్‌కిన్ సవరించు కుంటుంటే, ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ "మా మమ్మీతో మీకు ఎన్నాళ్ల నుంచి పరిచయం? " అడిగేడు రాంకీ.

"దాదాపు రెండు నెలల క్రితం ఆమెను కోర్టులో కలిసేం. నా స్నేహితుడి కొడుకుని రిమాండ్‌లో ఉంచితే బెయిల్‌కి అప్లికేషన్ పెట్టాలని కోరాం!"

"అంతకుముందర పరిచయం లేదా? " అంటూ వర్ధని చర్చలో కలగచేసుకుంది.

"ఏం? ఎందుకు? అంత ఆశ్చర్యం? " అనడిగేడు తను.

"మీతో చాలాకాలంగా పరిచయముంద ని మమ్మీ చెప్పింది"

"మీరు ఈ దేశంలో ఉండిపోతారా? అమెరికా వెళ్లిపోతారా? అమెరికా వదిలి ఎందుకు ఇక్కడికి వచ్చేరు? " అంటూ ప్రశ్నల వర్షం కురిపించేడు రాంకీ.

వ్యక్తిగతప్రశ్నలు వేసేంత చనువు మన మధ్య లేదని కటువుగా సమాధానమి ద్దామనిపించినా నిగ్రహించుకుని "ఏమో!"

అంటూ మందహాసం చేసేడు తను.

ఆ సమాధానం రాంకీ, వర్ధనిలకి నచ్చలేదని వాళ్ల మొహాలే చెప్పేయ్. ఇరవై ఏళ్ల క్రితం రోహిణి కేన్సర్‌తో చనిపోయిందని తనెలా చెప్పగలడు?

"ఎక్స్‌క్యూజ్ మీ!" అంటూ ఆహార పదార్థాలని తెచ్చుకోడానికి లేచాడు.

రెండు గంటలు గడిచేక తను వెళ్లడానికి సన్నద్ధుడవుతుంటే ఒక పేకెట్ చేతికి అందిస్తూ 'రాత్రి డిన్నర్‌కి పనికి వస్తుంది. వచ్చినందుకు థాంక్స్! మీకు మెయిల్ పంపుతాను' అంది కవిత, సాగనంపుతూ.

ఎందుకో ఆ ఆఖరి వాక్యంలో తనకి జీర కనిపించింది. పరీక్షగా కవిత వేపు చూస్తే, ఆమె కళ్లలో పల్చని నీటి తెర!

భారంగా ఇంటికి వచ్చేడు తను.

రెండు రోజుల తరువాత కవిత నుంచి మెయిల్ వచ్చింది.

'పరమపదసోపాన పటంలో వేసిన పందెంలో అనుకోకుండా నిచ్చెన ఎక్కినట్లు మన పరిచయం పెరిగింది. 'గబుక్కున పెరిగేది ఏదైనా చటుక్కున తరుగుతుంది' అన్నారెవరో. నిజాయితీ అంటే మీకెంత ఇష్టమో నాకూ అంతే ఇష్టం.

కేవలం ఐదుసార్లు కలిసిన మన పరిచయం ఇంటా బయటా ఊహించని విధంగా చర్చనీయాంశమైంది. 'ఎందుకు పట్టించుకోవాలి? ' అనుకున్నాను. నా జీవితం అంతా లాయర్ వృత్తిలోనే గడిచింది. నా గురించి బాగా తెలిసిన లాయర్లే శ్లేషతో మాట్లాడుతుంటే వాళ్లతో ఎలా పోట్లాడగలను? మడతపేచీలు, తగాదాలు సృష్టించి డబ్బు పోగేసుకున్న లాయర్లు, కృత్రిమ సంస్కారం ప్రదర్శిస్తుంటే ఎలా భరించను? వాళ్లని తప్పించుకోవాలంటే వృత్తిని వదిలేయాలి. దేనిని చూసుకుని వదిలేయాలి? నే తీసుకున్న కేసుల్ని వాదించేటప్పుడు కలిగే తృప్తి ఇంకెక్కడ లభ్యమవుతుంది? బెంగళూరు కొచ్చిన్‌ల నుంచి వచ్చిన రాంకీ, వర్ధని ఏవేవో మాటలాడేరు. ఇక్కడ నుంచి మకాం ఎత్తేసి తమ దగ్గర వంతులవారీగా ఉండమన్నారు. ఆ ప్రతిపాదన నాకు ఏమాత్రమూ రుచించలేదు. అది వ్యక్తపరచకుండా 'చూద్దాం' అని దాటవేసేను. వాళ్ళకి అంత భయం ఎందుకు కలిగిందో అర్థం కాలేదు. ఈమధ్య నాకు ఒక కల వచ్చింది. రైలులో ప్రయాణం చేస్తున్న నన్ను తెల్లవారుజామున నాలుగు గంటలకి ఒక రైల్వేస్టేషన్‌లో టికెట్ కలెక్టర్ బలవంతంగా దింపేసేడుట. రైలు వెళ్ళిపోయింది. బిక్కుబిక్కుమంటూ వెలుగు కోసం ఎదురు చూస్తుంటే నే వెళ్ళే దిశలో ఒక రైలు త్వరలో రాబోతోందని ఇద్దరు ఫ్లాట్‌ఫారమ్ మీద మాట్లాడుకోవడం వినిపించింది. ఆ రైలు వస్తుందా? అది నే వెళ్ళే దిశలోనే పయనిస్తుందా? ఆ రైలులో ఎక్కే అవకాశం ఉందా? అని భయంతో గింజుకుంటుంటే మెలకువ వచ్చింది. నిజానికి ఆ కలలో లాగే ఉంది నా పరిస్థితి. నా ఆలోచన గజిబిజిగా, పరిపరివిధాల పోతోంది. ఆ ఆలోచనల సుడిగుండం లోంచి బైటపడేవరకు మీరు ఇటు వైపు రావద్దు. మన పరిచయం పెద్దదేమీ కాదు. బట్ ఐ లైక్ యూ! కానీ ఏం చేయను సారీ!' అని ఉంది.

'మీ పరిస్థితి నాకు అర్థమయింది' అంటూ ముక్తసరిగా తను జవాబు పంపించేడు. అది జరిగి రెండు నెలలయింది. తరువాత కవిత దగ్గర నుంచి ఏ సమాచారమూ రాలేదు. కవిత తరచూ జ్ఞాపకానికి వచ్చినపుడు ఒకసారి ఫోన్ చేస్తే? అన్న ఊహ కదలాడినా ఆమె అభ్యర్థన.. ఆ ఆలోచనని చంపేసింది. ఇతర విషయాలకు ఆలోచనలని మళ్లించేడు.

ఉత్తమ్, వినయ్‌లు వచ్చి 'స్తబ్దుగా ఇక్కడెందుకు? వచ్చేయ్!' అని పోవడంతో శివరావ్‌ని కలిసి "మనం చదువుకున్న హై

స్కూల్‌కి, కాలేజీకి ఏదైనా చేద్దాం!" అన్నాడు.

"ఆ! ఆ! నీలాగే చాలామంది పాత విద్యార్థులు ఆసక్తి ప్రదర్శించేరు. హైస్కూల్‌కి మున్సిపాలిటీకి ఉన్న లింక్ వలన గబుక్కున ఏదీ సాధ్యపడదు. నీలాంటి వాళ్ళు ఇదే ప్రశ్న వేస్తుంటే రెండు, మూడు సార్లు హైస్కూల్‌కి వెళ్ళి పరిశీలించేను. కొన్ని క్లాసురూములలో ఫ్యాన్లు లేవు. ఉన్నా పనిచేయడం లేదు. బ్లాక్‌బోర్డ్‌లు అధ్వాన్నంగా ఉన్నాయి. దాదాపు ముప్ఫయివేలు పెడితే అవి బాగుపడుతాయి. కాలేజీకి సహాయం చేయడం ఇంకా కష్టం. బిల్డింగ్ కట్టించేంత డబ్బు ఇవ్వలేం. అంత డబ్బు పోగుచేయాలంటే వందల మంది రంగంలోకి దిగాలి. కొంతమంది ఏభైవేలో, అరవైవేలో ఇవ్వగా దానిమీద వచ్చే వడ్డీతో ఒక కుర్రాడికి బంగారుపతకం, ఒకటో రెండోవేలు ధనసహాయం అందిస్తారు. వార్షికోత్సవం నాడు ఫలానా కృష్ణారావుగారి జ్ఞాపకార్థం అంటూ వేదిక మీద నీ పేరు చదువుతారు. హు కేర్స్? ఎవడికి కావాలి? నీ ఉత్సాహం మీద నీళ్ళు చల్లేననుకోకు! ఆలోచించు! పైకం బాగా ఎక్కువగా ఉంటేగానీ ఏం చేయలేం" అంటూ కదిలివెళ్ళాడు.

కాలేజీకి సహాయం విషయంలో తన అశక్తత, హైస్కూల్‌లో తను చేసిన సహాయం గురించి ఉత్తమ్, వినయ్‌లకి మెయిల్ పంపేడు తను.

'ఇంకా అక్కడ ఏం చేస్తున్నావు?' అన్న.. తిరుగు మెయిల్ వచ్చేక సమాధానం స్ఫురించక కంప్యూటర్ ఆఫ్‌చేసి కళ్ళుమూసుకున్నాడు కృష్ణారావు.

★ ★ ★

పెనుతుపాను 'హుద్‌హుద్' ఇండియా తూర్పు ప్రాంతాన్ని తాకే అవకాశం ఉందన్న వార్తలో ఎంత నిజముందో! చూద్దామని టెలివిజన్ ఆన్ చేసేడు కృష్ణారావు. ఎప్పటిలాగే ప్రసారాలు జుగుప్సాకరంగా ఉన్నాయి. 'అసెంబ్లీలో ఎమ్మెల్యేలు అసభ్యకరమైన సినిమాలు చూడడమేమిటి?', 'కేజ్రీవాలుకు రెండోసారి చెంప దెబ్బ', 'యాదవ్ మొహం మీద నల్లసిరా' లాంటి వార్తలు అవి జరిగిన పది నిమిషాలలో ప్రపంచంలో ప్రజలందరికీ అందించాలని, ఎవరైనా మిస్ అవుతారేమోనని రోజులో గంటకి పది పన్నెండుసార్లు చొప్పున ప్రసారమవుతాయి.

'వేలెంటైన్ డే'నాడు పార్కులో తిరుగుతున్న ఒక జంటని తీసుకొచ్చి వాళ్లు చెప్పేది వినకుండా పెళ్ళిళ్లు చేయడం, తరువాత వాళ్ళిద్దరూ అన్నాచెల్లెళ్ళని తెలుసుకున్నా, క్షమాపణ కోరకపోవడం విచిత్రం, 'మా పనితీరుపై మీరు సరిగ్గా రాయకపోతే మిమ్మల్ని కప్పెట్టేస్తాం' లాంటి అరుపులు ప్రజలని రెచ్చగొట్టేలా ప్రసారమవడంతో తను టెలివిజన్ చూడడం తగ్గించేడు. ఒకగంట మార్చి, మార్చి అన్ని ఛానల్స్ పరికించేక తుపాను ఆంధ్రప్రదేశ్- ఒరిస్సా తీరాలని దాటుతుందని విన్నాక, టి.వి. ఆపేసి ఆలోచనలో పడ్డాడు కృష్ణారావు.

తను ఎక్కువగా వాంఛించేది ఫ్రీడమ్. వేలకొద్దీ అత్యాచారాలు, హత్యలు జరుగుతున్న వాటికి ప్రాముఖ్యం ఇచ్చి, నిరోధక చర్యలకి ప్రాధాన్యం ఇవ్వాలి. పార్కులో ఇద్దరు కలిసి తిరిగితే నేరం కానపుడు దానికి ఎందుకు అంత ప్రాముఖ్యం? సామాన్య మానవుడు జరుగుతున్న దాని గురించి వ్యాసం రాసి ప్రచురిస్తే గుండాలు వచ్చి దేహశుద్ధి చేస్తారు. ఫిర్యాదు చేస్తే 'చట్టం తన పని చేసుకుపోతుంది' అంటూ ప్రకటిస్తారు. ఇక్కడ ఫ్రీడమ్' ఉందా? అనుకుంటుంటే 'ఇంకా అక్కడ ఏం చేస్తున్నావు?' అన్న వినయ్ వాక్యం కృష్ణారావుని తికమక పెట్టింది. చల్లగాలి కోసం జోళ్లు వేసుకుని బైటికి వచ్చి కొండడిని పలకరిద్దామని నడక మొదలుపెట్టేడు.

"ఎండలో పడి వచ్చేవు" అంటూ కుర్చీ తెచ్చి వేసేడు కొండడు.

"మీ అబ్బాయి ఎక్కడ ఉన్నాడు? ఆ కేసు ఏమయింది? "

"విశాఖపట్నంలో ఉద్యోగం వచ్చేలా ఉందని తిరుగుతున్నాడు. కేసా? అది తీర్పు వచ్చేసరికి ఎన్ని సంవత్సరాలు గడుస్తాయో? వాయిదాలు.. వాయిదాలు"

"పెద్ద తుపాను రాబోతోంది"

"ఆc! అలాంటి తుపాన్లు ఎన్నో చూసేం. టీ కలుపుకు వస్తాను" అంటూ కృష్ణారావు అభ్యంతరాన్ని పట్టించుకోకుండా లోపలికి వెళ్ళేడు కొండడు.

కుర్చీలో కూర్చుని కొండడు కుండల కోసం కలిపిన మన్నువేపు చూసేడు కృష్ణారావు. ఒక నల్లని పురుగు మన్ను ఉందని



తోస్తోంది. ఆసక్తిగా అది ఏం చేస్తుందో చూద్దామని దాని మీద దృష్టి కేంద్రీకరించేడు కృష్ణారావు. ఆ పురుగు గోళీకాయ సైజున్న ఉండని దాదాపు పది అడుగులు తోసి, ఒకక్షణం ఆగి, ఆ ఉండని వెనక్కి బయలుదేరిన ప్ర దేశానికి తోసుకొచ్చింది. మళ్ళీ ఒక క్షణం ఆగి, దాన్ని ముందరకి తోస్తుంటే కొండడు టీ కప్పుని అందిస్తూ, కృష్ణారావు ఆసక్తికరంగా గమనిస్తున్న పురుగువేపు చూశాడు.

"అదా! అది పేడపురుగు. ముందుకి, వెనక్కి ఆ ఉండని రోజంతా తోస్తూనే ఉంటుంది. ఎందుకో తెలియదు" అన్నాడు.

"మన జీవితాల్లాగే" అన్నాడు కృష్ణారావు.

"మావాడు ఇక్కడికి వస్తే వాడికి రెండు మంచి మాటలు చెప్పు కిష్టయ్యా!" అన్నాడు కొండడు.

గ్లాసు కింద ఉంచి "అలాగే!" అంటూ కృష్ణారావు ఇంటివేపు నడక మొదలుపెట్టేడు. సరయిన జోళ్ళు వేసుకోకుండా రాళ్ళలా ఉన్న రోడ్డు మీద నడవడంతో మొకాళ్ల దగ్గర నొప్పి తీవ్రతరమైంది కాళ్ళు నిమురుకుంటూ, ఉస్సురంటూ కుర్చీలో సాగిలపడ్డాడు. దూరంగా కొండడి ఇల్లు, అస్పష్టంగా కదులుతున్న అతని చేతులు కనిపించేయి. జీవితకాల కష్టంలో కొండడు ఏమిటి సాధించేడు? ఆ ఫక్కీలో ఆలోచిస్తే తన జీవితంలో ప్రత్యేకత ఏమిటి? ఆ కుమ్మరి పురుగు ఆరాటం లాగే తమ జీవితాలు నిరర్థకంగా గడిచేయా? అన్న అనుమానం రాగానే కృష్ణారావు శరీరం బిగుసుకుంది. ఏ అతి తక్కువమందో తప్ప ప్రత్యేకత లేకుండానే చాలా జీవితాలు ముగిసిపోతాయి. ప్రత్యేకత లేని జీవితాలు నిరర్థకరమా? నో! మనం వదిలి వెళ్ళిన సంతతి, క్రమశిక్షణ వలన భావితరంలో ప్రత్యేకత ఉన్న వ్యక్తులు తయారవుతారేమో? ఎవరు ఊహించగలరు? మనం చేయగలిగినది వెలితిలేని సంపూర్ణత కోసం ప్రయత్నించడమే. అదేగా తన అన్వేషణ. కవితని అడిగితే ఏమంటుందో!! అనుకుంటూ లోపలికి చేరి కంప్యూటర్ తెరిచేడు కృష్ణారావు.

★ ★ ★

**కాలిఫోర్నియా:**

"ఇంకా మమ్మీకి, డేడీకి చెప్పలేదు తాతయ్యా! ఐ యామ్ గే! స్వలింగ సంపర్కుడిని" అన్నాడు అనంత్, కాలేజీ నుంచి తిరిగివచ్చిన మర్నాడు.

రామారావు నోటంబట మాట రాలేదు. ఎలా స్పందించాలో తెలియక మౌనం వహించేడు.

"సాయంకాలం నువ్వు నడకకి వెళ్ళేటప్పుడు నేనూ వస్తాను" అంటూ తల్లితండ్రుల దగ్గరికి వెళ్ళడానికి లేచేడు అనంత్.

కుర్చీకి అంటుకుపోయిన రామారావు, సోఫాలో ఒక మూల ముడుచుకుపోయిన వైదేహిలకి ఐదు నిమిషాలలో ఉష ఏడ్పు, వినోద్ ఓదార్పు వినిపించింది. అనంత్ జాడలేదు.

పది నిమిషాలు ఆగి వినోద్‌తో మాటలాడబోతే "డోంట్ వర్రీ! నాన్నా సానుభూతి అనవసరం" అన్నాడు.

ఆ వాక్యానికి అర్థం తెలియక వెనక్కి వచ్చి సోఫాలో కూర్చున్నాడు రామారావు. యుద్ధం ముగిసేక జీవంలేని రుద్రభూమి రోదిస్తున్నట్లుగా, అందరూ క్షతగాత్రులయితే ఎవరు ఎవరికి సహాయపడాలి? అన్నట్లుంది ఇంటిలో వాతావరణం.

సాయంకాలం నాలుగు గంటలకి నడకకి బయలుదేరుతుంటే, అనంత్ వెనకనే రావడం చూసి రామారావు కాళ్ళు తడబడ్డాయి.

"తాతయ్యా! నీకు ఈవేళ నేను స్టార్‌బక్స్ కాఫీ ఇప్పిస్తాను" అంటూ భుజానికి భుజం రాస్తూ రామారావు వేపు చూసేడు.

అనంత్ భుజం తగులుతుంటే ఇబ్బందిగా ఉంది రామారావుకి.

"ఎలా ఉన్నావు అనంత్? "

"నేను బాగానే ఉన్నాను. నా తలమీద నుంచి పెద్ద బరువు తీసి పారేసినట్లుంది"

"నాకేమీ బోధపడడం లేదు. నేను షాక య్యాను! ఇంకా ఆ షాక్‌లోనే ఉన్నాను. ఇలాంటి సన్నివేశం నాకు ఊహించలేనంత దూరంలో ఉంది. దాని గురించి వినడమే కానీ దగ్గరగా రక్తసంబంధం ఉన్న వ్యక్తి తను 'గే' అని చెప్పడం చాలా ఘోరం. మీ అమ్మానాన్నలని చూసేవా? ఎంత ఢీలాప డిపోయేరో!" అన్నాడు రామారావు.

"తాతయ్యా! నీ మాటల్లో స్పష్టతలేదు. నేనేమీ హత్య, అత్యాచారం చేయలేదు. ఏదీ దొంగిలించలేదు. నేను పాపం చేసి నట్లు మీరందరూ బాధపడడం, కుమిలిపో వడం ఏమీ బాగోలేదు. అమెరికాలో ఉన్న సుమారు పదిహేను మిలియన్లలో నేనొక డినని ప్రకటించేను. నాలా కాకుండా గోప్యంగా ఇంకా చాలామంది ఉన్నారు. నేను ఎన్నుకున్న జీవనసరళి, మీరు ఊహించిన దానికి విరుద్ధంగా ఉండడం మిమ్మల్ని కలవర పరుస్తోంది, ముఖ్యంగా మా అమ్మానాన్నలని. నా ఈ ధోరణి తల వంపులు తెస్తుందని మీరు భావిస్తే, నేను దూరంగా యూనివర్సిటీకి మారిపోతాను. నువ్వు ఇండియాలో ఉంటే ఆరునెలల పాటు నీ దగ్గర ఉండి తెలుగు నేర్చుకుం దామనుకున్నాను. నీ ధోరణి చూస్తుంటే నన్ను నువ్వు వెలివేసినట్లుంది" అన్నాడు అనంత్, విచారపు జీరతో.

"నీ ఈ ప్రకటన మమ్మల్నందరినీ కు దిపేసింది. చాలామందికి ఈ దారికొత్తది. నాకు అవగాహనలేనిది. 'రేపు నువ్వు ఎలా ఉంటావో' అన్న దానికి సమాధానం దొర కక మీ అమ్మా, నాన్న తల్లకిందులవుతు న్నారు. నిజం చెప్పాలి.. నిన్ను నేను సమ ర్థించను. నే పెరిగిన జీవితంలో ఇలాంటి వి ఎరుగం. కానీ నిన్ను అర్థం చేసుకోగ లను. నేను ఇండియాలో ఉంటే నువ్వు ఇండియా రా! ఈవేళ 'కేపుచీనో' తాగు తాను, డబ్బులు నీవిగా!" అంటూ ప్రేమగా అనంత్ భుజం తట్టేడు రామారావు.

★ ★ ★

**శాన్‌ఫ్రెన్సిస్‌కో:**

శాన్‌ఫ్రెన్సిస్‌కో అంతర్జాతీయ విమానాశ్ర యంలో నిరీక్షిస్తున్న కృష్ణారావు దృష్టి విమాన ఆగమనాల గురించి తెలియచెప్పే వీడియో స్క్రీన్ మీద నిలిచింది.

'సింగపూర్ నుంచి రావలసిన విమానం ఒక గంట ఆలస్యంగా రాబోతోంది' అని చదవగానే 'ఛ!' అనుకున్నాడు. నిర్ణీత సమ యానికి ముందరే విమానాశ్రయం చేరుకు న్నాడు తను. 'రెండు గంటల నిరీక్షణ ఉంది' అనుకుంటూ రెండడుగులేసి స్టార్ బక్స్ కాఫీ దుకాణంలోనికి ప్రవేశించేడు. 'బ్రేండ్ దుకాణాలు అన్నీ ఒకేరకంగా ఉంచుతారు' అన్నదానికి నిదర్శనంగానే ఉంది ఈ స్టార్‌బక్స్ దుకాణం అను కుంటూ క్యూలో నిలబడి ఇటూ అటూ చూడసాగాడు కృష్ణారావు.

ఐదుగురు పనివాళ్లున్న ఆ దుకాణంలో ఇద్దరు 'ఈవేళ మీరు ఏం తీసుకుంటారు? ', 'నేను మీకు ఏ విధంగా సహాయపడగ లను? ', 'మీ ఆర్డర్ తీసుకోగలనా? ' లాంటి పదాలతో అతిసౌమ్యంగా ప్రశ్నిస్తూ, ఖాతా దారు ఏం చెబుతాడా? అని చెవుల్ని రిక్కించి, పెదిమల కదలికలని గమనిస్తు న్నారు. అతివైవిధ్యం ఉన్న ఖాతాదార్ల గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటున్నా రనిపించింది. వద్దనుకున్నా ఇండియాలో సామాన్య హోటళ్ళలో నెలకొన్న వాతావ రణం జ్ఞాపకానికి వచ్చింది.

'మీరేమీ మెనూకార్డ్ చూడకండి. ఏం లభ్యమౌతాయో వెయిటరే చెబుతాడు' అంది కవిత. తను పట్టించుకోకుండా 'పూరీకూర' అన్నాడు. రెండు నిమిషాల త రువాత వెయిటర్ వచ్చి 'సారీ! పూరీ కావా లంటే అరగంట ఆగాలి' అన్నాడు. 'నే

చెప్పలేదా?' అన్నట్లు నవ్వింది కవిత.

"వాటీస్ యువర్ ఛాయిస్? మీకు ఏం కావాలి?" అడిగేడు కౌంటర్‌వ్యక్తి.

తెప్పరిల్లి "ఒక బటర్ క్రోసాంట్, ఒక బ్లూ బెర్రీ మఫిన్, ఒక టాల్ కాఫీ"

"క్రోసాంట్, మఫిన్‌లని వేడి చేయమంటారా?"

"వద్దు!"

"పదకొండు డాలర్ల ఎనభైసెంట్లు"

"థాంక్స్!" అంటూ ఇరవై డాలర్ల బిల్ అందిచ్చి తిరిగిచ్చిన చిల్లర అందుకున్నాడు. ఒక నిమిషంలో తను కొనుక్కున్న పదార్థాలతో, ఓ టేబిల్ మీద సర్దుకున్నాడు.

'ఆ కాఫీ తయారుచేసి ఐదు నిమిషాల పైనే అయింది. అది ఇవ్వకూడదు. మహా అయితే ఒక నిమిషం పడుతుంది. సారీ! ప్లీజ్ వెయిట్!' అన్న అంగడిలో పనిచేసే వ్యక్తి మాట విని నమ్రత, పనిలో క్రమశిక్షణ వీళ్ళకి ఎలా వచ్చింది? కేవలం ఎక్కువ జీతాలు ఇవ్వడం వలనేనా? అది కాదేమో! అనుకుంటుంటే 'కేపుచీనో' అంటూ అరుపు వినిపించింది. 'పైరేట్స్ ఆఫ్ కరిబియన్' సినిమాలో హీరో జానీ డెప్ వేసుకున్న వ్యక్తిలా, రైలు ఇంజన్‌లో కనిపించాడు. పనిచేసే కళాసీలా బట్టలు ధరించిన వ్యక్తి ఏం చదువుకున్నాడబ్బా? అన్న అనుమానం వచ్చింది. సగటు అమెరికన్‌కి ఇలాంటి ప్రశ్న ఉదయించదు. తనకి ఈ ప్రశ్న ఉదయించడం మూడేళ్ళు ఇండియాలో తిరగడం వలనా? ఏమో? అనుకుంటూ కాఫీ తాగడం పూర్తిచేసి, చెత్తని డబ్బాలో గిరాటేస్తూ వాచీ చూసేడు. 'ఇంకో గంట నిరీక్షణ' అనుకుంటూ పేపర్ కొని 'సుడోకు' పజిల్ చేయడం మొదలుపెట్టేడు.

'మీ మెదడుకి మేత ఏమిటి?' అని కవిత అడగడం జ్ఞాపకానికి వచ్చింది.

'సుడోకు చేస్తాను'

'అబ్బో!'

'అబ్బోలేదు, గిబ్బోలేదు. కొంత లెవెల్ వరకు కష్టం కాదు'

రెండు నెలల క్రితం తను ఇండియా నుంచి అమెరికా ప్రయాణం నిశ్చయించుకోబోతున్న సమయంలో కవిత నుండి ఇ-మెయిల్ వచ్చింది.

'హుద్‌హుద్ అల్లకల్లోలం చేసి వెళ్ళేక, తుపానులో క్షతగాత్రులయిన వాళ్ళని మీరు హాస్పిటల్‌కి తరలించేరని, ఇతర సహాయం అందచేసేరని తెలిసింది. గ్రేట్! విజయనగరంలో ఉంటే మాకూ సహాయం అందిచ్చేవారేమో!' అని ఉంది అందులో.

'సమస్యలు, పరిధులతో నిండి ఉన్న వాతావరణంలో చిక్కడిపోయి మార్పు లేకుండా ఒకేగాడిలో తిరుగుతున్నారు మీరు. చిన్నప్పుడు జెమినీ సర్కస్ చూసేను. మీరూ చూసే ఉంటారు. ఉయ్యాల ఊగడం చూసేరా? ఒకడు ఉయ్యాల మీద ఊగి గాలిలో ఎగిరి ఇంకో ఉయ్యాలని అందుకుంటాడు. జనం చప్పట్లు కొడతారు. అలా రెండుసార్లు చేసేక ఫీట్ మారుతుంది. ఈమారు ఉయ్యాల మీద నుంచి ఎగిరినప్పుడు, ఇంకో ఉయ్యాల మీదున్న వ్యక్తి, మొదట వ్యక్తిని అందుకుంటాడు. ప్రేక్షకులు ఇంకా ఎక్కువగా చప్పట్లు కొడతారు.

నేను ఇంతకన్నా ఎక్కువ రాయనవసరంలేదు. అమెరికా వచ్చి 'మరో ప్రపంచం' ఎలా ఉందో చూడండి. నా సహాయం మీకు పుష్కలంగా అందిస్తాను.

తనవారు లేని చోటును,
జనమించుక లేనిచోట,
జగడము చోటన్
అనుమానమైన చోటును,
మనుజున కట నిలువందగదు
మహిలో సుమతీ'

అంటూ జవాబు పంపేడు. ఎదురుగా వీడియో స్క్రీన్ మీద సింగపూర్ నుంచి వచ్చిన విమానం వాలి పదిహేను నిమిషా

# మనిషి సగటున..



మానవ శరీరానికి సంబంధించిన విశేషాలు..

★ రెండులక్షల సంవత్సరాలతో పోలిస్తే, గత ఏభైఏళ్ళలోనే మనిషి సగటు ఆయుర్దాయం చాలా పెరిగింది.

★ భూమి మీద ప్రజలందరికంటే, మనిషి చర్మంపై ఎక్కువ జీవరాశులు జీవిస్తున్నాయి!

★ మనిషి జీవిత కాలంలో సగటున రెండున్నర లక్షల సార్లు ఆవులిస్తాడు.



★ మనిషి సగటు జీవితంలో అతని శరీరం మీద 9 సార్లు పాతదిపోయి కొత్త చర్మం వస్తుంది.

★ మనిషి జీవితకాలంలో సగటు 25వేల క్వార్టర్స్ లాలా జలాల్ని ఉత్పత్తి చేస్తాడు. ఇది రెండు స్విమ్మింగ్‌పూల్స్‌ని నింపేంత.

★ మనిషి జీవితకాలంలో సగటున మూడు నెలలు టాయ్‌లెట్‌లో గడుపుతాడు.

★ మనిషి జీవితకాలంలో సగటున 183,755,600 అడుగులు వేస్తాడు.

★ మగవాడు తన జీవితకాలంలో ఒక సంవత్సరంపాటు ఆడవాళ్ళని చూస్తూ గడుపుతాడు.

★ మనిషి సగటున తన జీవితకాలంలో ఐదునెలలు ఫోన్‌లో మాట్లాడుతూ గడుపుతాడు. (సెల్‌ఫోన్ వచ్చాక ఇది పెరిగింది కాని ఇంకా లెక్క పెట్టలేదు)

★ మిత్రులున్నవారు, లేనివాళ్ళ కంటే 3 సంవత్సరాల 7 నెలలు అధికంగా జీవిస్తారు.

★ రోజుకు మూడు గంటలు కదలకుండా కూ ర్చుంటే ఆయుష్షులోంచి రెండు సంవత్సరాల ఆయుర్దాయం తగ్గుతుంది.

★ జాగింగ్ చేసే వాళ్ళు సగటున ఆరునెలలు ఎక్కువ జీవిస్తారు.

★ రోజుకు ఏడు గంటలకంటే తక్కువ కాలం నిద్రించే వారి ఆయుర్దాయం తగ్గే అవకాశం ఉంది.

లైందని చూసి 'ఆగమనం' గేటు దగ్గరకి వచ్చి నిలుచున్నాడు కృష్ణారావు.

"హల్లో!" అంటూ చాచిన కవిత చేయితో కరచాలనం చేసి, ఆమె తోసుకు వస్తున్న సూట్‌కేస్ అందుకుని "వెల్‌కమ్ టు అమెరికా" అన్నాడు కృష్ణారావు.

"థాంక్యూ!" నవ్వింది కవిత.

★ ★ ★

"వినోద్, ఉష ఇబ్బందులలో ఉండగా మనం ఇండియా రావడం బాగోలేదండీ! వాడు ఎంత బాధపడ్డాడో!" అంది వైదేహి.

"అనంత్ విషయం పెద్ద భూకంపం లాంటిదే! వినోద్, ఉషలకి వచ్చిన ఆర్థిక ఇబ్బందులు మనం చూసేం. మనం ఇండియా తిరిగి రావడం వలన ఆర్థికంగా వాడికి మేలే కానీ కీడుకాదు. గుదిబండ లాంటి మనిద్దరికీ ఇన్సూరెన్స్ ఖర్చులు, రాబోయే రోజుల్లో మన ఆరోగ్యం పాడయితే వచ్చిపడే ఖర్చులు చాలా భారం అవుతాయి. అయినా మనం పూర్తిగా తగ్గిస్తున్నాం కదా! వినోద్ దగ్గరికి వెళ్ళి ఏదో మాటలాడబోతే వాడు దానికి అవకాశం ఇవ్వలేదు. భార్యాభర్తలే కూడబలుకుకున్నారు. మనం ఉన్నా ఏం చేయగలిగేం? మన గదిలో మనం, వాళ్ళ గదిలో వాళ్ళు. నూనె, నీళ్ళలా కలవకుండా ఉండి

పోయేం. మనం ఇండియాకి రావడం వలన వినోద్‌కి కోపంవచ్చినా అది కేవలం తాత్కాలికం. మెల్లిగా మనం తీసుకున్న నిర్ణయాన్ని సమర్థిస్తాడు. ఈ వేళ మొబైల్ కనెక్షన్ వచ్చింది. రాత్రి వాడికి ఫోన్ చేస్తాను" అన్నాడు రామారావు.

"ఫోన్ ఎత్తుతాడో? లేదో? అనంత్‌తో వాళ్ళ తీరెలా ఉందో? తల్లితండ్రుల అననుకూల ప్రవర్తన అనంత్‌లో ఎలాంటి ఆలోచనల్ని రేకెత్తిస్తోందో? అనంత్ గురించి తెలిస్తే బైటవాళ్ళ ప్రవర్తన ఎలా ఉంటుందో? అసలు వాడలా అవడానికి కారణమేమిటి? పాలుపోవడం లేదు"

"నీకున్న అనుమానాలు, భయాలు నాకూ ఉన్నాయి. ఈ విషయం మీద బాగా పరిశోధన జరిగింది, జరుగుతోంది. శరీరంలో ఒక రకమైన హార్మోన్ లోపం వలన వాళ్లు ఈ జీవనశైలిని ఎన్నుకుంటున్నారన్నారు. మరికొందరు ఏకీభవించ లేదు. అది వాగ్వాదమే. అయినప్పటికీ ప్రభుత్వం వాళ్ళని వివక్షగా చూడకుండా చట్టాలని రూపొందించి అమలు పరుస్తోంది. ఇండియాలో ఎంతమంది స్వలింగ సంపర్కులున్నారో తెలియదు. స్వలింగసంపర్కుడని తెలిసిన వ్యక్తి ఒంటరిగా ఇండియాలో నడిచి వెళ్తుంటే మన ఛాందసులు ఎలా ప్రవర్తిస్తారో! మన నమ్మకాలకి వ్యతిరేకంగా ఎదుట వ్యక్తి ప్రవర్తిస్తే దాన్ని భరించే ఓర్పు ఉందా మనకి? అనంత్ ఎలాంటి సంక్షోభంలో ఉన్నాడో" అన్నాడు రామారావు.

వైదేహి ఏమీ మాటలాడలేదు.

"మీరు ఇండియాలో ఉంటే తెలుగు నేర్చుకోవడానికి వస్తానన్నాడు. కానీ ఇక్కడా వాతావరణం ఏమీ బాగోలేదు"

"ఏమండీ! పిల్లల్ని కాదనుకుని వచ్చేసేం. మనం ఇక్కడ ఆనందంగా ఉండగలమా?" అనడిగింది వైదేహి.

"ఇండియా వెళ్ళిపోదామంటూ పదేపదే నన్ను పొడిచేవు. ఇక్కడికి వచ్చేక వాళ్ళని వదిలి ఉండగలమా? అన్న ప్రశ్నని లేవనెత్తుతున్నావు. కనీస వసతులు, సుఖాలు లభ్యమయేక ఆనందం కోసం అన్వేషిస్తాం. సంపూర్ణ ఆనందం బైట లభ్యమయేదికాదు. అది మన మెదడు, ఆలోచనా విధానంలో నిక్షిప్తమై ఉంటుంది" అన్నాడు రామారావు.

"ఏమండీ! మీ అన్నయ్య ఇల్లు బాగానే కట్టించేరండి. అయినా నాకు తెలియక అడుగుతాను, ఊరికి దూరంగా ఇంత డబ్బు పెట్టి కట్టడమేమిటి నా బొంద! దగ్గరగా దుకాణాలు ఏమీలేవు. ఈ ఇంటిని మనకి అమ్మేసేరా? అద్దెకి ఇచ్చేరా? లేక ఊరికే ఉండమన్నారా? ఆయనకేం మస్తుగా డబ్బుంది, ఏమైనా చేయగలరు. అమ్మితే, కాస్త రేటు తగ్గించమని అడగండి"

"వైదేహీ!"

"సర్లెండి! మీ అన్నయ్యని ఏమైనా అంటే ఎంతో ఇదైపోతారు. మీ బాగు కోసమే హెచ్చరిస్తున్నాను. ఆయన ఇల్లు ఎవరికో అమ్మేస్తే మనం 'ఇల్లో' అంటూ రోడ్డున పడతాం. ఆయనేమీ మీకు చవకగా అమ్మడులెండి! నాకు తెలుసు" అంది వైదేహి.

"ఆరేడేళ్ళ క్రితం ఈ పొలాన్ని మనం చెప్పిన ధరకే కొనుక్కున్నాడు మా అన్నయ్య. అధునాతనంగా అన్ని హంగులూ అమర్చిన ఇల్లు వాడుకొమ్మని నీకు ఇస్తే ఆయనకి ఉదారత్వం లేదని కామెంట్ చేస్తున్నావు. నిన్న తట్టవేసుకుని ఆకు కూరలు అమ్మకానికి తీసుకువచ్చిన అతనితో 'వెధవ పాలకూర కట్టలు పదిరూపాయలకి నాలుగా? ఆరుకట్టలు ఇయ్యి! పాలకూర అంత ఖరీదు చెబుతున్నావేమిటి? ' అన్నావు. 'అమ్మ బాబోయ్! వైదేహి వస్తోంది!' అంటూ నిన్ను చూసి ఉదారత్వం ఉరకలేస్తూ పారిపోతుంది. ఆపు నీ సొద" అంటూ వరండాలోనికి కదిలి వెళ్ళేడు రామారావు. ©

పెద్దకథ

# గాజు నీసా

**నే**నా పుస్తకాన్ని చేతుల్లోకి తీసుకొని చూస్తున్నాను. పుస్తకం కవరు, లోపల అక్షరాల కూర్పు అన్నీ ఆసక్తికరంగా ఉన్నాయి. రచయిత అభిరుచి ప్రతిఫలిస్తున్నాయి. పుస్తకం తెరిచి అక్కడక్కడా చదివాను. ప్రతి అక్షరంలోనూ రచయిత ముద్ర కనిపిస్తోంది. రచయిత తరచూ 'దాన్ని గురించిన అనుమానం లేదు', 'నిస్సందేహంగా ఇది నిజం', 'నేను దీన్ని నిరూపించడానికి సిద్ధంగా ఉన్నాను' వంటి మాటలు వాడాడు.

పుస్తకం ముందుమాటలోని కొన్ని వాక్యాలు నన్నాకర్షించాయి. 'మొదటి అమెరికన్ నీగ్రోలు మతం విషయంలో చాలా నియమనిష్ఠలతో ఉండేవారు. చర్చికి వెళ్ళి ప్రార్థనలు చెయ్యడం, కీర్తనలు పాడడం క్రమం తప్పకుండా చేసేవారు. ఆఫ్రికాలో తమ పూర్వీకులు పూజించిన ఆదిమతెగల దేవుళ్ళను పూర్తిగా వదిలి, మనస్ఫూర్తిగా క్రైస్తవ మతాన్ని ఆచరించారు'

నా వేళ్ళు పేజీల్ని అటూ ఇటూ తిప్పాయి. ఒక పేరాను చదువుతూ నాకు తెలియకుండానే లేచి నిలబడ్డాను. అదేమిటంటే, 'కానీ నేను ఈ దీవిని నా పరిశోధనలో భాగంగా సందర్శించినప్పుడు తీవ్రమైన జ్వరం, నిద్రలేమి, సంధి లక్షణాలతో బాధపడడం వల్ల నా పరిశోధనకు కొంత అంతరాయం కలిగింది. అలా ఎందుకు జరిగిందో నిరూపించడానికి నావద్ద తగినంత సాక్ష్యం...'

ఆ! అసలు వాస్తవం పై పేరాలోనే ఉంది. ఒక పరిశోధనాత్మక రచయితను అని చెప్పుకునే బార్క్‌డేల్ తన పరిధిలోనే ఆలోచిస్తూ తన పుస్తకంలో జరిగిన వాస్తవాలకు విరుద్ధమైన సాక్ష్యాలను చూపే ప్రయత్నం చేస్తున్నాడు. ఆ ఆగష్టు నెలలో నా స్వీయ అనుభవాలకు, గొప్ప రచయితగా బార్క్‌డేల్ ప్రతిపాదిస్తున్న సిద్ధాంతాలకు చాలా వైరుధ్యం ఉంది.

ఆ పుస్తకాన్ని పట్టుకొని శూన్యంలోకి చూస్తుంటే, నా జ్ఞాపకాలు ఆ ఆగష్టు నెలలోని ఓనాటి మధ్యాహ్నం వైపు పరుగులు తీశాయి.

ఈ ఎడివాండర్ దీవిని, సముద్రం ఒడ్డున ఉన్న టౌన్‌లో కలిపే వాగులో నుంచి పెద్ద స్టీమరు వచ్చి దీవి సమీపంలో ఆగింది. ఇద్దరు నీగ్రోలు స్టీమరు నుంచి నేలకు ఒక పెద్ద చెక్కను అమర్చారు. దానిమీద నుండి ఎడివాండర్ దీవిలో పనిచేసే నీగ్రో కూలీలు టౌన్ నుండి తెచ్చుకున్న సరుకులతో దిగుతున్నారు. బట్టల మూటలు, సరుకుల బుట్టలు, నెల సంపాదన సరుకుల రూపంలోకి మారింది. డజన్లకొద్దీ ఉన్న నీగ్రోల వెనక ఒకే ఒక తెల్లజాతి ప్రయాణికుడున్నాడు.

నా అతిథిని నేను తేలిగ్గానే గుర్తుపట్టాను. నా మిత్రుడు స్పెన్సర్ తన ఉత్తరంలో రాసిన ఇతని ముఖంలో ఒక పట్టుదల కనిపిస్తోంది. దళసరి అద్దాల వెనుక ఉన్న అతని నీలికళ్ళు అప్పుడే పరిసరాలను నిశితంగా పరిశీలిస్తున్నాయి.

ఆ కళ్ళు ఆకాశం నుండి భూమి మీదకు వచ్చి చుట్టు పక్కల అడవిని, పైన్‌చెట్ల గుంపులను మార్చి మార్చి చూస్తున్నాయి. నేను నా జేబులోనుండి స్పెన్సర్ రాసిన ఉత్తరాన్ని తీసి ఇంకోసారి చదివాను. 'అతను ఒక మ్యూజియం.. అన్నిటినీ సేకరించే అలవాటున్న వ్యక్తి, వాటిలో కొన్నింటిని అమ్ముతాడు, కొన్నింటిని తన వద్దే దాచుకుంటాడు. అతని ముఖ్యమైన ఆసక్తి అమెరికా గాజువస్తువుల సేకరణ. వాటి సేకరణలో అమెరికా దేశం అంతటిలో పేరొందిన వ్యక్తి'

అతను పడవ నుండి, నేను నేలనుండి ఇద్దరం ఒకర్నొకరు చూసుకున్నాం. చివరి నీగ్రో పడవ నుండి దిగిపోయిన తర్వాత అతను తన సామాన్లను పడవ నుండి దింపుతున్నాడు.

నేను బల్లచెక్క వైపు నడిచాను. పరస్పర పరిచయాలయ్యాయి.

"మీరు మిస్టర్ కర్టనీ కదూ!" అతను అడిగాడు.

"మీరు మిస్టర్ బార్క్‌డేల్? " నేను అడిగాను.

ఈ దీవిలో నేను మేనేజర్‌గా ఉన్న తెల్లవాళ్ళ క్లబ్బులో, అతనికి బస ఏర్పాటయ్యింది. ఇద్దరం నా గుర్రపు బగ్గీలో బయలుదేరాం. కొంతసేపయిన తర్వాత అతను మాట్లాడాడు.

"నేను ఈ దీవిని సందర్శించడానికి అవకాశం కల్పించిన మిత్రుడు స్పెన్సర్ చాలా మంచి పని చేశాడు. నేను నీగ్రో అనాగరికుల మీద పరిశోధన చేస్తున్నాను. అందుకు ఈ దీవి చాలా అనువుగా అనిపిస్తోంది" ఉపన్యాస ధోరణిలో అన్నాడు.

'నీగ్రో అనాగరికులు' అతను ఆ మాట అన్న తీరు నన్ను ఆశ్చర్యానికి గురిచేసింది. ఆ పలికిన తీరులో 'నీగ్రో' అనే శబ్దంలో మానవ అంశ ఉన్నట్టనిపించలేదు. వర్షాకాలంలో అడవిలో బాతుల



వేటకోసం అప్పుడప్పుడు వచ్చిపోయే తెల్ల జాతీయులకంటే దీవిలో వందకు పైగా ఉన్న నీగ్రో కూలీలే ఇక్కడ నా సహచరులు, నా తోడు, నీడ.

"ఇక్కడ చాలామంది నీగ్రో కూలీలున్నారు. దక్షిణ కరోలినాలోని ఈ దీవిలో వరి పొలాల్లో పనిచేయడానికి వీరి పూర్వీకులు ఇక్కడకు బానిసలుగా వచ్చారు. నాగరిక ప్రపంచానికి దూరంగా ఉండడం వల్ల వారు అనాగరికులుగానే మిగిలిపోయారనుకుంటాను" నేను అన్నాను.

"నేను వెంటనే నా పరిశోధన ప్రారంభిస్తాను. ఇక నెలరోజుల్లో సమాచార సేకరణ పూర్తి చేస్తాను" బార్క్‌డేల్ అన్నాడు.

ఇరువైపులా పైన్ చెట్లున్న ఇసుకదారిలో బగ్గీ నెమ్మదిగా వెళుతోంది. మేం కొంచెం ఎగువకు చేరుకున్నాం. దిగువన అడవి పరచుకుని ఉంది.

సాయంకాలమవుతోంది, పొడుగ్గా, నిటారుగా వరుసల్లో నిలబడి ఉన్న పైన్ చెట్లు ఆకాశానికి, సముద్రానికి సరిహద్దు ఏర్పరుస్తున్నట్టున్నాయి.

నేను బార్క్‌డేల్‌కు ఆ అందమైన ప్రకృతి దృశ్యాన్ని చూపించే ప్రయత్నం చేశాను.

"అద్భుతంగా ఉంది కదూ!" అన్నాను.



అతను కళ్ళెత్తి అదే పరిశీలనా దృక్పథంతో సముద్రం నుండి చెట్లవైపు మళ్ళీ వెనక్కు దృష్టి సారించి తిరిగి చూశాడు.

హఠాత్తుగా అతను నా చెయ్యిపట్టుకుని ఇంకో చేత్తో దూరంగా చూపిస్తూ 'అదేమిటి? ' అని అడుగుతూనే 'బగ్గీ ఆపండి, నేనక్కడికి వెళ్లాలి' నన్ను ఆజ్ఞాపిస్తున్నట్లు అన్నాడు.

"అది మీకు అంత ఆసక్తి కలిగించదు. అది నీగ్రోల సమాధుల ప్రదేశం. రేపు మిమ్మల్ని నీగ్రోల గూడెం తీసుకెళ్తాను. అక్కడమీకు కావలసినంత సమాచారం దొరుకుతుంది" అన్నాను.

అప్పటికే అతను బగ్గీ దిగిపోయి పైన్ చెట్ల నీడలో ఉన్న నీగ్రోల సమాధుల వైపు నడవసాగాడు. అలుముకుంటున్న సంజె చీకట్లలో ఆ సమాధులు దీనంగా కనిపిస్తున్నాయి. అన్ని నీగ్రో సమాధుల్లాగే అవి పాతిపెట్టిన వారిమీద ఏర్పరచిన మట్టి దిబ్బలు మాత్రమే. ఆ దిబ్బల మీద రకరకాల వస్తువులు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. సగం వాడిన మందు సీసాలు, చిన్నచిన్న కత్తులు, చెంచాలు, మరణించిన వ్యక్తి వాడిన ఇతర వస్తువులు.. బార్క్‌డేల్ ఉత్సాహంగా ఆ సమాధి దిబ్బల మధ్య తిరుగుతున్నాడు. పడి ఉన్న పింగాణి, గాజు వస్తువులను పరిశీలిస్తున్నాడు. స్పెన్సర్ తన ఉత్తరంలో రాసిన బార్క్‌డేల్ హాబీ గుర్తుకొచ్చి నేను కంగారుగా బండిమీద నుండి ఒక్క గెంతులో కిందకి దిగి అతన్ని చేరుకున్నాను.

"చూడండి, నేనైతే అక్కడున్న ఏ వస్తువునూ ముట్టుకోను" అన్నాను. కానీ అతను నా మాటలు వినిపించుకున్నట్టు లేదు. నేను అతనికి చేరువగా వెళ్ళేటప్పటికే అతను ఏదో నల్లని ద్రవంతో సగం నిండి ఉన్న చిన్న గాజు సీసాను పరిశీలి

స్తున్నాడు. తన కోటుకు దాన్ని రుద్ది దాని కున్న మట్టిని శుభ్రం చేశాడు. ఆ మనిషి ఉత్సాహంతో ఊగిపోతున్నాడు. అతను ఆ సీసాను తన కళ్ల దగ్గర పెట్టుకొని పరిశీలించి నావైపు తిరిగి

"ఇదేమిటో మీకు తెలుసా?" నా జవాబుకోసం ఎదురుచూడకుండానే తనే చెప్పుకుపోతున్నాడు. "ఇది దక్షిణ కరోలినాలో ప్రారంభించిన మొదటి ఆస్పత్రులలో వాడిన మందుసీసా. ఇంతవరకు అమెరికాలో ఇది ఎక్కడా లభించలేదు. ఇక్కడ నాకు చాలా సమాచారం దొరుకుతుందనుకున్నాను. కానీ ఆశ్చర్యంగా ఇది ఇలా దొరకడం అద్భుతం!" అతను సంతోషంతో తబ్బిబ్బవుతున్నాడు. ఆ సీసా పట్టుకున్న అతని చెయ్యి ఉద్వేగంతో వణుకుతోంది. అతను జేబులో నుండి రుమాలు తీసి ఈ సీసాను సున్నితంగా అందులో చుట్టి, "పదండి, ఇక వెళ్దాం" అన్నాడు.

"లేదు తొందరపడకండి. మీరు ఆ సీసాను అలా తీసుకెళ్ళడానికి వీల్లేదు. ఇక్కడ అలా చెయ్యకూడదు. మనమేమీ అంత నీతిమంతులం కాదు. కాని కొన్ని సందర్భాల్లో.. అంటే మరణించిన వారి సమాధుల విషయంలో కొన్ని పద్ధతుల్ని పాటించడం" అతనికి నచ్చచెప్పే ప్రయత్నం చేశాను.

బార్క్‌డేల్ రుమాల్లో చుట్టిన సీసాను తన కోటులోపలి జేబులో పెట్టి, కోటుగుండీలన్నీ పెట్టేసుకొని నా మాటలను పట్టించుకోనన్న సంకేతాన్ని నాకిచ్చాడు.

"దీనికోసం నేను పదేళ్ళనుండి వెతుకుతున్నాను. దీనికి సంబంధించి ఎవరైనా అభ్యంతరం చెపితే వారికి ఎంత డబ్బయినా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నా. కానీ దీన్ని మాత్రం వదులుకోలేను. అయినా ఇది ఎవ్వరికీ ఉపయోగపడడం లేదు కదా! అర్థంలేని మూఢనమ్మకాలను పట్టించుకోను" కచ్చితంగా చెప్పాడు.

అతనిపై భౌతికంగా దాడి చేస్తే తప్ప ఆ సీసాను అతన్నుండి తీసుకోలేనని నాకర్థమయ్యింది. అతను ఆ సీసాను ఎందుకు ఇక్కడి నుండి తీసుకెళ్ళకూడదో అతనికి వివరిద్దామనుకున్నాను. కాని అతని చూపుల్లో ఎగతాళి కనిపించేసరికి నేను మిన్నకుండిపోయాను. నా వాదనలో సహేతుకత ఉండదు, నమ్మకం తప్ప, అతని దృష్టిలో అది మూఢనమ్మకం.

బయట పైన్ చెట్ల గుంపులనుండి మనుషుల నవ్వులు వినిపించాయి. నాకు భయం పట్టుకుంది బార్క్‌డేల్ చెయ్యిపట్టుకొని సమాధుల వెనకదారి నుండి బగ్గీ దగ్గరకు వచ్చాం.

చీకటి పడింది. గుర్రం ఇసుకలో నుండి బండిని లాగుతోంది. మా ముందు పని నుండి వస్తున్న నీగ్రోల గుంపు వస్తోంది. మళ్ళీ వాళ్ళ నవ్వులతో ప్రకృతి ప్రతిధ్వనించింది. ఆ నవ్వులతో నాలో ఏదో సిగ్గు చోటు చేసుకొంది. బండి దగ్గరకు రాగానే వాళ్ళు దారికి ఇరువైపులా విడిపోయి దారిచ్చారు. వారి భుజాల మీద పారలు, కొడవళ్ళు ఆ సంజె చీకటిలో మెరుస్తున్నాయి. మహిళలు తమ దుస్తులను కొంచెం తాకి తలవంచి, పురుషులు తమ టోపీల అంచులను చేత్తోతాకి నాకు వందనం చేశారు.

వారి గుల్లా భాష ఉచ్చారణలో నన్ను పలకరించారు.

"హౌడు బాస్"

"ఈబినీ (ఈవినింగ్) బాస్"

వారివెనక మెడల్లోని గంటలను మోగించుకుంటూ గుర్రప్పిల్లలు కూడ వస్తున్నాయి.

వారు అక్కడున్న పెద్దదిబ్బ ఎక్కి అటువైపున్న వారి గూడెం వైపుకు దిగి వెళ్ళిపోయారు. నిశ్శబ్దం.. వెంటనే అంతటా పరుచుకున్న గాఢమైన నిశ్శబ్దం.

"ఊ! మూర్ఖ జీవులు" బార్క్‌డేల్ అన్నాడు "వాళ్ళ అదృష్టం, భయంకర

అనాగరిక జీవనం నుండి వచ్చి మన నాగరికత నుండి ఎంతోకొంత నేర్చుకొని బాగుపడుతున్నారు" అన్నాడు.

"అనాగరికత!- ఏమిటి మీ ఉద్దేశ్యం? తెల్లవాళ్ళు రెడ్ ఇండియన్లకు మత్తు పదార్థాలిచ్చి వారిని దోచుకుంటున్న కాలంలో ఆఫ్రికాలో గొప్ప కళా సృష్టి జరిగింది తెలుసా? కాంగో కళ ప్రపంచ కళలకు తలమానికం" నేనన్నాను.

బార్క్‌డేల్ చిరునవ్వులోని వెక్కిరింతతో నేనింకేమీ మాట్లాడలేకపోయాను.

బార్క్‌డేల్ ఇక్కడ తన మొదటిరోజు గదిలో పుస్తకాలు సర్దుకోవడం, బల్లమీద కాగితాలు అమర్చుకొని తన పరిశోధనకు నోట్సు తయారు చేసుకోవడంలో గడిపాడు. అతని గదిపక్కనే నా గది, మధ్యలో ఒక తలుపుంది. అతని గది ముందు నుంచే నేను బయటకు వెళ్ళాలి. తర్వాతి రోజు అలా వెళుతూ అతని గదిలోకి చూశాను. అతను ఆ గాజుసీసాను బల్ల మీద ఉంచి కుర్చీలో కూర్చుని దాని వైపు తదేకంగా చూస్తున్నాడు. అనుకోకుండా నా వైపు తలెత్తి చూశాడు. అతని చూపుల్లో 'ఆ సీసాగురించిన వివాదం ముగిసింది' అన్న భావన కనిపించింది. కాని ఆ సీసాను చూస్తుంటే నాలో అలజడి! అతను నన్ను ఎలాగూ చూశాడు కదా, ఏదైనా మాట్లాడకపోతే బావుండదని నేను అతని గదిలోకి నడిచాను.

"నాక్కూడా నీగ్రోల గురించి తెలుసుకోవాలని ఉంది. ఏమైనా పుస్తకాలున్నాయా? " అని అడిగాను.

అతను ఒకపెద్ద పుస్తకం నా ముందుంచి, దానిపేరు గట్టిగా చదివాడు. 'ఆఫ్రికన్ మతము-మూఢనమ్మకాలు'

"ఈ దీవిలో ఉన్న నీగ్రోలు ఆఫ్రికాలోని గుల్లా తెగకు చెందినవారు. ఆ తెగలో దేవుడున్నాడు, వారిని సృష్టించడం వరకే ఆ దేవుడి పని. వారి జీవితాలు మాత్రం దుర్మార్గపు ఆత్మల చేతుల్లోనే ఉంటాయి. వారి శత్రువులు ఆ ఆత్మలను వారిమీద ప్రయోగించి వారిని నానా తిప్పలు పెడుతుంటారు. దీన్ని మతం అంటారా? అర్థంలేని భయాలతో జీవించే మూఢనమ్మకం తప్ప" బార్క్‌డేల్ అన్నాడు.

"పాత నమ్మకాలు, ఆచారాలు అంత పనికిమాలినవని నేననుకోవడం లేదు. తెలిసీ నేనతనితో ఒక అనవసర వాదన ప్రారంభించాను. ఈ గుల్లా నీగ్రోల గురించి నాకు చాలా విషయాలు తెలుసు. వారు 'ప్లాట్ఐ' ఉందని గాఢంగా నమ్ముతారు. మన క్లబ్బులో పనిచేసే నీగ్రో వంటమనిషి చేతిలో క్రైస్తవ ప్రార్థనా పుస్తకం లేకపోయినా కంగారుపడడుగాని, రాత్రి బయటకు వెళితే తలలో భాస్వరం ఉన్న అగ్గిపుల్లను తప్పకుండా గుచ్చుకొంటుంది. భాస్వరం 'ప్లాట్ఐ'కి విరుగుడని వాళ్ళ నమ్మకం"

"అసలు ఇంతకీ 'ప్లాట్ఐ' అంటే ఏమిటో మీరు నాకు సెలవివ్వలేదు" బార్క్‌డేల్ కళ్ళల్లో వ్యంగ్యంతో నన్నడిగాడు.

అతను నా మాటలను తమాషాగా తీసుకుంటున్నాడని అర్థమయ్యింది. "ప్లాట్ఐ- ఒక ఆత్మ! అది తను బంధించదలచుకొన్న వ్యక్తుల్ని అడవిలోకి తీసుకుపోయి, వాళ్ళు తమ బుద్ధిని కోల్పోయి పిచ్చివాళ్ళయ్యేలా చేసి తర్వాత ఒంటరిగా మృత్యువుకు గురయ్యేలా చేస్తుంది"

అతనొక విషపునవ్వు నవ్వాడు

అమెరికా మూలం :
**డ్యుబోస్ హేవార్డ్**

అనువాదం :
**యార్లగడ్డ నిర్మల**

"ఏమి చిత్రమైన చెత్త! మీరిదంతా నమ్ముతారనుకుంటా"

"అబ్బే, నేను నమ్మను" అన్నాను, కాని నా మాట నాకే అబద్ధంలా అనిపించింది.

"సరే సరే. నా పరిశోధన నీగ్రో తెగల మూఢనమ్మకాల మీద కాదు. మతంమీద అయినా మీరు చెప్పింది ఆసక్తికరంగానే ఉంది. నోట్ చేసుకుంటాను, ఏమన్నారు? 'ప్లాట్ ఐ' కదూ!"

తర్వాతి రోజు గురువారం క్లబ్బులో పని చేసే ఇద్దరు నీగ్రో మహిళలు, ఒక పురుషుడు పనికి రాలేదు. ఈ దీవిలో నీగ్రో పనివాళ్ళకు వారానికి నాలుగు డాలర్లు ఇస్తారు. నేను వారానికి ముందే వారి జీతం ఇచ్చేశాను, అయినా వాళ్ళు ఆ రోజు రాలేదు. నేను ఉదయం ఫలహారం కోసం వంటగది వైపు వెళితే గది ఖాళీ, పొయ్యి కూడ వెలిగించలేదు.

ఉన్నదేదో తిని గూడెం వైపు వెళ్ళాను. గూడెంలో చాలా కొద్దిమందే ఉన్నారు. కొందరు స్త్రీలు ఇళ్ళు అనబడే రేకుషెడ్ల ముందున్న చిన్నకూరగాయల మడుల్లో పనిచేసుకుంటున్నారు. నన్ను చూడగానే 'మార్నిన్ (మార్నింగ్) బాస్' అని వందనం చేశారు. మురికి, గజ్జి కుక్కపిల్లలు, పిల్లులు అటూ ఇటూ తిరుగుతున్నాయి.

నావద్ద పనిచేసే థామస్ తన ఇంటి ముందు కూర్చుని కనిపించాడు. "పనికెప్పుడు వస్తావు? అప్పుడే మధ్యాహ్నం అయ్యింది" అన్నాను.

"పన్ను నొప్పి బాస్. రేపటివరకు రాలేనేమో"

అతనిమాట నేను నమ్మలేదని అతనికి తెలుసు. అంతేకాదు పనికి రమ్మని బలవంతం చెయ్యనని కూడా అతనికి తెలుసు. ఈ దీవిలోని నీగ్రోలు సాధారణంగా తమ తెల్ల బాస్‌లకు 'నో' అని చెప్పరు. చెప్పారు అంటే బలమైన కారణం ఉంటుంది. ఇంక తెల్ల బాసులు కూడా ఏమీ చెయ్యలేరు.

తర్వాతి రోజు నేను వాగుదాటి టౌన్ కెళ్ళి అక్కడున్న ఒక తెల్ల యజమాని నుండి ఒక నీగ్రో మహిళను పనికి తెచ్చుకున్నాను. అతడు ఆమె మంచిపనికత్తె అనీ, విధేయురాలు అని కూడా చెప్పాడు. ఆమె కమ్మగా వంటచేసి మా యిద్దరికీ వడ్డించింది. ఆమె నీగ్రో గూడెం వెళ్ళకుండ ఆ రాత్రి ఆమెకు వంటగది పక్కనే ఒక గది ఏర్పాటు చేశాను. కానీ తెల్లవారేసరికి ఆమె లేదు. రాత్రి ఆమె ఆ గదిలో పడుకోలేదని నలగని పరుపు చెపుతోంది.

నేను ఆ గది నుండి తిన్నగా బార్క్‌డేల్ గదికి వెళ్ళాను. అతను గాజు సీసా దాచిన అల్మరా తెరిచాను, అల్మరా అంతా ఖాళీగా ఉంది. నేను వెనక్కు తిరిగేసరికి బార్క్‌డేల్ నా వైపు సరదాగా చూస్తున్నాడు.

"అక్కడా ఇక్కడా నిర్లక్ష్యంగా పడెయ్యడానికి ఆ గాజుసీసా చాలా విలువైనది. దాన్ని వేరే చోట భద్రంగా దాచాను" బార్క్‌డేల్ చెప్పాడు.

మా చూపులు కత్తులు దూసుకున్నాయి. కానీ నా నిస్సహాయత నాకర్థమయ్యింది.

తర్వాతి రోజుల్లో మా పనులన్నీ మేమే చేసుకోవలసి వచ్చేది. వచ్చీరాని వంట, సహించని తిండి, మా గదుల్ని, పరుపుల్ని మేమే సర్దుకోవడం వంటివన్నీ మేమే చేసుకుంటున్నాం. నేను నా క్లబ్బు పనిలో నిమగ్నమయిపోయాను. బార్క్‌డేల్ తన పరిశోధన సమాచార సేకరణకోసం దీవిలో విరామం లేకుండా తిరుగుతూ, రోజుకు రెండువేల మాటలకు తక్కువ కాకుండా నోట్సు తయారుచేసుకొనేవాడు. మేం ఒకర్నొకరం కలుసుకోవడం తగ్గించేశాం. అదే మేమిద్దరం కోరుకుంటున్నామనిపించింది.

ఇలా రోజులు గడుస్తున్న సమయంలో రెండు వారాల తర్వాత ఒక అర్ధరాత్రి నాకు మెలకువ వచ్చింది. బార్క్‌డేల్ మా




గదుల మధ్య ఉన్న తలుపుతెరిచి అక్కడ నిలబడి ఉన్నాడు. పొడుగ్గా ఉన్న అతని భుజాలు కొంచెం వంగి ఉన్నాయి. వదులైన రాత్రి దుస్తుల్లో అతను గమ్మత్తుగా కనిపిస్తున్నాడు. అతని ముఖంలో దుశ్శకునాలు కనిపిస్తున్నాయి.

"మీకు అభ్యంతరం లేకపోతే ఈ మధ్య తలుపు తెరిచి ఉంచుకుందాం. ఒక వారం రోజుల్నుండి సరిగ్గా నిద్రపట్టడం లేదు. ఈ తలుపు తెరిచి ఉంచితే కాస్త చల్లగా ఉంటుందేమోనని" అతని స్వరంలో అభ్యర్థన వినిపించింది.

అతను చాలా మామూలు విషయం చెప్పినట్టున్నా, ఆ అభ్యర్థన వెనక వేరే ఏదో ఉన్నట్టు నాకనిపించింది. తనకు తాను అబద్ధాలు చెప్పుకొని, ఆ అబద్ధాన్ని ఎదుటివాళ్లు నమ్మేలా చేసి, చివరకు ఆ అబద్ధాన్ని నిజంస్థాయికి తీసుకెళ్ళగల వ్యక్తి బార్క్‌డేల్. కాని అతను శుద్ధ అబద్ధాల కోరుకాదు. అతని స్వరంలోని అభ్యర్థన అతను ఏదో దాస్తున్నాడని చెపుతోంది. అతను తన గదిలోకి వెళ్ళి పడుకున్న తర్వాత మా గదుల మధ్య తలుపు తెరిచి ఉంచాలనే అతని అభ్యర్థన వెనుక అసలు విషయం ఏమిటా! అని నేను పడుకొని ఆలోచించడం ప్రారంభించాను.

మొదటిసారి నాకేదో తట్టింది. కాని దీన్ని ఇతరులతో చెప్పి నేను వారిని ఒప్పించగలనా? నా అనుభవాన్ని నేను మాటల్లోకి అనువదించలేను.

ఒకసారి నేను ఒక ఖాళీ చర్చిలో ఒక ఆర్గన్ (పెద్ద వాద్యయంత్రం) వాయించేసరికి ఆ శబ్దం ఆ ఖాళీగదిలో నన్ను చుట్టేసినట్టయ్యింది.

ఇప్పుడూ అదే పరిస్థితి. గదిలో ఏదో నన్ను చుట్టేస్తోంది. కాని దీనికి శబ్దం చప్పుడులేదు. కాని నన్ను చుట్టేస్తున్న భీకరమైన కదలికలను నేనుఅనుభవిస్తున్నాను. కొంతసేపటికి ఆ కదలికలు నెమ్మదించాయి, కాని అది గాలిలో కలిసిపోకుండా నన్ను చుట్టేస్తున్న భావన చర్మం మీద ఏదో పురుగు పాకుతున్న భావన!

నేను లేచి దీపం వెలిగించాను. గదిలోని వస్తువులు అంతా బాగానే ఉందనినాకు సాంత్వన నిచ్చాయి. నేను దీపం పట్టుకొని బార్క్‌డేల్ గదిలోకి వెళ్ళాను. అతను మంచం మీద వెల్లకిలా పడుకొని కళ్ళు విప్పార్చి పైకి చూస్తున్నాడు. అతన్ని చూస్తుంటే అతని అవయవాలన్నీ కదలిక కోల్పోయి బిగుసుకుపోయినట్టున్నాయి.

అతని వాలకం చూస్తుంటే తనను చుట్టేసిన కన్పించని బంధనాలనుండి తనను తాను విముక్తుడిని చేసుకొనే ప్రయత్నంలో ఉన్నట్టున్నాడు.

నన్ను చూడగానే అతను మంచం మీద నుండి లేచి "రాసుకోవడానికి లేద్దామనుకుంటున్నాను" ఎంత ప్రయత్నిస్తున్నా అతను ఆ మాటను సహజధోణిలో చెప్పలేకపోతున్నాడు.

"ఒకవారం రోజులుగా నిద్రలేమితో బాధపడుతున్నాను. దేని మీదా ధ్యాస పెట్టలేకపోతున్నాను" అన్నాడు.

నా శరీరంలో ఏదో ప్రకంపన. కాని ఇద్దరం తిరిగి నిద్రపోయే పరిస్థితి లేదు. మేమిద్దరం మా మా గదుల్లోని రాతబల్లల ముందు కూర్చున్నాం. తెల్లవారడానికి ఇంకా నాలుగుగంటల సమయం ఉంది.

నా బుర్రలో ఒక ప్రశ్న ఉదయించింది. దానికి జవాబు వెంటనే కావాలి. వారంపదిరోజుల నుండి నిద్రలేని వ్యక్తి మానసిక పరిస్థితి ఏమిటి? ఏమో! నాకు నేనే ఒప్పుకోవడానికి నిరాకరించే విషయమేదో అవగతమవుతోంది. వద్దనుకున్నా నాకు తెలిసిన అనుభవాలు నన్ను భయంలోనికి నెట్టుతున్నాయి.

ప్రతిమనిషిలో ఉండే ఒక అజ్ఞాత హెచ్చరిక నన్ను తట్టిలేపుతోంది. అది ఏమిటో ఎవరూ ఎదుటివారికి చెప్పలేరు.

ఆ రాత్రి తర్వాత ఇంట్లో కనిపించని కదలికలెక్కువయ్యాయి. నన్ను నేనయినా రక్షించుకోవాలనే ఉద్దేశంతో మధ్య తలుపు మూసేశాను. కానీ ఒంటరితనం నన్ను భయపెట్టింది. ఈ భయపెట్టే ఒంటరి

తనం కంటే బార్క్‌డేల్ తోడే నయమను కుని, ఒక గంట తర్వాత మళ్ళీ మధ్య తలుపు తెరిచాను.

కళ్ళను విప్పార్చుకొని నిద్రలోకి జార కుండా నన్ను నేను నియంత్రించుకొని తెలి విలో ఉంటే కొంత అలజడి తగ్గుతుంది. కాని నిద్రమత్తులోకి జారుకుంటే ఆ సుషుప్త అవస్థలో భయం నన్ను చుట్టు కొంటుంది. అందుకే నిద్రలో బరువైన కనురెప్పలను బలవంతంగా తెరచి పడు కొంటున్నాను.

ఇలా ఇంకో పదిరోజులు గడిచాయి. నేను భరించలేకపోతున్నాను. బార్క్‌డేల్ పరిస్థితి అధ్వాన్నంగా తయారయ్యింది. అడవి జ్వరం పట్టినవాడిలా ముఖం అయోమయంగా, నిస్సహాయంగా కనిపి స్తోంది.

ఒకసారి నేను అతని వద్దకు వెళ్ళేసరికి బల్లమీద తలవాల్చి పడుకున్నాడు. నేను అతని మీదకు వంగేసరికి ఏదో శరాఘా తంలా నన్ను తాకింది. అది అతని వద్దే కేంద్రీకృతమై ఉందని నాకప్పుడర్థమ య్యింది. నేను నా గదిలోకి తిరిగివచ్చి అక్కడ నుండి అతన్ని చూడసాగాను.

ఈ దీవి నుండి వెళ్ళిపొమ్మని నేను బార్క్‌డేల్‌ను బతిమాలాను. అతను మొండిగా నిరాకరించాడు. తర్వాత నేనే అతన్ని వదిలి వెళ్ళిపోదామనుకున్నాను. కాని తర్కానికి అందనిదేదో, బహుశా ఇక్కడి నీగ్రో తెగతో నాకున్న అనుబంధ మేమో నన్ను కట్టిపడేసింది. తెల్లజాతికి చెందిన మేమిద్దరం, ఈ అడవి, నీగ్రోల గూడెం, కనిపించని అదృశ్యశక్తి హూ! నేనెక్కడికి వెళతాను?

నేను టౌన్‌కెళ్ళి బార్క్‌డేల్ అనారో గ్యంతో ఉన్నాడని, వెంటనే వచ్చి అతన్ని తీసుకెళ్ళమని స్పెన్సర్‌కు టెలిగ్రామ్ పంపాను.

కాని ఇంకో పది రోజుల్లో నాకు బార్క్ డేల్‌కు ఉన్న వ్యత్యాసం స్పష్టంగా తెలి సింది. నేను నమ్ముతున్న దాన్ని అతను నమ్మడంలేదు.

రక్తంలో ఎర్రబడిన కళ్లతో నా వైపు చూస్తూ అతను తను నమ్ముతున్న అబ ద్ధాన్ని నిజంలా నాకు చెప్పే ప్రయత్నం చేశాడు. "ఏమీ లేదు, చుట్టూ ఉన్న బుర దకయ్యలలో నిల్వ ఉండే క్రిములతో వచ్చే జ్వరం. ఆఫ్రికాఖండంలో తెల్లవాళ్లు ఒక ప్పుడు ఈ జర్వం బారినపడుతూ ఉండే వారు. దీనికి విరుగుడు ఉంది. ఇక్కడకు వచ్చేముందు ఆ మందు గురించి తెలుసు కొని రావలసింది" అన్నాడు.

నేనేమీ జవాబివ్వలేదు. పిరికివాడిననే ముద్రనుండి తప్పించుకోవడానికి నేను నమ్ముతున్న విషయాన్ని బయటకు చెప్ప లేక, లోలోపలే ఆ నమ్మకానికి నెమ్మది నెమ్మదిగా బాధితుడినవుతున్నాను. నా మనసుకు ఈ సంగతి బాగానే అర్థమవు తోంది. బార్క్‌డేల్ బయటకు వెళ్ళినప్పుడు ఆ చిన్నగాజుసీసాకోసం నేనతని గదినం తా గాలిస్తున్నాను. చివరకు భయంతో ని రాశతో కూరుకుపోయిన భాస్వరం ఉన్న అగ్గిపుల్లను నేను వెంట ఉంచుకుంటు న్నాను.

కనిపించక, వినిపించక కేవలం అనుభ వానికి మాత్రమే వచ్చే ప్రకంపనలు రాత్రులే కాకుండా పగలు కూడా అనుభ

## కొత్తగాలి...

**గుండె గది నిండా**
**పరిమళం!**
**నువ్వు కబ్జా చేసేకే!**

**– గుడిమెట్ల గోపాలకృష్ణ,**
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

వానికి వస్తున్నాయి. మధ్యాహ్నాలు కూడా మా అలసిన శరీరాలు నిద్రలోకి జారకుండా ఆ ప్రకంపనాల ప్రభావం మా మీద ఉంటోంది. కళ్ళు విప్పార్చుకొని శరీరంలోని కండరాలను బిగించి జాగరూకతతో ఉంటే తప్ప మేం మనుషుల్లా ఉండలేక పోతున్నాం. పీడకలలు ఎప్పుడూ మా చుట్టూ తిరుగుతున్నాయి.

ఇలా జరుగుతున్న మూడోవారంలో అనుకుంటా, ఆ రాత్రి మధ్య తలుపువద్ద బార్క్‌డేల్ వైపు తిరిగి ఉన్న 'ఆమె'ను చూశాను. ఆ రోజు నిండుపున్నమి గూడెం నుండి అసాధారణమైన ఉద్వేగం, ఉత్సాహం వినిపిస్తున్నాయి. నాకు వెన్నెల రాత్రులంటే చాలా ఇష్టం. నేను వరండాలో నిలబడి చంద్రుడు బంగారు రాగి రంగు నుండి వెండి చక్రంలా మారడం చూస్తున్నాను. గూడెంలో నృత్యకార్యక్రమం నడుస్తున్నట్టుంది. కట్టెపుల్లలతో రేకుషెడ్‌ల మీద కొడుతున్న శబ్దాలు వినిపిస్తున్నాయి. ఆ శబ్దాలలో ఏదో తేడా ఉన్నట్టు నాకనిపించింది. అది నృత్యసంగీతం కాదు. డప్పుల మోతలో ఏవో మంత్రోచ్చారణ లాంటి శబ్దాలు కూడా వినిపిస్తున్నాయి.

నేను నా గదిలోకి వెళ్ళి దుస్తులతోనే మంచంమీద పడుకున్నాను. హఠాత్తుగా లేచి కూర్చున్నాను. పిడికిళ్ళు బిగిసి ఉన్నాయి. శరీరం నిటారుగా అయ్యింది. ఇంతకుముందు నేనెన్నడూ అనుభవించని అలజడి- మా గదుల మధ్య ఉన్న తలుపులో నుండి బార్క్‌డేల్ గదిలో వరండావైపు తెరచుకున్న తలుపుల వైపు చూస్తున్నా! చీకటినిండిన గదిలో చల్లని తెల్లని వెన్నెల గదిలోని వస్తువులమీద చతురప్రాకారంలో పరుచుకుంటోంది. ఆ వస్తువులు దృష్టికి ఆనుతున్నాయి. ప్రకంపనలు, గదిలో పరుచుకున్న వెన్నెల కూడా కదులుతోంది.

అప్పుడే నమ్మశక్యం కాని ఆ దృశ్యం కనిపించింది. నమ్మశక్యం కానిదనిఎందుకంటున్నానంటే, ప్రతిమనిషికి అతని నమ్మకాలు, అపనమ్మకాలు అతని జీవితంలోని అనుభవాలను బట్టి ఉంటాయి. 'ప్లాట్ ఐ'ని చూసిన తెల్లజాతీయుడిని నేనింతవరకు చూడలేదు. లేతనీలిరంగులో గుబాళిస్తున్న మల్లెల పరిమళంతో ఎవరది? - నేను లేచి నిలబడ్డాను.

బార్క్‌డేల్ గదిలో వ్యాపించిన తెల్లని వెన్నెల మధ్య ఒక చీకటి నిలువుగా నిలబడి ఉంది. ఆ రూపానికి రూపం ఇచ్చే ప్రయత్నం చేస్తున్నట్టు గాలి వీస్తోంది. అదే జరిగింది ఇప్పుడు ఎదురుగా ఉన్న దాన్ని చూడొచ్చు, తాకొచ్చు.

నేను చూశాను, ఆమెను చూశాను.

నేను షాక్‌లోనుండి బయటపడ్డాను. ఎన్నో అగ్గిపుల్లలు ఒకేసారి వెలిగిస్తే వచ్చే వెలుగు, ఆ పసుపు వెలుగు గదిలోని వస్తువుల మీద పడింది. గదిలో దీపం వెలిగించి నేను మళ్ళీ చూశాను.

బార్క్‌డేల్ గదిలో వెన్నెల మాయమయ్యింది. అంతా ఖాళీగా కనిపిస్తోంది. దీపం వెలుగు నెమ్మదిగా పెరుగుతోంది. ఆ వెలుగు గదిలో వెచ్చదనాన్ని వ్యాపింపజేసింది. ఆ వెలుగు గదిలోని కుర్చీల మీద, బల్లల మీద బార్క్‌డేల్ మంచం మీద ప్రసరించింది. అతని మంచం ఖాళీగా ఉంది. నేను వరండాలోకి పరుగెత్తాను. అతను పెద్ద ఓక్ చెట్టు కింద ఉన్నాడు. ఆ చెట్టు వరండాకు వందగజాల దూరంలో ఉంది. నేను అక్కడకు చేరుకునేటప్పటికే అతను కనుమరుగయ్యాడు.

నేను వెనక్కి నా గదిలోకి వెళ్ళాను. ఫైర్‌ప్లేసులో పెద్ద మంట వెలిగించాను, దీపాలన్నీ వెలిగించాను. పెద్ద వాలుకుర్చీలో కూర్చుని ఉదయం కోసం ఎదురు చూస్తున్నాను.

ఎడివాండర్ దీవిలో మోటారు కారు హారన్ శబ్దం. మగతనిద్రలో ఏం జరుగుతోందో నాకర్థం కాలేదు. ఆ శబ్దం నా




మగత నిద్రనుండి నన్ను మేల్కొలిపినట్టయ్యింది. నాకు పిచ్చికోపం వచ్చింది. నా కళ్ళల్లో నీళ్ళు, కళ్ళుతెరిచి చూస్తే మిట్టమధ్యాహ్నమయ్యింది. నా గదిలోని దీపాలన్నీ దేదీప్యమానంగా వెలుగుతూ నన్ను వెక్కిరిస్తున్నాయి.

"దౌర్భాగ్యుడా!" స్పెన్సర్ స్వరం వినిపించింది. "ఈ వేసవిలో ఈ అడవికొచ్చి నీకు, ఆ బార్క్‌డేల్‌కు సేవలు చెయ్యడం తప్ప నాకు వేరే పనేమీ లేదనుకుంటున్నావా!"

స్పెన్సర్ మోటారుకారు అనే ఆ పెద్ద యంత్రం నుండి కిందకు దిగి నా వద్దకు వస్తూ నవ్వుతూ అంటున్నాడు.

"నిన్ను ఇంకేమి అననులే! నీ టెలిగ్రాం మొదటిసారి ఈ కారును నడుపుకుంటూ ఇక్కడికి వచ్చే అవకాశాన్ని ఇచ్చిందిలే. ఈ కారుతో మొదటి ప్రయోగం, అందుకే ఆల స్యమయ్యింది. పడవ నుండి దీన్ని కిందకు దింపి నడుపుతుంటే ఎడివాండర్ దీవి నీగ్రోలను చూడాలి, కొందరు దూరంగా పారిపోతే, కొందరు భయంతో చెట్లెక్కే శారు" చెపుతూ స్పెన్సర్ పగలబడి నవ్వు తున్నాడు. కానీ నన్ను దగ్గరగా చూసిన అతను నవ్వాపేశాడు. అతని మొహం కూడా నా మొహంలాగే పాలిపోయింది.

"దేవుడా! అసలేమయ్యింది. నువ్వు నా ముందే ఇప్పుడే ఇక్కడే చచ్చిపోతావా ఏంటి? " అన్నాడు.

"ఈ రోజు కాదులే! కానీ మనం వెంటనే బార్క్‌డేల్‌ను వెతకాలి" అన్నాను.

అడవిలో బార్క్‌డేల్‌ను వెదకడానికి మాకు సాయం రావడానికి ఒక్క నీగ్రో కూడా దొరకలేదు. వాళ్ళు స్పెన్సర్‌ను అభి మానంగా పలకరించారు. స్పెన్సర్ వాళ్ళతో ఎప్పుడూ ఆదరంగానే ప్రవర్తి స్తాడు. అతనితో కలిసి మనసారా నవ్వారు. బాతుల వేటలో స్పెన్సర్‌కు తోడుగా ఉండే మంగో ఒక అరగంటలో కొంతమంది నీగ్రోలను తీసుకొని మాకు సాయంగా వస్తానన్నాడు. గంట దాటినా ఒక్కరూ జాడలేరు. ఏమయ్యిందో తెలుసు కుందామని మేం నీగ్రోల గూడానికి వెళ్తే అక్కడ ఎవ్వరూ లేరు, ఊరకుక్కలు తప్ప. చేసేదేమీ లేక బార్క్‌డేల్ అన్వేషణకు మేమిద్దరమే బయలుదేరాం. అయిదు చద రపు మైళ్ళపరిధిలో ఉన్న ఆ అడవిలోప లికి వెళ్ళాలంటే వంకీ కర్రలతో గుబురుగా ఉన్న పొదలను వేరు చేస్తూ దారి ఏర్పరు చుకుంటూ వెళ్ళాలి. టౌన్‌కెళ్ళి తెల్లవాళ్ళను సాయం తెచ్చుకుందామనుకున్నాం, కానీ వెంటనే ఆ ఆలోచనను విరమించు కున్నాం. బార్క్‌డేల్ మాయమై పన్నెండు గంటలవుతోంది. అతనున్న బలహీన స్థితిలో అతను క్షేమంగా ఉంటాడా అనేదే మా అనుమానం. పరిస్థితులు మాకు ప్రతి కూలంగా ఉన్నాయి. స్పెన్సర్‌ది భారీ విగ్ర హమైనా, అతను ఆఫీసుపనికే అలవాటు పడిన వాడవడంతో ఇంత శ్రమతో కూడిన ప్రయాణానికి అతని శరీరం సహకరిం చడం లేదు. నేను నీరుగారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకొని కేవలం మనోబ లంతో ముందుకెళుతున్నాను. మాతో ఆహారం తెచ్చుకున్నాం.

మధ్యమధ్యలో తింటూ, ఆ అడవి దారు ల్లోనే కాస్సేపు ఒరిగి విశ్రాంతి తీసుకుం టున్నాం. రాత్రి తెల్లని వెన్నెల్లో కూర్చుని తింటుంటే స్పెన్సర్ మేం వెతుకుతున్న బార్క్‌డేల్ గురించి అంతవరకు నాకు తెలి యని చాలా సంగతులు చెప్పారు.

"ఇతని గురించిన వివరాలన్నీ నేను నీకు రాసిన ఉత్తరంలో పూర్తిగా తెలియజె య్యాల్సింది, అతనిపట్ల కోపం కంటే నీకు ఎక్కువగా సానుభూతి కలిగేది. ఇప్పుడ తన్ని చూస్తే స్త్రీలను పట్టించుకునే వ్యక్తిలా అనిపించకపోవచ్చు. కానీ ఒకప్పుడతను పీకల్లోతుగా ప్రేమలో మునిగాడు.

ఆమె ఊహకందని అద్భుతమైన వ్యక్తి. మెరుపు వేగంతో అతని చుట్టూ ఆడు కుంది. ఆ రోజుల్లో అతను చాలా చురుగ్గా ఉండేవాడు. అందంగా కూడా కనిపించే వాడు. ఆమె, అతన్ని తనకనుగుణంగా మలుచుకునే ప్రయత్నం చేసింది. ఆమెకు ఆడుకోవడానికి ఒక ఆటబొమ్మ కావాలి. బార్క్‌డేల్ ఆమె కోసం పడిచస్తాడు కాని ఆటబొమ్మగా మారలేదు. ఒక శుభో దయాన అతను తనకు తగిన వ్యక్తి కాడనే నిర్ణయానికి ఆమె వచ్చింది. అంతే అతన్ని వదిలించుకుంది. మామూలుగా కాదు,

ఒక పార్టీలో అందరూ చూస్తుండగా అతనితో తెగతెంపులు ప్రకటించింది. ఆ పార్టీలో నేనూ ఉన్నాను. ఆమె మనుషుల హృదయాలకు మత్తుమందు ఇవ్వకుండా కత్తులతో శస్త్రచికిత్స చేసి ఆనందించే రకం.

తర్వాత బార్క్‌డేల్ పూర్తిగా మారిపోయాడు. ప్రతీదాన్ని చూసి, తాకి, వాసన చూస్తేగాని నమ్మలేని స్థితికి వచ్చాడు. కనిపించని, మనకందని శక్తి ఏదో అతన్ని తీవ్రంగా గాయపరచింది. అతనింకా దేనికో భయపడుతున్నట్టున్నాడు. ఆ సంఘటన జరిగిన అయిదు సంవత్సరాల తర్వాత నేనతన్ని కలిసినప్పుడు, అతను ఈ పరిశోధనల్లో, గాజు వస్తువుల సేకరణలో తనను తాను లీనం చేసుకొని జీవించడం చూశాను"

స్పెన్సర్ కాస్సేపు ఆగాడు. ఆ ఆగష్టు నెల రాత్రిలో చీకటి ఇంకా చిక్కనవుతోంది. స్పెన్సర్ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు "అతని మీద ఆమె ప్రభావం ఇంకా తొలగిపోలేదు. బహుశా అది అతని మృత్యువు వరకు కొనసాగుతుందేమో! ఆమె పేరు సీలియా. ఆమె ఇప్పుడు భర్తా, పిల్లలతో హాయిగా యూరప్‌లో జీవిస్తోంది. కాని ఆమె ఇప్పుడు పిలిచినా బార్క్‌డేల్ వెళతాడని నాకు తెలుసు. నీకు తెలుసా? ఆమె చాలా అందంగా ఉంటుంది"

"అవును, నాకు తెలుసు" నేను బదులిచ్చాను "ఆమె తలమీద కిరీటంలా మెరిసిపోతున్న జుట్టుతో ఆమె దేవదూతలా కనిపిస్తుంది. ఆమె తలను ఒకవైపు తిప్పి, భుజాల మీద నుండి మనుషుల్ని చూసే తీరు, మనుషుల్ని మత్తులో ముంచే మల్లెల గుబాళింపు, ఆమెను నేను చూశాను" నేను చెప్పేసరికి స్పెన్సర్ నోరు తెరిచి అవాక్కయి నా వైపు చూశాడు.

కొంతసేపటికి తేరుకుని "ఆమెను నువ్వు చూశావా? " ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును, ఇక్కడే చూశాను. క్రితం రాత్రి ఆమె బార్క్‌డేల్ కోసం వచ్చినప్పుడు, నిన్నిప్పుడు ఎంత స్పష్టంగా చూస్తున్నానో, ఆమెను కూడా అంతే స్పష్టంగా చూశాను" నేను నిశ్చలంగా జవాబిచ్చాను.

"కానీ విదేశాల్లో ఉందామె"

నేను స్పెన్సర్ వైపు తిరిగి "ఇక్కడి నీగ్రోలు మాట్లాడుకునే 'ప్లాట్‌ఐ' గురించి నీవు విన్నావు కదా!" నేనడిగాను.

స్పెన్సర్ తల ఊపాడు.

"నువ్వు నమ్ముతావో లేదో తెలియదు. కాని ఆ సంగతి నీతో చెప్పాలి. ఇక్కడకు వచ్చిన రోజు బార్క్‌డేల్ ఒక తప్పు చేశాడు. నీగ్రోల సమాధుల నుండి ఒక చిన్న గాజుసీసాను దొంగిలించాడు. అప్పటి నుండి మాకు నరకం ప్రారంభమయ్యింది. ప్రతి రాత్రి గూడెంలో మంటలు, పాటలు, ఏమిటేమిటో..! అదంతా 'ప్లాట్ ఐ' ఆత్మను ఆహ్వానించే ప్రయత్నం. ఆ ఆత్మ వచ్చి బార్క్‌డేల్‌ను అడవిలోకి తీసుకెళితే, మనం అతన్ని వెతుక్కుంటూ అడవికొస్తే, ఎవరూ లేని క్లబ్బులో నీగ్రోలు ఆ సీసాను వెదికి పట్టుకుంటారు" ఇన్ని రోజులుగా నేను సంశయిస్తూ నమ్ముతున్న నిజాన్ని చెప్పేశాను.

"కానీ సీలియా గురించి వాళ్ళకెలా తెలుసు? " స్పెన్సర్ అడిగాడు.

"అవును, వాళ్ళకు సీలియా గురించి తెలియదు. కానీ బార్క్‌డేల్‌కు తెలుసుగా! బార్క్‌డేల్‌ను వాళ్ళు మానసికంగా చితగ్గొట్టారు. అటువంటి మానసిక స్థితిలో ఉన్న వ్యక్తులు తమ పాత ప్రేమలను, జ్ఞాపకాలను తమ మస్తిష్కంలో ఆవిష్కరించుకొని ఆ జ్ఞాపకాలలోని వ్యక్తులు తమ ముందున్నట్టుగా భావిస్తారు. ఈ స్థితినే మానసిక నిపుణులు 'రిఫ్లెక్స్' అంటారు. ఈ 'రిఫ్లెక్స్' గురించి నువ్వు వినే వుంటావుగా!" నేనన్నాను.

స్పెన్సర్ అంగీకారంగా తల ఊపాడు.

"కానీ ఒట్టేసి చెపుతున్నా. నేను కూడా

ఆమెను చూశాను" నేను చెప్పిన రిఫ్లెక్స్ సిద్ధాంతంలో నాకే నమ్మకం లేనట్టు నేనన్నాను. నా మనసులో నేను ఇంకా దేన్నో గాఢంగా నమ్ముతున్నాను.

ఆ వెన్నెల్లో స్పెన్సర్ నా వైపు ఒరిగాడు. అతని ముఖంలో నా మాటల మీద నమ్మకం కనిపించింది.

"హమ్మయ్య! నువ్వు నమ్మావు. అందుకే మనం ఆలస్యం చెయ్యకుండా బార్క్‌డేల్‌ను వెతికి అతను ఏ స్థితిలో ఉన్నాడో తెలుసుకోవాలి" నేనన్నాను.

తెల్లవారడానికి ఇంకా ఒక గంట సమయం ఉందనగా మేం దీనికి ఆవలివైపున్న అడవి అంచుకు చేరుకున్నాం. చంద్రుని మసక వెలుతురు చెట్ల సందుల్లో నుండి ప్రసరిస్తోంది.

తూర్పు వైపు నుండి సూర్యగోళం నెమ్మదిగా పైకి వస్తోంది. పక్షుల గుంపులు రాత్రి తమ రెక్కల మీద పడిన మంచును మా మీద విదిలిస్తూ ఎగురుతూ రోజును ప్రారంభిస్తున్నాయి. నా ముందు నడుస్తున్న స్పెన్సర్ చిన్నగా అరిచి ఒక చెట్ల గుబురులో మాయమయ్యాడు. నేను అతని వెనక వెళ్ళాను.

మా అన్వేషణ ముగిసింది. బార్క్‌డేల్ చేతులూ చాపి ఒక నీటి చెలమ వద్ద బోర్లాపడి ఉన్నాడు. అతని సగం తల చేతులు నీటిలో మునిగి ఉన్నాయి.

మేం అతన్ని కాస్త దూరం లాగి నేలమీదకు తెచ్చాం. అతను చాలా నెమ్మదిగా శ్వాస తీసుకుంటున్నాడు. నాడి అందీ అందకుండా ఉంది. అడవి తీగలు, కొమ్మలు, మేం యిద్దరం ధరించిన కోట్లు తీసి వాటితో చిన్న పాడెలా కట్టి, మూడు గంటలపాటు శ్రమ, అలుపుతో మా బరువును అడవి ఇవతలి అంచునకు మోసుకొచ్చాం.

నేను బార్క్‌డేల్‌ను కనిపెట్టి ఉంటే స్పెన్సర్ క్లబ్‌కు వెళ్ళి కారును కొన్ని బట్టలను, దుప్పట్లను తెచ్చాడు.

"గదుల్లో ఈ దుప్పట్లను వెతికి పట్టుకునేసరికి ప్రాణం పోయింది. క్లబ్బులోకి తుపాను చొచ్చుకుపోయినట్టుంది. సామాన్లు, వస్తువులు వరండాలో, క్లబ్బుముందు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి" అన్నాడు.

ఇద్దరం ఆ దుప్పట్లలో బార్క్‌డేల్‌ను చుట్టి కారులో ఎక్కించాం. స్పెన్సర్ కారును టౌన్‌వైపుకు పరుగెత్తించాడు.

నా శరీరంలో శక్తి అంతా హరించుకుపోయింది. అలాగే కాళ్ళీడ్చుకుంటూ క్లబ్బు వైపు నడుస్తున్నాను. ఆ వేసవి మధ్యాహ్నపు ఎండలో నా వెనుక అడవి, ముందు కొండలు, ఎత్తైన పైన్ చెట్లు, నీగ్రోల సమాధి దిబ్బలు ఉన్నాయి.

నేను సమాధులున్న ప్రదేశంలోకి ప్రవేశించాను. బార్క్‌డేల్ ఏ సమాధి దిబ్బ నుండి ఆ చిన్న గాజుసీసాను తీసాడో ఆ సమాధివైపు చూశాను. ఆ సీసా అక్కడ ఉంది. ఆ దిబ్బమీది ఇసుకలో చిన్న వృత్తం మధ్య ఆ గాజుసీసా చక్కగా అమరి ఉంది.

నేను బయటకు వచ్చి క్లబ్బువైపు దారితీశాను. పొలాల్లో నుండి నీగ్రోకూలీలు మధ్యాహ్న భోజనానికి వస్తున్నారు. పదిహేను ఇరవై మంది ఉంటారు. వారి భుజాలమీద పారలు మెరుస్తున్నాయి. ఎండ మహిళల తలల మీద పడుతోంది. ఆ కాల్చే ఎండలో కూడా వాళ్ళు మెత్తగా, లోతుగా నవ్వుతూ గుల్లా ఉచ్చారణలో నన్ను పలకరించారు.

"మార్నిన్ (మార్నింగ్) బాస్"

"హౌడు బాస్"

గుంపు విడిపోయి నాకు దారిచ్చారు. స్త్రీలు తమ దుస్తులను తాకి గౌరవ సూచకంగా కాస్త తల వంచి, పురుషులు తమ టోపీ అంచును తాకి నాకు వందనం చేశారు. వాళ్ళు దిబ్బ ఎక్కి అవతలివైపుకు దిగి కనుమరుగయ్యారు. అంతటా పరుచుకున్న గాఢమైన నిశ్శబ్దం.




ఆదివిష్ణు

# మనిషి-మిథ్య

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**తెలుగు సాహిత్యంలో 1960, 70 దశకాలు నవలాకాలంగా చెబుతారు. పత్రికలన్నీ నవలల్ని ధారావాహికాలుగా ప్రచురించేవి. ప్రచురణకర్తలు కూడా నవలల్ని పుస్తకాలుగా వెలువరించేవారు. ఉద్యమాలు, ప్రాంతీయ, అస్థిత్వవాదాల జోలికి అప్పుడు ఎవరూ వెళ్ళిన కాలం కాదు. మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి జీవితమే ఎక్కువగా ఈ రచయితల ముడివస్తువు. వస్తువు అదే అయినా ఒక్కొక్కరిది ఒక్కోరకం రచనా పద్ధతి. ఆదివిష్ణు రచనలు యువతీయువకుల జీవితానికి, భావోద్రేకాలకి దగ్గరగా ఉండేవి. అప్పటికి ఆయనా యువకుడే. 1969లో ఆదివిష్ణు నవల 'మనిషి-మిథ్య' ప్రచురితమైంది. ఆంధ్రసచిత్ర వారపత్రిక నవలల పోటీలో ఈ నవలకి ప్రథమ బహుమతి వచ్చింది. అంతేకాక ఇది ఆదివిష్ణు తొలినవల కావడం విశేషం.**

'మనిషి-మిథ్య' శంకరం అన్న ఓ యువకుడి కథ. శంకరం స్నేహితులు, కుటుంబ సభ్యులు కొద్దిమంది పరిచయస్తుల మధ్యే ఈ నవల నడిచింది. అయినా 1960 నాటి యువతీయువకుల మనోభావాలకి ఆశనిరాశలకి ప్రతిబింబంలా వుంటుంది.




జానకిరామయ్యగారు రిటైర్డ్ స్కూల్ టీచర్. ఆయనకి ముగ్గురు పిల్లలు. పెద్దబ్బాయి నిరంజనం, రెండోవాడు శంకరం, కూతురు సుశీల. నిరంజనానికి పెళ్లయింది. మావగారికి మగపిల్లలు లేకపోవడంతో ఆయన వ్యాపారం చూసుకుంటూ నిరంజనం గుంటూరులో వుంటున్నాడు. డిగ్రీ పూర్తిచేసిన శంకరం ఉద్యోగాలు వెతుక్కుంటున్నాడు. తండ్రిని, ఇంటిని చూసుకుంటూ సుశీల ఇంటిపట్టునే ఉంటోంది. సుశీల పెళ్లయిపోయి, శంకరానికి ఉద్యోగం దొరికితే జానకిరామయ్యగారి బాధ్యత తీరినట్టే. జానకిరామయ్యగారికి అన్ని విషయాల్లోనూ కొంచెం ఆందోళన ఎక్కువే. ఆయనకి రక్తపోటు కూడా వుంది.

ఉద్యోగ ప్రయత్నం మీద శంకరం తన స్నేహితుడు రంగారావు దగ్గరకి కాకినాడ వెళ్లటంతో ఈ నవల ఆరంభమైంది. కొడుకు వెళ్ళిన దగ్గర్నించీ, ఆ ఉద్యోగ ఫలితం కోసం జానకిరామయ్యగారు ఎదురుచూపులే. శంకరానికి రచయితగా మంచిపేరు వస్తున్న సమయం అది. అతని రచనలు తరచుగా పత్రికల్లో వస్తున్నాయి. అతన్ని ఒక్కసారి చూస్తే చాలనుకునే అభిమానులు వున్నారు. కలుసుకుని కబుర్లు చెప్పాలనుకునే అభిమానులూ వున్నారు. అదే విషయం మిత్రుడు రంగారావు, అతని భార్య సుజాత ధ్రువీకరించారు. రంగారావు తమ బాస్‌కి చెప్పి శంకరానికి ఉద్యోగం వేయిస్తానన్నాడు. ఆ బాస్ ఊళ్ళోలేడు. ఆయనొచ్చేవరకూ ఉండాలి. మిత్రుడి ఇంట్లో సౌకర్యంగానే వుందిగానీ, ఆ భార్యభర్తలు గడుపుతున్న జీవితమే శంకరానికి నచ్చలేదు. అదే సమయంలో రంగారావు కేంపుకి వెళ్ళాల్సివచ్చింది. శంకరాన్ని, సుజాతని వదిలేసి వెళ్ళాడు. భర్త ఇంట్లో లేని సుజాత ప్రవర్తన అతిగా అని

పించింది శంకరానికి. ఆమె అతిచనువుగా ప్రవర్తిస్తే, దానికి శంకరం విముఖత చూపించటంతో ఆమె క్లాస్‌మేట్ రాంబాబుతో ఆ రాత్రి బైటికి వెళ్ళిపోయింది. అంతేకాదు, తిరిగి వచ్చి తన భర్త తక్కువవాడు కాదని, ఆఫీసరుగారి భార్యతో శృంగారం సాగిస్తున్నాడని, ఇప్పుడు కేంప్ అన్నదీ అబద్ధం అయివుంటుందనీ, బహుశా ఆవిడ దగ్గరే వుండివుంటాడనీ అంది. సుజాత చెప్పిన ఆ విషయాలన్నీ విన్నాక, ఇంక ఆ ఇంట్లో వుండటం మంచిది కాదని ఎవరికీ చెప్పకుండానే శంకరం తన సామానుతో బయలుదేరి ఇంటికి వచ్చేశాడు.

ఈ మొత్తం కాకినాడ వ్యవహారంలో కథ పెద్దగా ముందుకు సాగదు. కానీ శంకరం మనస్తత్వం, మంచి, చెడ్డల పట్ల అతని విచక్షణ, వ్యక్తిత్వం తెలుస్తాయి. తండ్రి తన ఉద్యోగం కోసం ఆతృతగా ఎదురు చూస్తూవుంటాడని తెలుసు. నిజానికి జానకిరామయ్య అలాగే నిరీక్షిస్తున్నారు. కాకినాడలోనే మరిన్ని రోజులుంటే ఉద్యోగం దొరికేదేమో? కానీ బతుకు పాడైపోయే ప్రమాదం వుంది. తండ్రి కోరికకి అనుగుణంగా నడుచుకోవాలని వున్నా, కలిసిరాని పరిస్థితి. ఆ కాలంలో చాలామంది నిరుద్యోగ యువకుల సాధారణ, సున్నిత అనుభవం ఇది. ఈ సంఘటనే కాదు, ఈ నవల కీలకం అంతా తండ్రీ కొడుకుల అనుబంధం మీదే వుంది.

జానకిరాయ్యగారికి తన సంతానం మీద నమ్మకం వుంది. తనంటే గౌరవం అనీ, ఆదరిస్తారని విశ్వాసమే. కానీ బయటి పరిస్థితులు, జరుగుతున్న సంఘటనల వల్ల ఒక్కోసారి కొద్దిగా అనుమానమూ కలుగుతోంది. పెద్దబ్బాయి నిరంజనం మంచిస్థితిలో ఉన్నాడు కాబట్టి, శంకరానికి ఏదైనా ఉద్యోగం వేయిస్తే బావుండునని ఆయన ఉద్దేశం. తనలాగే తమ్ముడు కూడా ఒకరి మోచేతి కింద నీళ్ళు తాగకూడదని, స్వయంకృషితో ధీమాగా బతకాలని నిరంజనం ఉద్దేశం. సుశీల పెళ్ళి విషయంలోనూ ఇటువంటి స్వల్ప అభిప్రాయ భేదాలు వున్నాయి. తండ్రీ పిల్లల మధ్య గట్టి అభిమానం వుంది. దాంతోపాటే చిన్నచిన్న అనుమానాలూ వున్నాయి. ఆనాటి సాధారణ, దిగువ మధ్యతరగతి కుటుంబాల పరిస్థితి అదే.

ఇంక ఉద్యోగ ప్రయత్నాలే చెయ్యకూడదని, వ్యవసాయం చేసుకుని బతకటం నయమన్నంత విసుగు కలిగింది శంకరానికి. అలాంటి శంకరాన్ని చూస్తున్న జానకిరామయ్యగారికి దిగులు పట్టుకుంది. దానికితోడు మిత్రుడు, సహ ఉపాధ్యాయుడు అయిన దీక్షితులు అకస్మాత్తుగా మరణించటం ఆయనకి పెద్దషాక్. తరచుగా గుండెల్లో నొప్పి వస్తోంది. ఆయన వైద్యం కోసం అందరూ కలిసి గుంటూరు నిరంజనం ఇంటికి వెళ్ళారు. వాతావరణం మార్పు జానకిరామయ్యగారికి మేలు చేసింది. ఆయన ఆరోగ్యం మెరుగైంది. రక్తపోటు తప్ప మరేం ఇబ్బంది లేదని డాక్టరు చెప్పాడు. నిరంజనం భార్య రేణుక పిన్ని కామాక్షమ్మగారు బాగా ఉన్నావిడ. ఆవిడ తన కూతురు శారదని, శంకరానికిచ్చి పెళ్ళి చెయ్యాలన్న అభిప్రాయంతో వుంది. బెజవాడలో పెద్ద బట్టల కొట్టు పెడుతున్నారు వాళ్ళు. ఇల్లు కూడా కొంటున్నారు. శంకరంవాళ్ళు ఒప్పుకుంటే, నిరంజనంలాగే శంకరం కూడా ఉన్నఇంటివాళ్ళ అల్లుడవుతాడు. నిరంజనం అంత సుముఖంగా లేడు ఆ సంబంధానికి. మొత్తానికి పెద్ద విశేషాలేం జరకుండానే జానకిరామయ్యగారు వాళ్ళు వెనక్కి తిరిగి వచ్చేశారు.

'మనిషి-మిథ్య' నవల అంతా ఇలాంటి చిన్న చిన్న సంఘటనలతోనే సాగింది. ఏ సంఘటనలోనూ పెద్ద నాటకీయత లేదు. పెద్ద మలుపులు లేవు. విశేషమేమిటంటే అలాంటి అతి సహజమైన సంఘటనల్ని ఆదివిష్ణు పట్టుకోగలగటం. రోజూవారీ జీవితంలోని ఉత్సాహ, నిరుత్సాహాలు, సంతోషాలు, చికాకులు, మనసు దిగులు పడటం, తిరిగి కోలుకోవటం.. ఇలా స్నేహాలు, బంధుత్వాలు, ఆశనిరాశలు లాంటివన్నీ కలగలసిన సమాహారం ఈ నవల. 1960 దశకం నాటి చిన్నపట్టణాలలోని దిగువ మధ్యతరగతి జీవితానికి, తెలుగువారి కుటుంబ జీవన రీతికి ప్రతిబింబం.

ఎవరి ప్రాపకం లేకుండానే శంకరానికి విజయవాడలో ఉద్యోగం వచ్చింది. స్వయం కృషితో శంకరం ఉద్యోగం సంపాదించినందుకు నిరంజనం, జానకిరామయ్యగారు ఎంతో సంతోషించారు.

విజయవాడలో తన సహ ఉద్యోగులతో కలిసి రూములో శంకరం మకాం. ఇక్కడ కూడా ఆదివిష్ణు వాళ్ళ జీవితాల్లోని చిన్నచిన్న సరదాలని, సంఘటల్నే కథావస్తువు చేసుకున్నారు. కుటుంబ జీవితం నుంచి కొంచెం పక్కకి జరిగి యువకుల బతుకుల్ని ఎక్కువ చిత్రించారు. శంకరం రచనా జీవితం, అతని మిత్రుల నాటకాభిరుచి, శారద చక్కటిగానం లాంటి లలితకళల విశేషాలూ ఈ నవలలో వున్నాయి. ఆనాటి యువతీ, యువకు

## సూటిదనం.. చురుకుదనం



ఆదివిష్ణుకు కథకుడిగా, నవల, నాటక, సినీ రచయితగా మంచి ప్రాచుర్యం వుంది. ఆయన పూర్తి పేరు ఆదివిష్ణు విఘ్నేశ్వరరావు. ఆయన ఇంటిపేరే కలంపేరు. 1940 సెప్టెంబరు తొమ్మిదో తేదీన బందరులో జన్మించారు. ఆర్టీసీలో చీఫ్ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరుగా పదవీ విరమణ చేశారు. వీరివి 1. కథలు (పది కథలు) 2. ఉద్యోగం ( ఏడు కథలు) 3. కలెక్టరూ క్షమించు (ఏడు కథధలు) 4. నీలాంటి ఒకరు (రెండు కథలు) కథా సంపుటాలు వచ్చాయి. ఇన్ని దశాబ్దాలుగా ఆదివిష్ణుని అంటిపెట్టుకున్న అభిమానవర్గం వుంది. ఇప్పటికీ ఆదివిష్ణు తమ గురువని చెప్పుకునే రచయితలు, వ్యక్తులూ ఉన్నారు. ఆయనకి ఈ గురుపీఠం దక్కటానికి కారణం అతి సామాన్యమైన ఆయన వ్యవహారం, రచనాతీరు. ఆదివిష్ణు వాక్యాలు చిన్నవిగా, సూటిగా వుంటాయి. నలుగురు చేరి గలగలా మాట్లాడుకునేటప్పటి ఊత పదాలు, మాటవిరుపులు ఆదివిష్ణుగారి రచనల్లో సర్వసాధారణం.

లలో చాలామందికి వీటితో గట్టి అనుబంధం ఉండేది. పరస్పర అభిమానాలకి, అనుబంధాలకి ఇవి కారణం అయ్యేవి. మిగిలిన పాత్రలకి భిన్నంగా కొంచెం నాటకీయత వున్న పాత్రలూ ఈ నవలలో వున్నాయి. అవి శంకరంతోపాటు అదే ఆఫీసులో పనిచేస్తున్న కుసుమ, ఆమె భర్త రాజారావు. ఆ రాజారావు మీద పగపట్టిన వాసు.

జానకిరామయ్యగారి మేనల్లుడు రాజారావు. తల్లీతండ్రిలేని రాజారావుని ఆయనే పెంచి పెద్ద చేశారు. చిన్నతనం నుంచీ అల్లరి చిల్లరి పనులకు అలవాటైన రాజారావు చివరికి జానకిరామయ్యగారి భార్య నగలు దొంగిలించి ఇంట్లోంచి పారిపోయాడు. అతనివి అన్నీ దుర్వ్యసనాలే. వాసు, శంకరానికి కొలిగే. ఆ వాసు చెల్లెలు రాజారావు మోసానికి బలై దీనంగా మరణించింది. ఆ తర్వాత రాజారావు కుసుమని పెళ్ళిచేసుకున్నాడు. ఆమెనీ ఆ తర్వాత వదిలేశాడు. చివరికి శంకరం ప్రమేయంతో వీళ్ళందరి కథా ఓ దారికి వచ్చింది. ఈ కథలో మరో ట్విస్ట్ ఏమిటంటే కుసుమ జానకిరామయ్యగారి మరో భార్య కూతురని ఆయనే చెప్పటం.

శంకరం- శారద, ప్రసాద్- మృణాళిని, రాజారావు- కుసుమ, ఒకటి అయ్యారు. శంకరం మిత్రుడు లక్ష్మీపతి ఇష్టపడి సుశీలని పెళ్ళిచేసుకున్నాడు. ఈరకంగా ఈ నవల సుఖాంతమే. కానీ ఆదివిష్ణు మనిషి-మిథ్య నవలని అలా ముగించలేదు. జానకిరామయ్యగారి మరణంతో ముగించారు. 'పుట్టిన వాళ్ళందరూ గిట్టక తప్పదు. ఎవరూ మరణాన్ని తప్పించుకోలేరు. దైవలీల ముందు నిమిత్తమాత్రులం. నువ్వూ నేను, భార్యాపిల్లలు అంతా మిథ్య..' అంటూ కోటయ్య మాస్టారు వేదాంతం కబుర్లు చెప్పారు.

'ఉత్తప్పుడు విసుగు పుట్టించే వేదాంతసారం, ఇటువంటి సమయంలో అమృతప్రాయంగా వుంటుంది' అనుకున్నాడు శంకరం. అతనికి తండ్రి కళ్ళముందు మెదులుతూనే వున్నాడు. తనని కంటికి రెప్పగా పెంచి, ప్రయోజకుడ్ని చేసి, నిత్యమూ తన బాగు కోసం తాపత్రయపడిన తండ్రి. అలాంటి తండ్రి ఇపుడు లేడు. విచలితమైన మనస్సుతో శంకరం శారదతో.. 'అంతా మన ప్రయోజకత్వ మనుకుంటాం! ఆ నమ్మకం పోయినప్పుడు నిమిత్తమాత్రులం.. అంతామిథ్య అనుకుంటాం' అనటంతో నవల ముగుస్తుంది. మరణ సమయంలోని దుఃఖాన్ని చాలా సహజంగా చిత్రించారు ఆదివిష్ణు.

ఆదివిష్ణు యువకుడిగా ఉన్నప్పుడు ఈ నవల రాశారు. కానీ ఇందులోని వృద్ధుల పాత్రచిత్రణ. వృద్ధులతో సమానస్థాయిలో వుంది. వారి మనోభావాలు శారీరక, మానసికస్థితి, అనారోగ్యాలు, స్నేహాలు, కాలక్షేపాలు అత్యంత సహజంగా వున్నాయి. బహుశా ఇందులో చాలావరకూ రచయిత స్వీయానుభవమేమో అనిపిస్తుంది.

'నిత్యమూ జరిగే జీవిత విధానాన్ని రాయాలి. దాని వెనక రచయిత కృషి, సిన్సియారిటీ అవసరం' అని ఓ పాత్రతో ఆదివిష్ణు ఈ నవలలో ఒకచోట చెప్పించారు. ఆయన అదే విధానాన్ని పాటించారు. ఓ వాస్తవిక చిత్రం లాంటి నవల మనిషి-మిథ్య. ©

మారియో వార్గస్ యోసా




# ఆంట్ జూలియా అండ్ ది స్క్రిప్ట్‌రైటర్

‘ఆంట్ జూలియా అండ్ ది స్క్రిప్ట్‌రైటర్’ను హాస్యనవల అనలేంగాని, సరదాగా చదువుకోవచ్చు. రచనా ప్రక్రియ గురించి చర్చించిన మెటా ఫిక్షన్ ఇది. ఇందులోని కథానాయకుడు మారియోకు, నవలా రచయిత జోసాకూ చాలా పోలికలున్నాయి. అంటే రచయిత స్వానుభవాన్నే కథగా మలిచాడనిపిస్తుంది. ఇందులో ‘ఊహ ఎక్కువ, జరిగింది తక్కువ’ అంటాడు రచయిత. రచయిత కావాలనుకున్న యువకుడి అనుభవాలే ఇందులో కథావస్తువు. కథాకాలం 1950వ దశకం.

మారియో అనే పద్దెనిమిదేళ్ల కుర్రాడు లిమాలోని పాన్‌అమెరికా రేడియో స్టేషన్‌లో న్యూస్ బులెటిన్‌లు రాసే ఉద్యోగం చేస్తుంటాడు. ఇతని ఆంటీకి చెల్లెలైన జూలియా విడాకులు తీసుకుని వచ్చింది. మొదట దూరదూరంగానే ఉన్నా క్రమంగా ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరుగుతుంది. కలిసి ఉండక తప్పని పరిస్థితీ వస్తుంది.

ఆ రేడియో స్టేషన్‌వాళ్లు సీరియళ్లు ప్రసారం చేసేవారు. 1939లో సబ్బు తయారీదార్లు స్పాన్సర్ చేసినందువల్ల ఈ సీరియళ్లకి ‘సోప్-అపెరా’లనే పేరు వాడుకలోకి వచ్చింది. సంవత్సరాల తరబడి కొనసాగే మెలోడ్రామాలకు అంతూపొంతూ ఉండదని తెలుసు. పెరూలో లభించిన సీరియళ్ల స్క్రిప్టులు నాసిరకంగా ఉండటంతో క్యూబా నుండి కొనుక్కోవాలనుకున్నారు రేడియో స్టేషన్ యజమానులు. అవీ ఏమంత మెరుగ్గా లేవు. చివరికి బొలీవియన్ స్క్రిప్టురైటర్ పేద్రో కమాచోని నియమించుకుని సమస్య పరిష్కారమైందనుకున్నారు.

అనుభవాలు నెమరేసుకుంటున్నాడు మారియో. ఆంటీని పెళ్లి చేసుకోవాలనుకున్నాడు. అప్పట్లో ఇరవై ఒక్క ఏళ్లు దాటితేనే వివాహార్హత. న్యూస్ రైటర్ ఉద్యోగం కొనసాగిస్తూ ‘లా’ చదివాడు మారియో.

రచయితగా స్థిరపడటానికి తీవ్రంగా కృ

షి చేస్తున్నాడు. నవలలోని మొదటి ఇరవై అధ్యాయాలలో బేసిసంఖ్యల్లో మారియో అనుభవాలు, సరిసంఖ్యల్లో పేద్రో కమాచో స్క్రిప్టుల గురించీ ఉంటుంది.

సీరియళ్లలో లాగానే, నవలలో కూడా మెలోడ్రామా పాలు పెంచాడు జోసా. అసలు పద్దెనిమిదేళ్ల మారియో, ముప్పై రెండేళ్ల జూలియాను పెళ్లాడాలనుకోవడమే ఒక పెద్ద మెలోడ్రామా. ఆ తర్వాత పెళ్లి లైసెన్స్ కోసం మారియో తంటాలు ఫార్సు గా ఉంటాయి. పెళ్లికి చట్టం అంగీకరించ దని ఆ 'ప్రేమికులు' ఓ రోజు లేచిపో తారు. అసలు, మారి యో అనుభవా లకూ, కమా చో స్క్రిప్టులకూ ఏమైనా తేడా ఉందా? రెండూ అసహజమే. 'సెంటిమెం టల్ ట్రాష్' కన్నా తక్కువేమీ కాదు.

జూలియా ఉర్కిడితో జరి గిన తన మొదటి వివాహం గురించి రచయిత జోసా రాసిన కథ ఇది. ప్రేమికులు లేచిపోవడం కుటుంబంలో సంక్షోభం సృష్టిస్తుంది. ఒక రకంగా ఇది సోప్ అపెరాను మించిన మెలోడ్రామా. చివరికి నగ రం నుండి మరోనగరానికి తిరు గుతూ, ఇంకా వయసు నిండని మారియో తమ వివాహం జరిపించటానికి మేయ ర్‌ను కలుస్తారు. మేయర్ లంచం అడుగు తాడు.




రేడియో శ్రోతలు, కమాచోకు బ్రహ్మ రథం పడతారు. డిమాండ్‌ను తట్టుకోవటా నికి అహర్నిశలూ రాస్తూనే ఉంటాడు కమాచో. కొన్నిసార్లు పాపులారిటీ కూడా ప్రాణాంతకమవుతుంది. ఇప్పుడు కమాచో పేరు తెలియని శ్రోతలు లేరుగాని ఆయన వేళ్లలో పట్టు తగ్గుతోంది. ఊహా విహారా లతో అలసి మనస్థిమితం కోల్పోతాడు స్క్రిప్టు రచయిత. కథల్లో అర్జెంటీనా వాళ్లను, లేక ఆ దేశాన్ని సమర్థించే పెరూ వియన్లనే విలన్లుగా పెడతాడు. ఈ హఠా త్పరిణామంతో అర్జెంటీనా రాయబారి, రేడియో స్టేషన్‌కు తన నిరసన తెలుపు తాడు. కాని కమాచో తన వైఖరి ఏమా త్రం మార్చుకోడు. రాజకీయకారణాలే కాక, క్యూబా నుండి దిగుమతి చేసుకున్న స్క్రిప్టులకన్నా నాసిరకంగా రాస్తాడు కమా చో. ఒక ఎపిసోడ్‌లో మరణించిన పాత్ర లు మరో ఎపిసోడ్‌లో లేచివస్తాయి. పేర్లూ, వృత్తులూ మారిపోతుంటాయి. ఒక సీరియల్‌లోని పాత్రలు మరో సీరియ ల్‌లో దర్శనమిస్తాయి. గందరగోళంతో గగ్గోలెత్తిపోతారు శ్రోతలు. ఈ సీరియళ్ల ప్రహసనానికి క్లైమాక్స్‌గా కమాచోను పిచ్చాసుపత్రిలో చేర్పిస్తారు. మొత్తం మీద పన్నెండేళ్ల తర్వాత మారి యో, జూలి యాల వివాహం సాఫీగానే జరుగుతుంది.

1916లో జేమ్స్ జాయిస్ ప్రచురించిన నవల 'ఎ పోర్ట్రె యిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్ మాన్'లాగా, ఇది కూడా మారియో గురించిన రోజువారీ జీవిత అనుభ వాల సమాహారమే. నిజానికి జోసాతో సహా ఆధునిక రచ యితలందరూ, సాల్వడార్ ఎలిజాండో మాటల్లో 'రచనా ప్రక్రియ గురించి (దీన్నే కథా వస్తువుగా తీసుకొని) రాస్తున్నామను కొని రాస్తున్నారు. రచనా ప్రక్రియ గురించి చేసిన రచననే తాము చదివిన ట్టుగా పాఠకులు ఊహించుకుంటారని వాళ్లు (రచయితలు) ఊహించుకుంటు న్నారు'. అంటే కథ చెబుతున్న మారియో, నవలా రచయిత మారియో జోసా, మరొక చవకబారు స్క్రిప్టు రచయిత గురించి ఊహించుకుంటున్నారు.

'వాస్తవికతను పునర్నిర్వచించిన నవల -ఆంట్ జూలియా అండ్ ది స్క్రిప్ట్ రైటర్' అని అన్నారు విమర్శకులు. ఆధునికానం

# ఆ రచయితే దీనికి ప్రేరణ : జోసా



'కెప్టెన్ పంటోహా అండ్ ది స్పెషల్ సర్వీస్' రాయకపోతే నాకు హాస్యం తెలిసేదే కాదు. ఆ నవల తర్వాత హాస్య ప్రధానమైన మరో కథ చెప్పాలనిపించింది. అలా తట్టింది 'ఆంట్ జూలియా' నవల. సీరియస్ సాహిత్యం కన్నా చవకబారు నవలలు పాఠకుల్ని బాగా ఆకట్టుకుంటాయి. ఇదేదో నేను కొత్తగా తెలుసుకున్న సత్యం కాదు. కానీ ఆ రకమైన ఆకర్షణను సీరియస్ సాహిత్యంలో తేవడం సాధ్యమా? అనే ఆలోచన వచ్చింది. పందొమ్మిదో శతాబ్ది సృష్టించిన మహా రచయితలు అందరూ గొప్ప ఎంటర్‌టెయినర్లే. విక్టర్ హ్యూగో, అలెగ్జాండర్ డ్యూమా, చార్లెస్ డికెన్స్‌ల గురించి ఎవరికైనా సందేహముందా?

మధ్య యుగాలలోని సాహిత్యంలో సీరియస్ కళకూ, పాపులర్ ఎంటర్‌టెయిన్‌మెంట్‌కు మధ్య తేడా లేదు. సృజనాత్మకమైన, సీరియస్ సాహిత్యాన్ని పామర రంజకంగా, సామాన్య పాఠకులకు అందుబాటులోకి తేవటమెలా అన్న ప్రశ్న నన్ను చాలాకాలం వేధించింది. సృజనాత్మక సాహిత్యమంటే సీరియస్ విషయమనీ, అది పండితులను, మేధావులను దృష్టిలో పెట్టుకుని రాస్తారని అందరికీ తెలుసు. అలాగే, జనరంజకమైంది సీరియస్ కళ కాదని అనుకుంటారు.

పాపులర్ ప్రక్రియ పద్ధతులను, టెక్నిక్‌ను, ఇతివృత్తాలను ముడిసరుకుగా తీసుకొని సీరియస్ సాహిత్య రచన చెయ్యాలన్నది నా కోరిక. 'వాడుకలో అరిగిపోయిన' మలుపులు, మెలికలు, మెలోడ్రామా, పడికట్టు పదాల భాషతో కళాత్మక విలువలు తగ్గకుండా రాయటానికి ప్రయత్నించాను.

చవకబారు నవలల్లో కనిపించే స్టీరియోటైపు మనుషులు, సంఘటనలు, మలుపులు (సోప్ అపెరాల ముడిసరుకు) ఒక కళాత్మక రచనకు కూడా ఉపయోగపడగలవా? ఇలాంటి నవలలో కూడా 'నాది' అంటూ ఉండగలదా? నా ఇతర రచనల్లాగానే ఈ కథ కూడా స్వానుభవం నుండే తట్టింది. యాభైలలో లిమాలో విద్యార్థిగా ఉన్నప్పుడు రేడియో స్టేషన్‌లో జర్నలిస్టుగా పనిచేశాను. అక్కడ సోప్ అపెరాలు రాసే ఒక బొలివియన్‌తో పరిచయమైంది. నిజానికి అతడో అసాధారణమైన వ్యక్తి. ఆ రేడియోస్టేషన్ ప్రసారం చేసే సోప్ అపెరాలన్నీ అతడొక్కడే రాసేవాడు. అతణ్ని కేవలం స్క్రిప్టు రైటర్ అంటే తక్కువ అంచనా వేసినట్టే. అతడు సోప్ అపెరా ఫ్యాక్టరీ లాంటివాడు. రోజుకు ఎన్ని ఎపిసోడ్‌లు రాసేవాడో కాని ప్రసారమైనవన్నీ అతడి వేనని మాత్రం తెలుసు. ఎన్ని కథలో, ఎన్ని మలుపులో! బహుశా ఒకే కథను పేర్లు మార్చి పదే పదే రాసేవాడు కాబోలు. ఇవన్నీ కాక, అతడు వాటిని డైరెక్ట్ చేశాడు. వాటిలో నటించాడు.

ఇతడి నుండి నేర్చుకోవాల్సింది చాలా ఉందనిపించింది. ఇలా రాయటం ఎంత సులభం! సీరియస్ రచనలు చెయ్యడం ఎంత కష్టం! కాని రచయిత కావటం నాకు చాలా ముఖ్యం. అదే నా ఆశయం. రచనను వృత్తిగా తీసుకున్న, నాకు తెల్సిన తొలి రచయిత అతడు. అప్పటికి 1953-54లో పెరూలో వృత్తి రచయితలు లేరు. అంటే రచన ఉదర పోషణకు పనికిరాదు. నాకు తెలిసిన రచయితలందరూ లాయర్లు, టీచర్లు, జర్నలిస్టులు. ఆదివారాల్లోనో, సెలవు రోజుల్లోనో మాత్రమే రాసేవాళ్లు. కాని ఈ బొలివియన్ కేవలం రచనలతో సంపాదిస్తున్నాడు. పైగా పాపులర్ రచయిత. ఆయన సోప్ అపెరాలంటే చెవి కోసుకుంటున్నారు అశేష శ్రోతలు.

నాకు సంబంధించినంత వరకు అతడు రచయిత ఎలా ఉండకూడదో తెలుసుకోవడానికి నమూనాగా మాత్రమే పనికొస్తాడు. అతడి రచనల లక్ష్యం సీరియస్ సాహిత్యం కాదు. సోప్ అపెరాలంటే కాలక్షేపం బఠానీలు, మరమరాలు. అసలతడు పుస్తకాలు చదువుతాడో లేదో కూడా అనుమానమే. అతడి సీరియళ్లు నేనెప్పుడూ వినలేదు గాని అతడంటే ఆసక్తి పెరిగింది. ఆ తర్వాత కొద్దికాలానికి జరిగిన సంఘటన అతడి గురించి రాయటానికి ప్రేరణ. రోజుల తరబడి రాసి అలసిపోయాడతడు. ఆ అలసట సీరియళ్లలో ప్రతిఫలించింది. సోప్ అపెరాల శ్రోతలు బుర్ర ఉపయోగించరనుకుంటాం గాని అలాంటి వాళ్లూ అవి అర్థంపర్థం లేకుండా ఉంటున్నాయని రేడియోస్టేషన్‌కు నిరసన తెలియజేశారు. ఒకటి రెండు కాదు వేలల్లో వచ్చాయి ఫిర్యాదులు. అయితే నేను 'ఆంట్ జూలియా'లో రాసినంత

అడ్డదిడ్డంగా ఉన్నాయా ఆ లోపాలంటే జవాబు చెప్పలేను. గుర్తున్న విషయాలు రాశాను.

మొత్తం మీద ఆ స్క్రిప్టు రైటర్ ఈ నవలకు ప్రేరణ. ఒక రచయిత, అనేక కథలు రాస్తుంటే, ఆ రాసే క్రమంలో ఒక కథలోని పాత్రలు, వాళ్ల పరస్పర సంబంధాలు, సంఘటనలు మరొక కథ లోకి ప్రవేశిస్తే... కాని రచయిత తన ఊహా ప్రపంచంలో నుండి బైటపడినప్పుడే కదా ఈ లోపాలు తెలిసివచ్చేది!

'ఆంట్ జూలియా'లో పేద్రో కమాచో, మతిస్థి మితం కోల్పోయిన సంగతిని పాఠకుడు అతడి స్క్రిప్టులు చదివి గ్రహిస్తాడు. అంటే సోప్ అపె రాల ద్వారా రచయిత గురించి, అతడి అంతర్లోక విధ్వంసం గురించి మనకు తెలుస్తుంది. ఆ రచ యిత సృష్టించిన పాత్రలే అతడి పతనానికి కార ణమయ్యాయి. అయితే నవలలో సోప్ అపెరాల స్క్రిప్టు మొత్తం రాయటం సాధ్యం కాదు. అందు వల్ల పత్రికల్లో వచ్చిన సమీక్షల ద్వారానే వాటి గురించి తెలుసుకుంటారు పాఠకులు.

అవాస్తవికంగా కన్న, వాస్తవికంగా రా యటం నా స్వభావానికి దగ్గర. నిజంగా జరగనప్పటికీ జరగగలదనుకుంటేనే రాస్తా ను. కానీ, ఈ స్క్రిప్టు రైటర్ విషయంలో అది అసాధ్యం. కృత్రిమ పాత్రలూ, కృత్రి మ సంఘటనలే. కొంద రికది ప్రయోగాత్మక నవల అనిపించవచ్చు అయితే, పాఠకుల్ని ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక, పేద్రో కమాచో కథను, మరో కథతో మిళితం చేసి చెప్పాలనుకున్నాను. అలా ప్రవేశించాడు మారియో. అసలు ప్రయోగం ఇదీ. వాస్తవ జీవి తంలో నాకు జరిగిన సంఘటనల్ని, పేద్రో కమాచో మెలోడ్రామాలతో క లిపి రాశాను. అలా నిజ జీవితంలో భాగమైంది సోప్ అపెరా.

అయితే, మారియో కూడా జీవితంలో జరిగిన ఒక సోప్ అపెరాలో కథానాయకుడే. ఆ తర్వా త సంఘటనలు కూడా నిజజీవితంలో జరిగిన నమ్మలేని నిజాలు.

ఈ నవల రాయటంలో నా ఉద్దేశం రెండు రకాల సాహిత్యాలను తులనాత్మకంగా అధ్య యనం చెయ్యటం ఎంత మాత్రం కాదు. అయినా అనాలోచితంగానే ఆ పని జరిగిపో యింది. కథానాయకుడు మారియో సాహిత్యాన్ని సీరియస్‌గా తీసుకున్నాడు. రచన అంటే లోకం కప్పుకున్న ముసుగుల్ని తొలగించటం అనుకు న్నాడు. కాని స్క్రిప్టు రైటర్‌కదో వృత్తి. భుక్తి కోసం ఏమైనా రాయవచ్చు. శ్రోతల్ని మత్తులో ముంచటానికి ఏం చేసినా తప్పులేదు. ఈ తేడా లను స్పష్టం చెయ్యటమే రచయిత ముందున్న కర్తవ్యమని తరువాత తెలిసింది. సాహిత్యం జీవి తాన్ని సుసంపన్నం చేయాలి. ఆరోగ్యకరంగా తయారుచేయాలి. అనారోగ్యకరమైన చిరుతిళ్లతో రోగాలు కొనితెచ్చుకోకూడదు.

కేవలం డబ్బుకోసం రాయటమే ఇద్దరి మధ్య ఉన్న తేడా అని నేను అంగీకరించాను. సీరియస్ సాహిత్యకారు లు కూడా ఎంతోకొంత సంపాదిం చాలనుకుంటారు. ఏం చేస్తే మీ జీవితం సఫల మవుతుందనుకుంటారో అలాగే రాయండి. ఆత్మా నందం ముఖ్యం. కాని వ్యాపార రచయితల లక్ష్యం డబ్బు సంపాదనే. వాళ్లకు అంతః ప్రేరణ కన్నా రచనా నైపుణ్యమే ముఖ్యం.

తన వ్యక్తిగత విశ్వాసమనే కటకంలోంచి చూసి, వాస్తవాన్ని తదనుకూలంగా వ్యాఖ్యాని స్తాడు సీరియస్ రచయిత. వ్యాపార రచయిత కూడా వాస్తవాన్ని మారుస్తాడు. కాని అది తన పాఠకుల విశ్వాసాలకు, మూఢనమ్మకాలకు అను కూలంగా సమాజం అంగీకరించిన విలువల్ని మరింత బలపర్చటానికి ప్రయత్నిస్తాడు. ఊహ లలో విహరించినట్టు, కనిపించినట్టు అనిపించినా, అలెగ్జాండర్ డ్యూమా నవలలు సమాజ వాస్తవిక తనే ప్రతిబింబించాయి.

కాని, వాస్తవాన్ని వక్రీకరించిన వ్యాపార రచ యిత్రి కోరిన్ టెలాడో, స్పానిష్‌లో గార్షియా మార్క్వెజ్ కన్నా ఎక్కువ పాపులర్. ఆమె టీవీ, రేడియో సీరియళ్లు రాస్తుంది. నెలకు రెండు నవ లలు ప్రచురిస్తుంది. అయితే, సాంస్కృతికప రంగా, ఈ రెండు ధోరణుల సంగమమే అత్యు న్నత సాహిత్య సృష్టి.

తర సాహిత్యానికి మంచి ఉదాహరణ. బొలివియన్ స్క్రిప్టు రచయిత విపరీతంగా రాసిన మాట నిజమే గాని, పుంఖానుపుం ఖాలుగా రాసిన ప్రసిద్ధ నవలాకారులైన బాల్జాక్, ఎమీల్ జోలా, డికెన్స్ లాంటి వాళ్లూ చవకబారు రచయితలేనా? అని కూడా ఆలోచించమంటాడు రచయిత జోసా. ఈ రచయిత, రచనల గోడు పక్కన పెడితే, కథకు జీవం పోసిన పాత్ర 'ఆంట్ జూలియా'.

– ఎం. వసంత

# నాగమ్మ ఆంగ్లం



**- ఆచంట హైమవతి**

చాలా విశ్వాసంగా పదిహేనేళ్ళనించీ విమల ఇంట్లో పనిచేస్తోంది రత్నమ్మ. ఈ మధ్య తరుచుగా అనారోగ్యంగా ఉంటోంది రత్నమ్మ! నిన్న కొంచెం చిన్న బుచ్చుకుంటూనే విమలతో అంది.

'అమ్మగారూ... మా మరదలుంది మీకూ తెలుసుగా! నేను రాలేని రోజు దాన్ని పనిలోకి పంపుతాను' అంది రత్నమ్మ.

'అలాగే పంపు... పని చేతనౌతుందా? బాగా చేస్తుందా? నెమ్మదస్తురాలేనా?' అంది విమల.

రెండు రోజుల తర్వాత 'మా వొదినకి ఒళ్ళు బాలేదమ్మా... నేజేస్తా పని' అంటూ వచ్చింది నాగమ్మ. కొత్త కనుక ఒక్కొక్క పనీ చెప్పి దగ్గరుండి చేయిస్తూ-

'నీతో పని చేయించుకునేసరికి నాకు ఆయాసం వస్తోంది నాగమ్మా' అంది విమల.

'ఎందుకమ్మా అంత ఆవేశం? మీకు పి.పి' ఉందా అడిగింది నాగమ్మ.

'నాకు 'పి పి'నా... అంటే?'

'అదేనమ్మగారూ... జబ్బుకి 'మిసన్' బిగించి 'బుడగ'లాంటి దాన్ని 'పుస్ పుస్' అని నొక్తారు సూడండి! అంకెలొత్తాయ్?'

'బి.పి.నా? నాకింకా అది రాలేదులే నీదయ

## చతుర కతే

వలన' అంటూ నాగమ్మ చెప్పిన తీరుకి నవ్వుకుంది విమల.

పాత్రల్లో నీరు పోసి నానపెట్టి ఇల్లు తుడిచింది నాగమ్మ. ఒక ప్లేట్ పట్టుకొచ్చి 'ఇందులో కొంచెం ఉమ్మేయ్యండమ్మా' అని అంది. వెయ్యనుకాక వెయ్యనని విమల, వేసే తీరాలని నాగమ్మ అనడంతో.. ప్లేట్‌లో ఉమ్మేసింది విమల. కానీ.. ఆ ఉమ్మి ప్లేట్లో పడకముందే ప్లేట్‌ని పక్కకి తీసేసింది నాగమ్మ. పైగా..

'అదేంటమ్మగోరూ.. నేను పని మనిషినైనంత మాత్రాన.. అంత లోకువైపోయినానా? అలా ఊసేసినారు?' కినుకగా ముక్కుపుటాలు 'విశాలం' చేసి చీదరగా చూస్తూ అంది నాగమ్మ.

'మరి! నువ్వే కదా నన్ను బలవంతం చేశావ్? ఉమ్మెయ్యమని.. అన్నావా లేదా ముందుచెప్పు?' అడిగింది విమల.

'ఉమ్మంటే... గిన్నెలు తోమే 'పోరడు' అమ్మగారూ! మీకింతమాతరం తెలీదా?' అంది.

'ఏమిటి? గిన్నెలు తోమే పోరడా? ... వాడెవడు?' తెల్లబోతూ అడిగింది విమల.

'అదేనమ్మా... పెసలు పొడి...'

'పెసలు పొడా...? పాత్రలు తోమతానికా? ... ఇంకా నయం!! నాకు సోపెట్టి రుద్దుకుంటే దద్దర్లు వస్తున్నాయని... పెసల పిండితో రుద్దుకునే అలవాటు! ఆ సంగతి దీనికేలా తెలిసింది?' అని మనసులో అనుకుంటూ...

'అంట గిన్నెలు తోమటానిక్కూడా... పెసల పిండి కావాలంటే... ఎంత ఖర్చు? నాగమ్మని కంట్రోల్ చెయ్యక తప్పదు' అనుకుంది విమల.

ఐదారు చెంచాలు ఒక పళ్ళెంలో వేసిచ్చి 'దీనితో తోమేసేయ్!'

'నేను దీనితోనే తోముతాను, బాగానే 'క్లీన్ ఔతాయి' అంది నాగమ్మ.

నాగమ్మ వెళ్ళాక ఆ వేళ జరిగినవన్నీ 'పునశ్చరణ' చేసుకుంది విమల. నాగమ్మ మాటలు మెల్లిగా అర్థమయ్యాయి విమలకి.

నాగమ్మ 'విమ్' అని అడగటానికి 'బదులుగా' వాళ్ళ వాడుక భాషలో ప్లేట్‌లో 'ఉమ్మెయ్య'మనటం.. తన చర్య అందుకు దానికి కంగారు, చిరాకు, అసహ్యం.. నాగమ్మ 'ఆత్మాభిమానంతో' అన్న మాటలూ.. 'విమ్ పౌడర్నే' సరిగ్గా చెప్పటం చేతకాక 'స్పెషల్ పౌడర్' అనటానికి 'పెసల పౌడర్... అనాలని సరైన ఉచ్చారన రాక 'పౌడర్' అనటానికి 'పోరడు' అందనీ తోచి పడి పడి నవ్వుకుంది విమల!

©



# చతుర ప్ర.జ.

**పాఠకుల ప్రశ్నలకు ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్ సమాధానాలు**

ప్ర. భగవంతుని సన్నిధిలో అనేక రకాల పూజలుంటాయి. ధనికులు ఎక్కువ రేట్ల పూజలు చేయించుకుంటారు. తక్కినవారు సాధారణ కార్యక్రమాలు జరిపిస్తారు. దీనివలన దేవుని అనుగ్రహం ధనవంతులకే దక్కుతుందా? మరి పేద, మధ్యతరగతివారికి మార్గమేమిటి?

**– నల్లపాటి సురేంద్ర,**
పెదగంట్యాడ, విశాఖపట్నం

**జ.** 'రేటు'ని బట్టి పూజలు అనే పద్ధతి, దేవాలయాలు ధార్మిక సంస్థల చేతిలో నుంచి 'ధర్మకర్తల మండలి' 'అధికారుల మండలి' యిత్యాది పేర్లు ఏవైనా సరే ధనికులు, అధికారులు, రాజకీయాల ప్రాబల్యం కలవారు - వీరు చేజిక్కించుకొన్న కాలం నుంచి (చరిత్ర జోలికి వెళ్లడం లేదు)- ప్రారంభం అయింది. పూజా విధానాలలో విభిన్న పద్ధతులు ఉన్న మాట నిజమే! సందర్భాన్ని అనుసరించి, ప్రయోజనాన్ని అనుసరించి, లఘుపూజా విధానం మొదలు బ్రహ్మోత్సవాల వరకు విధానాలున్నాయి. భగవత్సేవకి సాధారణ, ప్రత్యేక, విశేషపూజలు అనడం 'రేటు' ని బట్టి కానే కాదు. ఒకనాటి కాలంలో, చక్రవర్తులు, సామంతులు, దండనాథులు, సైన్యాధికారులు, ఇతర ఉన్నత ఉత్తమాధికారులు సమాజంలో వివిధ వర్గాలకు చెందిన ప్రముఖులు యిలాంటి వారి తేడాని అనుసరించి ఆలయ మర్యాదలూ ఉండేవి. తరువాత తరువాత 'ఆర్జితసేవలు'గా రూపాంతరం చెంది, అతి ఎక్కువై, ఇప్పటి స్థితి ఏర్పడింది. దీన్ని మార్చడానికి ఒకటి రెండు దేవాలయాలలో ప్రయత్నాలు జరిగినా, సముద్రపు నీటిని తీయగా మార్చడానికి చిటికెడు చిటికెడు పంచదార కలుపుతూ పోతూండడం లాంటిదే! ఒక్కమాట నిజం! భగవంతుని దయ అందరికి ఒకలాగే ఉంటుంది. వజ్రాల కిరీటం యిచ్చినా, ఎంత ఒరిగిందీ! జుట్టు మాత్రమే సమర్పించినా ఫలితం ఎంతో - మనం చూస్తునే ఉన్నాం. 'శ్రీయాదేయం' నీ విభవాన్ని అనుసరించి దానాదులు చేయి అని వేదం! శ్రీ సత్యనారాయణస్వామి వ్రతం 'చిలకపలుకుల్లా' పలుకుతాం! ఆ కథలో కట్టెలు కొట్టుకొనే వ్యక్తి, ఒక సాధారణ బ్రాహ్మణుడు, వైశ్యుడు, రాజు, గొల్లకాపరులు అందరూ ఫలితం పొందారు. మరి 'విభవాలు' తేడా లేవా! గమనించండి. 'భక్త్యాతుష్యతి మాధవః'

ప్ర. ఇంట్లో పూజగదిలో లోహాలతో చేసిన విగ్రహాలను పెట్టుకోరాదని, ఫొటోలను, మట్టి విగ్రహాలను మాత్రమే పెట్టుకోవాలని విన్నాను. వివరించగలరు?

**– నెల్లుట్ల ప్రేమలత,** హైదరాబాద్

**జ.** ఎవరు చెప్పారో మరి! వ్రత కథలలో 'బంగారంతో గాని, వెండితో గాని, రాగితో గాని. ..' ఇలా రకరకాలు చెప్పడం విని ఉంటారు. ఆఖరికి మట్టితోగాని అని చెప్తారు. నిజానికి ఒక కోరికతో చేసే పూజా కార్యక్రమంలో భాగమిది. చివరికి ఆ విగ్రహాలు, కలశం తగినవారికి దానంగా యివ్వాలి. బంగారం, వెండి- అంటే గుండె జారి చేతికి వస్తుంది. ఇలాంటి సందర్భాలలో 'మట్టి ప్రతిమలు'పయోగించే వారూ ఉన్నారు. మట్టి ప్రతిమలు విరిగిపోతాయి. పూజకి పనికిరావు. అందుకే లోహాల విగ్రహాలు పయోగించుకోవచ్చు. వాటి పరిమాణం మూడు అంగుళాలు మించకూడదని పద్ధతి. చిత్రాలూ ఉపయోగించవచ్చు దోషం లేదు.. ఆపైన మీ అభిరుచి!

ప్ర. శ్రీకృష్ణుని యాదవుడు అంటారు. మరి తండ్రి వసుదేవుడు క్షత్రియుడు కదా! ఇంతకీ శ్రీకృష్ణుడు యాదవుడా? క్షత్రియుడా?

– వానపల్లి వెంకట సత్యగంగరాజు, విశాఖపట్నం

జ. యాదవుల మూల పురుషుడు యదువు. ఇతను యయాతి మహారాజు కుమారుడు. యయాతి క్షత్రియుడు. అతని కుమారులకి ఒకడికి తప్ప మిగిలిన వారికి శాపం యిచ్చాడు. అందులో యాదవులకి- రాజ్యార్హత ఉండకుండా పోవాలన్నది శాపం! రాజ్య అధికారయోగ్యత ఉండి రాజ్యములు చేయలేదు వారు. వీరిలో నాలుగైదు శాఖలున్నాయి. శాపగ్రస్తమైన వంశాన్ని ఎన్నుకొని అవతరించాడు భగవంతుడు కృష్ణునిగా! ఈ రెండు వంశాల సంగతి ఎలా ఉన్నా కృష్ణుడు ఒక సందేశం యిచ్చాడు. అది మరిచిపోతున్నాం. అర్హత ఉన్నా, అధికారం ఉండి, శక్తి ఉండి కూడా కంసుని చంపి, తరువాత రాజ్యం ఉగ్రసేనుడికే యిచ్చాడు. ఏ రాజుని చంపించినా, చంపినా- తాను రాజ్యం కోరలేదు. తగిన వారికే రాజ్యాలు యిచ్చారు. మన భాషలో 'కింగ్‌మేకర్'

ప్ర. దుర్వాస మహర్షి- అంబరీషుని ఏకాదశ వ్రతాన్ని, అరణ్యాలకు వెళ్లిన పాండవులనూ పరీక్షించదలచి రెండుచోట్ల భంగపడ్డాడు. శివాంశయైన దుర్వాసుని విషయంలో ఈ విపరీత చర్యలు ఏమిటి?

– వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి

జ. మహర్షుల చరితలు విచిత్రమైనవి. కథలు స్థూలంగా చూస్తే అర్థం కావు. శివాంశ అయిన దుర్వాసుడు చాలా సందర్భాలలో తెలియని వారి చేత అపార్థాల పాలు అయిన మహర్షి. ఆయనవి విపరీత చర్యలు కానే కావు. అంబరీషుడు దైవారాధనాతత్పరుడు వ్రతనిష్ఠలో నియమాలు తప్పనివాడు. అలాంటి ప్రభువు మీద అదను చూసుకొని దండెత్తడానికి శత్రువులు, దానవులు వేచి ఉన్నారు అని పురాణాంతరాలలో గాథలు. ఏకాదశీవ్రతమాహాత్మ్యం వివరించడానికి, ఆ వ్రత అనుష్ఠానం చేసేవారికి శ్రీమహావిష్ణువు నిరంతరం రక్షకుడుగా ఉంటాడని, ఆయన వరకు ఆ అవసరం లేదు. ఆయన ఆయుధమే చాలు అని నిరూపించడానికి ఆ గాథ ఉపకరించింది. సుదర్శన తత్త్వం వివరించి, అహిర్బుధ్న్య సంహిత అందించిన పరమశివుని అంశ అయిన దుర్వాసునికి సుదర్శనం సంగతి తెలియదా!

ఇంక, పాండవులని పరీక్షించడానికి కాదు, దుర్వాసుడు వచ్చింది. ధర్మరాజు పుణ్యఫలంగా అక్షయపాత్ర సంపాదిస్తే, అది ద్రౌపది అహంకారానికి కారణం అయింది. ఆ రోజు అందరికీ ఆహారం యిచ్చిన పాత్రని సరిగా శుభ్రం చేయని కారణంగా చిన్న శాకం మిగిలింది. దుర్వాసుడే రాకుంటే, కృష్ణుడే అడ్డుపడకుంటే అదే అపరిశుభ్రమైన పాత్ర మరునాటికి పదార్థాలు యిస్తే పాపం ఎవరికి! అది నిలువరించడానికి విష్ణువు, శివుడు కదలి వచ్చారు. మరొక రహస్యం ఉంది. బ్రాహ్మణ ముఖంగా సమర్పించిన ఆహారం 'స్వధా'. ఇది కృష్ణుని ద్వారా దుర్వాసునికి, శిష్య కోటికి లభించింది. 'స్వధా' బలముతో, కృష్ణుని అవతార ప్రయోజనమైన 'భూభారహరణం' లయ కారకుడైన శంకరుడు కురుక్షేత్ర సంగ్రామం స్వయంగా నిర్వహించాడు. (యుద్ధ పంచకంలో అర్జునుడికి శంకరుడు ఒక దివ్యరూపంతో కనిపిస్తాడు శంకరుడు) కథా భాగాన్ని మన మనస్తత్త్వాలతో పరీక్షించకూడదు. శివభక్తుడని పేరు మోసి, పరదారాభిమర్శనం వేసిన రావణాసురుడిని, 'రావణబ్రహ్మ' అంటూ గొప్పగా చెప్పే మనం, దుర్వాసుని తప్పుపట్టగలమా!

ప్ర. చాతుర్మాస్యం అంటే ఏమిటి?

– కరణం శివానందరావు, కర్నూలు

జ. చాతుర్మాస్యం అంటే నాలుగునెలలు ప్రత్యేక నియమాలు పాటిస్తూ గడిపే జీవనవిధానం. ఇది యతులకే కాదు సంప్రదాయపరులకీ ఉంది. కానీ యతులు, సన్యాసులకి పరిమితం అయింది. ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలు కార్తీక శుద్ధ ద్వాదశి వరకు ఈ వ్రతము. తొలి ఏకాదశి మొదలు కార్తీక మాసంలో ప్రబోధన ఏకాదశి, క్షీరాబ్ధి ద్వాదశి వరకు ఈ నాలుగు నెలలు సన్యాసులు, యతులు ఒకేచోట ఉండాలి. వ్రత సమాప్తి వరకు పర్యటనలు రద్దు చేసుకోవాలి. దూరదూర ప్రాంతాలకు వెళ్ళరాదు. నదులు దాటరాదు. గ్రంథపఠనం, అధ్యయనం, బోధనం, ఆరాధనం, జపం, తపం ఇలాంటి కార్యక్రమాలలో నిమగ్నం కావాలి. వీరి పోషణ బాధ్యత గృహస్థులదే! నెలల వారీగా కొన్ని శాకములు వదలాలి! కొన్ని కొన్ని పదార్థములు మాత్రమే స్వీకరించాలి! ఈ నాలుగు నెలలు శ్రీ మహావిష్ణువు శయనించి ఉంటాడుగనుక, ఆ యోగనిద్రావైభవం, ప్రభావం తమలో ఆవహింప చేసుకొనేలా వ్రతానుష్ఠానం చేయాలి. కొన్ని

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. 'యత్ర నార్యస్తు పూజ్యంతే..' అన్న మనువే 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి..', స్త్రీ బుద్ధిః ప్రళయాంతకం..' అనడానికి కారణం ఏమిటి?

– హైమా కె. శ్యాం,
మందమర్రి, ఆదిలాబాద్ జిల్లా

జ. 'చిత్తశుద్ధిలేని శివపూజలేల' అన్నమాటకి ఒకడు చెప్పిన అర్థం చూడండి- నాకు చిత్తశుద్ధిలేదు. అందువలన శివుని పూజించను. విష్ణువునే పూజిస్తాను. చిత్తశుద్ధి కలగగానే తప్పకుండా శివారాధన చేస్తాను' ఇదేనా అర్థం!- మనువు వాక్యాలు ఇలాగే తీసుకొన్నారు, తీసుకొంటున్నారు. 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అనడానికి కైక, కుంతి, శూర్పణఖ లాంటి వారు ఎందరో- చరిత్రలో 'క్లియోపాత్ర' లాంటి వారూ ఉన్నారు. 'సుమతి' అని మహాపతివ్రత, ఎవరో శాపం పెట్టాడట, ఆమె భర్త సూర్యోదయం నాటికి మరణిస్తాడు అని. ఆవిడ సూర్యుడు ఉదయించనే కూడదు అని తన తపశ్శక్తిని వినియోగించింది. ఏం! తన భర్త బతికి తీరాలి అనే తపశ్శక్తిని ఉపయోగించవచ్చుగదా! ఈ మాటకి మీ దగ్గర కాదు, సుమతి దగ్గరే సమాధానం ఉండదు- ఇది మచ్చుకి ఒకటి!

'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' అంటే అందరూ అనుకనే స్వేచ్ఛ, విచ్చలవిడితనం కాదమ్మా! పితా, భర్తా, పుత్రాః- అంటూ 'రక్షా' శబ్దం ప్రయోగించి, చివరి పాదంలో 'స్వాతంత్ర్య' పదం ఎందుకు ప్రయోగించారు- 'రక్షతి' అంటే రక్షిస్తారు. అని కాదు 'రక్షించి తీరాలి' అని నెత్తి మీద మొట్టి బాధ్యత చెప్పాడు మనువు. బాల్యం, యౌవనం, వార్ధక్యం- అంటూ మొత్తం జీవితం- ఆడువారి రక్షణ, బాధ్యత మగవా(డి)రిదే అని నియమం. చివరి పాదం 'స్వాతంత్ర్యం' అంటే 'ఇండిపెండెన్సు' కాదు తల్లీ! 'తంత్ర- రక్షణే' అని ధాతువు స్వతంత్ర= తనను తాను రక్షించుకొనుటకు 'అర్హతి'= తగిన పని కాదు. ఆమెకి తనను తాను రక్షించుకొనడం చేతకాదని కాదు. ఆ అవసరం కల్పించకండి! ఆమెను జాగ్రత్తగా చూసుకోండి అని.

అమ్మా! భారతీయుల దృష్టిలో స్త్రీ ఆదిశక్తే కాదు, అమ్మ కూడా! బిడ్డ కూడా! చేతిగాజులు, కంకణాలు, మెడలో హారాలు, కంఠికలు, నడుమ వడ్డాణం- ఇలాంటి ఆభరణాలు కూడా వారి వారి రక్షణకి పరికరాలు, ఆయుధాలు అంటాడు 'వీరమిత్రోదయ ధర్మశాస్త్రకర్త'. స్మృతికారుల వాక్యాలు లోతుగా చూడండి- అపార్థాలు కలిగించకండి- నమస్కారం.

సంప్రదాయాలలో రకరకాల కారణాల వలన మాసం (నెల) అంటే పక్షం (2వారాలు) అనీ, ఒక వారం అనీ నిర్వచనాలు మార్చుకొని కార్యక్రమాలు నిర్వహిస్తుంటారు. యతులే కాదు, నియతిగల గృహస్థులూ ఆచరించ తగిన వ్రతం యిది. అన్ని సంప్రదాయలవారికి కొంచెం తేడాలో ఈ వ్రతం ఉంది.

ప్ర. మనిషి ఎంత ప్రయత్నించినా మంచి సంకల్పాలు కూడా నెరవేరడం లేదు. ఆటంకాలు లేకుండా అవి నెరవేరాలంటే భక్తి మార్గంలో ఏంచేయాలి?

– టి.బి.వి. దుర్గాప్రసాద్,
కానూరు, కృష్ణాజిల్లా

జ. మానవ సంకల్పం మంచిది అయినంత మాత్రాన చాలదు. ఇతరములు ఎన్నో కలసి రావాలి! 'నేను అబద్ధం చెప్పను' ఇవి హరిశ్చంద్రుడు, 'నేను ఎవరితో విరోధం పెట్టుకోను' ఇది ధర్మరాజు. 'ధర్మాన్నే పాటిస్తాను' అని రాముడు. మరి వీరి సంకల్పాలు మంచివి కావా! మరి వారికి వచ్చిన సన్నివేశాలు ఏమిటి? మనం వారందరికంటే గొప్పవారమా?

అలాగని సంకల్పాలు మానేయమని కాదు. సమ్యక్+కల్ప= సంకల్ప- అంటే చేయదలచిన పనిని ప్రణాళికతో చేయి. నియమం పెట్టుకో! లక్ష్యం పెట్టుకో! ముదుకు సాగు. చీమకూడా గమ్యం చేరుతుంది. పని జరగడం లేదంటే- దానికి కారణాలు నిష్పాక్షికంగా పరిశీలించు. 'పని నువ్వు చేయి.. ఫలితం నాకొదిలేయి' అని గీతాకారుని మాటగా చెబుతారు. అదికాదు, 'కర్మణి ఏవ అధికారః తే' శ్రద్ధగా పని సాగించడే నీవు చేయి. 'మా ఫలేషు కదాచన' చివరి ఫలితం మీదే దృష్టి పెట్టి, ప్రణాళిక తప్పుదోవ పట్టనీయకు! 'మా కర్మ ఫల హేతుర్భూః' పని చేస్తున్నందు వలన చివరి ఫలితానికి నువ్వు కారణం అని అనుకోకు! మరోసారి గీతావాక్యాన్ని పరిశీలించండి! పరీక్షించండి! జయం మీదే ©

24

# భామనే.. సత్యభామనే..!

మోడల్‌గా కెరీర్‌ను ప్రారంభించి, మిస్ టీన్ వరల్డ్, మిస్ లివర్‌పూల్ వంటి అనేక టైటిల్స్‌ను గెలుచుకుందా బ్రిటిష్ భామ. అవే ఆమెకు సినీ అవకాశాలను తెచ్చిపెట్టాయి. తమిళ చిత్రంతో తెరంగేట్రం చేసి వరుసగా హిందీ, తెలుగు చిత్రాల్లోనూ అవకాశాలను కొట్టేసింది. శంకర్ దర్శకతంలో వచ్చిన 'ఐ'తో ఆమె అభిమానుల సంఖ్య ఒక్కసారిగా పెరిగింది. రోబో 2లో ఆమె పేరు ఖరారైతే మరో పెద్ద విజయం తన ఖాతాలో చేరిపోయినట్టే! ఈపాటికే ఆమె ఎవరో మీకు తెలిసిపోయుంటుంది కదా.. మరి ఆ లివర్‌పూల్ సుందరి.. **అమీ జాక్సన్** తన సొగసులకు ఎలా మెరుగులు అద్దుకుంటోందో ఆమె మాటల్లోనే..

## సొగసు చూడతరమా...



వీలైనంత తక్కువగా మేకప్ వేసుకుంటాను. ముఖం కడుక్కోవడానికి కాఫీ స్క్రబ్ వాడతాను. అది చర్మంలోని మృతకణాలను తొలగిస్తుంది. ఇది సహజ పద్ధతి. కెమికల్స్‌తో తయారయేవి చర్మకణాలను తొలగించడమే కాకుండా ఇతర నష్టాలను కలిగిస్తాయి. జుట్టు విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటా. విటమిన్ ఇ ఎక్కువగా అందే ఆహారం తీసుకుంటా. ఎక్కడికి వెళ్లినా ఒకట్రెండు జతల బట్టలు ఎక్కువగా పెట్టుకుంటాను.

ఆహారం విషయంలో ప్రత్యేక పద్ధతంటూ ఏమీ పాటించను. అయితే మోతాదు మించకుండా జాగ్రత్తపడతా. తగినంత నీరు తీసుకుంటా..

ఉదయం లేవగానే లీటరు నీరు తాగుతా. ప్రతిరోజూ కనీసం గంటపాటు ఈత కొడతాను.

ఉదయం అల్పాహారంలో ఉడకబెట్టిన

కోడిగుడ్లు లేదా జావ, ఓ ప్లేటు తాజా పండ్ల ముక్కలు తీసుకుంటా. మధ్యాహ్నం భోజనంలో చికెన్ లేదా చేపలు, ఉడకబెట్టిన బంగాళదుంపలు, ఆవిరిలో ఉడకబెట్టిన కూరగాయలు ఉంటాయి.

రాత్రి భోజనంలో ఇంట్లో తయారు చేసిన ఓ గిన్నెడు సూప్ లేదా సలాడ్ ఉంటుంది. దాదాపు ఏడు లోపలే ముగిస్తా.

మధ్యలో ఆకలివేస్తే బాదం పప్పులు, అరటిపళ్లు తింటుంటా. ఇక ఆదివారం ఏ సంకోచం లేకుండా నాకిష్టమైనవి ఇష్టమైనంత మోతాదులో లాంగిచేస్తా.

నా పొట్ట చాలా సన్నగా ఉంటుంది. దానిగురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోనక్కర్లేదు. చిన్నప్పటినుంచీ గుర్రపుస్వారీ చేయడం వలన జరిగిన మేలు కావచ్చు.

ఒకేరకమైన వ్యాయామానికి కట్టుబడి ఉండను. వారం వారం రకరకాల వ్యాయామాలు



చేస్తుంటా. దాంతో వ్యాయామమంటే బోర్ కొట్టకపోవడమే కాక నా శరీరమూ అన్ని రకాల వ్యాయామాలకు అలవాటు పడుతుంది. రోజు విడిచి రోజు నా వ్యాయామ శిక్షకురాలిని కలిసి సూచనలు తీసుకుంటా. షూటింగ్ సమయాల్లో వ్యాయామం చేయడం కుదరకపోతే యోగా, నృత్యం, ఈత లేదా జాగింగ్ చేస్తాను.

సేకరణ : సంధ్యారాణి

## ఆ రెండూ ప్రమాదమే!



భారతీయ మహిళల్లో ఎక్కువగా అధికబరువు, అతి తక్కువ బరువు ఉన్నవాళ్ల సంఖ్య పెరుగుతోందని తాజా అధ్యయనంలో తేలింది. అధిక బరువు డయాబెటిస్, గుండెనొప్పి, క్యాన్సర్‌వంటి సమస్యలకు దారితీస్తే అతితక్కువ బరువు పోషకాహార లోపం వల్ల కలిగే జబ్బులకు దారితీస్తుంది. రెంటిలో ఏదైనా ప్రాణహాని కలిగించేదే! సరైన ఆహారం తీసుకుంటూ ఎత్తుకు తగ్గ బరువుంటే ఆరోగ్యంగా ఉండొచ్చు. మనం అధిక బరువు, అతి తక్కువ బరువులలో ఏ జాబితాలో ఉన్నామో తెలుసుకోవాలంటే సరైన సూచిక బాడీ మాస్ ఇండెక్స్(బి.ఎమ్.ఐ)!

కిలోగ్రాముల్లో బరువును ఎత్తు(మీటర్లలో) వర్గంతో భాగిస్తే బి.ఎమ్.ఐ వస్తుంది. ఉదాహరణకు మీరు 60 కిలోల బరువు, 1.7 మీటర్లు ఎత్తు ఉంటే మీ బి.ఎమ్.ఐ. 60 /1.7 X 1.7= 20.76 అన్నమాట. బి.ఎమ్.ఐ. 18.5 కంటే తక్కువగా ఉంటే ఉండాల్సినదానికన్నా తక్కువ బరువున్నట్లు. 24.9 కంటే ఎక్కువగా ఉంటే అధిక బరువు, 30 కంటే ఎక్కువగా ఉంటే ఊబకాయం ఉన్నట్లు. మరి మీ బి.ఎమ్.ఐ ఎంత ఉందో తెలుసుకుని తగిన జాగ్రత్తలు పాటించండి.

## మహిళా శక్తి



**అదృష్టం కోసం ఎదురు చూడకు. నీవున్న చోట నుంచే నీకున్న దానితోనే పని ప్రారంభించు. అదే నిన్ను ఉన్నత శిఖరాలకు తీసుకెళ్తుంది**

– మేరీ మేనిన్ మోరిస్సే



**ఏ సమస్యలూ లేకుండా ఉంటే ఆనందంగా ఉన్నట్లు కాదు, ఏ సమస్యనైనా ఎదుర్కొనే శక్తే ఆనందానికి సూచిక**

– స్టీవ్ మరబొలి



# సోయగం



మహిళలకు అందం చీరతోనే వస్తుందంటే అతిశయోక్తి కాదు. అయితే చీర ధరించినపుడు కొన్ని జాగ్రత్తలు పాటిస్తే మరింత అందంగా కనబడతారు.

★ పెద్ద పెద్ద హ్యాండ్‌బ్యాగులు, పర్సులు తీసుకెళ్లకూడదు. చిన్న పర్సులు చేతిలో అమిరేవి అయితే చూడ్డానికి బాగుంటుంది.

★ ఎత్తు చెప్పులు వేసుకోకపోవడమే మంచిది. చెప్పులు కనిపించవు కాబట్టి మరీ ఫ్యాషన్‌వి వేసుకోనక్కరలేదు.

★ బ్లౌజ్ చీరకు మ్యాచ్ అవడమే కాకుండా మీ ఒంటికి తగ్గట్టుగా కుట్టించుకోవడం వల్ల మరింత అందంగా కనబడతారు.

★ ముఖ్యంగా పెళ్లిళ్లలో పెద్దపెద్ద అంచులు, జరీ ఎక్కువగా ఉన్న చీరలు ధరించినపుడు ఉన్న నగలన్నీ వేసుకోకుండా ఒక గొలుసు, జూకాలు పెట్టుకుంటే హుందాగా ఉంటుంది.

# టెక్ గురూ!

## స్వరచక్ర తెలుగు కీబోర్డు

ఇప్పటివరకూ మనం ఇంగ్లీషు అక్షరాలతోనే తెలుగు పదాలను టైప్ చేసుకుని మెసేజ్ పెట్టుకునేవాళ్లం. అది టైప్ చేసేందుకు, చదివేందుకు కూడా ఇబ్బందిగా ఉండేది. అయితే ఇక ఆ ఇబ్బందులేమీ ఉండవు. స్వరచక్ర తెలుగు కీబోర్డు' యాప్ ఇన్‌స్టాల్ చేసుకున్నారంటే ఎంచక్కా టచ్‌స్క్రీన్‌పై తెలుగు కీబోర్డు ప్రత్యక్షమవుతుంది. దాంతో తెలుగుభాషలో నేరుగా టైప్ చేసుకుని మెసేజ్ పెట్టుకోవచ్చు. పదాలను టైప్ చేసేపుడు ఏ అక్షరాన్ని సెలెక్ట్ చేసుకుంటామో దాని గుణింతాలు, ఆ అక్షరం చుట్టూ వలయాకారంలో కనిపిస్తాయి. మనకు కావలసిన గుణింతం వైపు వేలును కదిలిస్తే అది స్క్రీన్ మీద వస్తుంది. అలాగే ఒత్తులు కావాల్సి వచ్చినపుడు ఆయా అక్షరాలను పైకి లాగితే వాటికి సంబంధించిన ఒత్తులు వస్తాయి. అలా నేరుగా తెలుగు భాషలోనే తేలికగా మెసేజ్‌లను టైప్ చేసుకుని మిత్రులకు పంపించొచ్చు. ఇతర భాషల్లో కూడా స్వరచక్ర కీబోర్డు యాప్‌లు లభ్యమవుతున్నాయి.




## గూగుల్ ఇండిక్ కీబోర్డు

స్వరచక్ర కీబోర్డుకు అడ్వాన్స్‌డ్ వర్షన్‌గా దీన్ని చెప్పుకోవచ్చు. ఏ భాష కావాలనుకుంటే ఆయా భాషల స్వరచక్ర కీబోర్డు యాప్‌లను విడివిడిగా పెట్టుకోవాల్సి వస్తుంది. గూగుల్ ఇండిక్ కీబోర్డు యాప్‌లో అన్ని భాషల కీబోర్డులు ఉంటాయి. అందులో ఉండే ఆప్షన్స్ సెలెక్ట్ చేసుకుని మనకు కావలసిన భాష కీబోర్డును ఎంపిక చేసుకోవచ్చు. ఇందులో టైప్ చేయడం మరింత సులభంగా ఉంటుంది. ఏదైనా పదాన్ని టైప్ చేసేపుడు మొదటి అక్షరం టైప్ చేయగానే ఆ అక్షరంతో మొదలయ్యే పదాలన్నీ స్క్రీన్‌పై కనిపిస్తాయి. ఆ పదాలలో మనకు కావలసిన పదాన్ని తాకితే అది స్క్రీన్‌పై వస్తుంది. ఒత్తులు కావాలంటే ఆయా అక్షరాలను నొక్కి పట్టుకుంటే వాటికి సంబంధించిన ఒత్తులు కనిపిస్తాయి. అందులో మనకు కావలసినది ఎంచుకుంటే అవి టైప్ అవుతాయి.

పై రెండు యాప్‌లను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

# జతపరచండి

ఇక్కడ కొందరు పౌరాణిక దంపతుల పేర్లు గజిబిజిగా ఉన్నాయి.
ఆ జంటలను గుర్తించగలరేమో చూడండి..

| | |
|---|---|
| 1. బృహస్పతి | ఎ. దమయంతి |
| 2. అత్రి | బి. దేవకి |
| 3. దశరథుడు | సి. గాంధారి |
| 4. వసుదేవుడు | డి. దితి |
| 5. అగ్నిదేవుడు | ఇ. కౌసల్య |
| 6. రావణాసురుడు | ఎఫ్. శకుంతల |
| 7. కశ్యపుడు | జి. స్వాహాదేవి |
| 8. దుష్యంతుడు | హెచ్. అనసూయ |
| 9. నలమహారాజు | ఐ. మండోదరి |
| 10. ధృతరాష్ట్రుడు | జె. తార |

జవాబులు ఈ సంచికలోనే.. కూర్పు : పక్కి శ్రీదేవి




## త్వరగా వెళ్లాలి



వ్యక్తి: సార్! నాకు రైలుకు టైమైంది. 4.30 నిమిషాలకల్లా రైల్వేస్టేషన్‌కి చేరుకోవాలి. మీ పొలం చుట్టూ తిరిగి వెళ్తే ఆలస్యమవుతుంది. మధ్యలో నుంచి వెళ్లేందుకు అనుమతించండి.

రైతు: నాకేమీ అభ్యంతరం లేదు. మీరు తప్పకుండా వెళ్లొచ్చు. నా ఎద్దు గనక మిమ్మల్ని చూస్తే 4.15 నిమిషాలకల్లా మీరు రైల్వేస్టేషన్‌కు చేరుకుంటారు.

## ఏంటా రహస్యం?

అజయ్: ఏంటి తాతా! డెబ్బై ఏళ్ల వయస్సులో కూడా బామ్మను డార్లింగ్, లవ్, హనీ.. అని ప్రేమగా పిలుస్తారు! ఏంటా రహస్యం?



తాత: ఏ రహస్యమూ లేదు బాబూ! బామ్మ పేరు మర్చిపోయి పది సంవత్సరాలపైనే అవుతోంది. ఇపుడు నేను నీ పేరేంటి అని అడగాలంటే భయంగా ఉంది, తనేమంటుందోనని!

## ఎందుకు?

చిన్ను: అమ్మా! గాంధీతాత తలపై ఒక్క వెంట్రుక కూడా లేదు, ఎందుకు?



తల్లి: ఆయన ఒక్క అబద్ధం కూడా ఆడలేదు.

చిన్ను: అదా సంగతి! నాకిపుడు అర్థమైంది, నీకు ఎందుకంత పొడవు జుట్టు ఉందో!

# చక్కెర పొంగలి




తయారు చేసేపద్ధతి

ముందుగా ఒక పాన్‌లో బియ్యం, పెసరపప్పులను రంగు మారేవరకు విడివిడిగా వేయించి పక్కన పెట్టాలి. చల్లారాక వాటిని కడిగి కుక్కర్‌లో వేసి నీళ్లు పోసి కుక్కర్ మూత పెట్టి పొయ్యిమీద పెట్టాలి. నాలుగు విజిల్స్ వచ్చాక స్టౌ కట్టేయాలి. ఐదు నిమిషాల తర్వాత కుక్కర్ మూత తీసి అందులో పంచదార వేసి సన్నని మంట మీద పెట్టి కరిగేదాకా ఉంచాలి. తరువాత అందులో యాలకుల పొడి, పచ్చ కర్పూరం, నెయ్యి వేసి కలిపి స్టౌ కట్టేయ్యాలి. చివరగా డ్రై ఫ్రూట్స్‌తో అలంకరిస్తే నోరూరించే చక్కెర పొంగలి రెడీ! పంచదార బదులు బెల్లం కూడా వేసి చేయవచ్చు. (రథసప్తమి సందర్భంగా)

## కావలసిన పదార్థాలు

* బియ్యం - 1 కప్పు
* పెసరపప్పు - 1 కప్పు
* పంచదార - 2 కప్పులు
* నెయ్యి - 1/2 కప్పు
* యాలకుల పొడి - 1/2 టీ స్పూను
* డ్రైఫ్రూట్స్ - తగినన్ని
* పచ్చ కర్పూరం - తగినంత
* నీళ్లు - 6 కప్పులు

## మైక్రోవేవ్ ఓవెన్ శుభ్రం చేయడం ఎలా?



మైక్రోవేవ్ ఓవెన్‌లో పదార్థాలు చిట్లి చాలా మురికిగా తయారవుతుంది. ఆ మరకలు త్వరగా వదలవు. వాటిని తేలికగా శుభ్రం చేయాలంటే.. గిన్నెలో అరకప్పు నీళ్లు పోసి నిమ్మకాయను కోసి, రసం పిండి ఆ ముక్కలు అందులోనే ఉంచాలి. ఆ గిన్నెను ఓవెన్‌లో పెట్టి హైపవర్‌లో మూడు నిమిషాల పాటు ఉంచాలి. పవర్ ఆఫ్ చేశాక ఓవెన్ తలుపు తియ్యకుండా అలాగే ఐదునిమిషాల పాటు ఉంచాలి. లోపల అతుక్కున్న పదార్థాలు మెత్తబడతాయి. ఇపుడు తలుపు తెరచి టవల్‌తో ఓవెన్ పైనుంచి కింద వరకు, తలుపు లోపలి వైపు భాగం శుభ్రంగా తుడవాలి. ఇంకా వదలని మరకలను, టవల్ చివరను నిమ్మరసంలో ముంచి దానితో గట్టిగా రుద్దాలి. అలా చేయడం వల్ల ఓవెన్ పూర్తి శుభ్రంగా తయారవుతుంది.

**జతపరచండి జవాబులు :** 1. జె, 2. హెచ్, 3. ఇ, 4. బి, 5. జి, 6. ఐ, 7. డి, 8. ఎఫ్, 9. ఎ, 10. సి

## చిట్కాలక్ష్మి



* బంగాళదుంపలు, కాలీఫ్లవర్ వండాక కూడా తెల్లగానే ఉండాలంటే వాటిని వండేటపుడు కొన్ని చుక్కల వెనిగార్ వెయ్యాలి.
* ఇడ్లీలు మెత్తగా రావాలంటే రవ్వ తక్కువ, మినప్పిండి ఎక్కువ వేయాలి. మినప్పిండి ఎంత మెత్తగా రుబ్బితే ఇడ్లీ అంత మెత్తగా ఉంటుంది.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**ఉడాలి భాస్కరయ్య**
డోర్.నెం.5, ఫ్లాట్ బి,
వెంకటరత్నం నగర్,
అడయార్, చెన్నై
పిన్ : 600 020

## చతురంగం - 58 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | ను | 2 మా | 3 నం | | 4 జ | గం | | 5 రా | 6 వి |
| న | | 7 రా | జ | 8 నా | ల | | 9 త | మ | రా |
| 10 సూ | 11 న | ము | | 12 మే | హా | న | ది | | ళం |
| 13 య | తి | | 14 సూ | క | రం | | 15 య | 16 పా | |
| | 17 ప్ర | 18 భా | క | ర | | 19 స | | 20 రు | 21 మ |
| 22 బా | | వి | | 23 ణం | 24 సం | హ | ర | | హి |
| 25 పూ | జ | | 26 ని | | 27 త | నం | | 28 అ | |
| ర | | 29 అ | నా | 30 మ | కం | | 31 త | | 32 కు |
| 33 మ | ల్లె | పూ | దం | డ | | 34 న | డ | 35 మం | త్రం |
| ణ | | పం | | 36 మ | గ | | 37 ఉ | దం | తం |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎం. లక్ష్మి, విద్యానగర్, హైదరాబాద్, 2. ధరణి పద్మాసన, నల్లకుంట, 3. పి. శుభ, బంజారాహిల్స్, 4. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 5. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 6. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 7. సంజీవి గారి నాగశ్వేత, బెంగళూరు, 8. సోంపాక రాజబాబు, భద్రాచలం, 9. టి.ఎస్. లత, మంచిర్యాల, 10. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 11. అన్నంరాజు పూర్ణచంద్రరావు, విశాఖ, 12. ఎ. రంగనాథం, బెంగళూరు, 13. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, 14. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 15. జి. క్రిష్ణవేణి, చిక్కడపల్లి, 16. గండ్లూరి బలరామశాస్త్రి, మల్లాపూర్, 17. పేర్వేల రాంబాబు, మణికొండ, 18. జి. మంజీరాశేషశాయి, చెరకువాడ, ప.గో. జిల్లా, 19. పి. ఆర్. నాయుడు, తిరుపతి, 20. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, 21. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 22. రాంపల్లి శ్రీవర్ధని, సరూర్‌నగర్, 23. దేవత్రాజు వెంకటనరసింహారావు, చైతన్యపురి, 24. ఇవటూరి శారదాదేవి, పోడూరు, ప.గో. జిల్లా, 25. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 26. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 27. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 28. పొన్నపల్లి వెంకటప్పయ్య, సరూర్‌నగర్, 29. పెనుమచ్చ నాగేశ్వరి, తుని, తూ.గో. జిల్లా, 30. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 31. జి. ముత్తుమారన్, చర్లపల్లి, 32. చింతలపాటి శివశంకరశాస్త్రి, లింగంపల్లి, 33. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 34. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, 35. టి. పురుషోత్తం, కొత్తపేట, 36. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 37. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 38. కె. లలిత, కర్నూలు, 39. నెల్లుట్ల ప్రేమలత, ప్రగతినగర్, 40. యు.ఎన్. మూర్తి, లాలాపేట, 41. ఎ. అరుంధతి, మహారాష్ట్ర, 42. కె. రఘుపతి, అల్వాల, 43. సి. లక్ష్మీనారాయణ సింగ్, నల్లకుంట, 44. డా. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 45. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 46. శివలెంక చంద్రశేఖర్, అబిడ్స్, 47. పూల రమాదేవి, వనస్థలిపురం, 48. సి. భారతి, మన్సూరాబాద్, 49. వేదుల నరసింహమూర్తి, గుడిమల్కాపూర్, 50. రాంపల్లి పద్మజారాణి, హైదరాబాద్, 51. కె. వెంకుబాబు, గుంటూరు, 52. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 53. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 54. డి.వి. కామేశ్వరి, విశాఖపట్నం, 55. డా. సి.కె. శాస్త్రి, గుంటూరు, 56. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 57. అవధూత అన్నపూర్ణ, నల్లగండ్ల, రంగారెడ్డి జిల్లా, 58. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 59. మొహమ్మద్ ఖాసిం, కల్లూరు గూడెం, ఖమ్మం జిల్లా, 60. పి.వి.ఎల్. సుజాత, సైనిక్‌పురి, 61. కోలా సత్యనారాయణ, విశాఖపట్నం, 62. డా. కె. శివభూషణం, కర్నూలు, 63. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 64. జి. కుసుమకుమారీదేవి, పెడన, 65. జి. జమున, తిరుపతి, 66. తొయ్యేటి వెంకట సూర్యం, విశాఖ, 67. ఎస్.వి.వి.ఎస్. పద్మావతి, కాకినాడ, 68. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 69. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 70. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 71. పరిపల్లి నాగభూషణం, విజయనగరం, 72. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 3. ఎం. శ్రీవాణీగిరిజాదేవి, రాజమండ్రి, 74. దండు రామరాజు, మెరకముడిదాం, విజయనగరం జిల్లా, 75. కొల్లూరు వేంకటరమణమూర్తి, పర్లాకిమిడి, ఒడిషా, 76.తోటపల్లి సుధీర, వాకాడు, నెల్లూరు జిల్లా, 77. వడ్డాది బాలసుబ్రమణ్యం, సోమాజీగూడ, 78. ఎ. స్వరూరాణి, గుంటూరు, 79. బి. రామమోహనరావు, హైదరాబాద్, 80. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 81. వి.వి. సీత, ఎస్.ఆర్. నగర్, 82. పక్కి శ్రీదేవి, గంట్యాడ, విజయనగరం జిల్లా, 83. సయ్యద్ జమిలాబేగం, కర్నూలు, 84. యు. నాగప్ప, మద్దికెర, కర్నూలు జిల్లా, 85. ఎం. వసంతవీరేశ్, మద్దికెర, కర్నూలు జిల్లా, 86. సి. భావన, బండ్లగూడ, హైదరాబాద్, 87. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 88. జి. శ్రీనివాసరావు, సైనిక్‌పురి, 89. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 90. జి. పార్వతీదేవి, *(..128లో)*

# చతురంగం - 59 ఆధారాలు

## అడ్డం

1. నారదుని వీణ పేరు (3)
3. రాత్రికి వ్యతిరేకం (3)
5. కార్యం (2)
7. ఏనుగు (2)
8. పచ్చదనం (3)
9. చార.. గీత, పనికత్తె (3)
10. తుమ్మెదలాటిదే. ఈపదంతో 'మనసంతా నువ్వే' సినిమాలో పాట సూపర్ హిట్ (3)
11. ఆచారం కానిది, చెడ్డ నడత (4)
12. కర్ర, దాసుడి తప్పులు దీంతో సరి అంటారు (3)
14. జాతీయగీతంలో తొలుత ప్రస్తావించిన రాష్ట్రం/జాబు కాని జాబు, ఒకరాష్ట్రం (3)
16. రోజుకు 24 - - - (3)
17. అన్నీ, సమస్తం (3)
19. రవితేజ సినిమా, తాళం, మంచి పాట వింటే అప్రయత్నంగా మన చేతులు ఇది వేస్తాయి (3)
20. సర్పం (3)
22. కూర (2)
23. తెలుగు 'టేబుల్' (2)
25. నిలువు 19కి చిన్నమరదలు గందరగోళం (3)
26. దుర్యోధనుని భార్య (4)
29. నీరు వేగంగా ప్రవహిస్తే ఇది తప్పదు, సబ్బు రుద్దుకున్నా కనిపిస్తుంది (3)
30. పశుమూత్రం (3)
32. పురాణ కాలంలో అమ్మాయిల్ని ఇలా సంబోధించేవారు (2)
33. చిన్నపిల్లలను బుజ్జగించే ప్రయత్నంలో చుంబించడం (3)
34. పటాటోపం, దర్పంగా ఉండటం (4)

## నిలువు

1. పూలలోని తేనె (4)
2. విష్ణువు (2)
3. 'తుమ్మల' వారి కావ్యం, పంటపొలాల్లో పేదలు ఏరుకునేది (5)
4. గడిచిన కాలం (2)
5. పనిమనిషి, దాసి (5)
6. ఖర్చులన్నీ పోగా మిగిలిన ఆదాయం (3)
8. ఆంగ్లంలో తేనె (2)
9. 'చాలా'ను ఇలా కూడా అంటారు (2)
10. చెరువు నుంచి నీళ్లు బయటకు వెళ్లే గొట్టం, ఒకనాటి కొలమానం (2)
11. బ్రహ్మకుమారీల ప్రధాన ఆలయమున్న కొండ (2)
13. నాగార్జున సినిమా, శివుని చేతిలో వాద్యం (4)
15. గందరగోళమైన బాహువులు (3)
17. 'ఫిఫ్టీ ఫిఫ్టీ' కి తెలుగు (4)
18. తొంభై డిగ్రీలుండే నిలువు గీత (2)
19. పది ముఖాలు కలవాడు (5)
21. ఖర్చుకు వ్యతిరేకం (2)
23. శరీరం, దేహం (2)
24. చిలకలకిష్టమైన ఫలం (4)
26. వాటా (3)
27. శవాన్ని కాల్చడానికి కట్టెలతో పేర్చేది.. కింద నుంచి (2)
28. మరణశిక్ష అమలు చేసేవాడు (3)
31. సంచారజాతులు నివసించే ప్రాంతం, పల్లెలకు అనుబంధంగా ఉండే కుగ్రామం (2)
32. 'భాష'కు వికృతి (2)

(127వ పేజీ తరువాయి...)

వెంగళరావునగర్, 91. రొంగల సింహాచలశ్రీహర్ష, విశాఖ, 92. జె. రాజగోపాలరావు, ఎ.ఎస్. రావు నగర్, 93. బి. రామయ్య, బర్కత్‌పురా, 94. ఎస్. జయరామ్‌మోహన్, చెన్నై, 95. బి.మాచన్న, కళ్యాణదుర్గం, 96. కె.వి.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్, 97. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 98. ఉదయశ్రీ, హైదరాబాద్, 99. ఎ. శిరీష, హనుమకొండ, 100. గుర్రప్ప పురుషోత్తము, హనుమకొండ, 101. ఎల్.వి.రమణమూర్తి, హిమాయత్‌నగర్, 102. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 103. గురజాల పరలక్ష్మి, ఉచ్చిలి, తూ.గో. జిల్లా, 104. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 105. ఏకా సావిత్రి, బాపట్ల, 106. బి.వి. నరసింహారావు, పేరాల, 107. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 108. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 109. కొత్తపల్లి సృజన, టెక్కలి, 110. సూరి నాగరాజు, రామవరప్పాడు, కృష్ణా జిల్లా, 111. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 112. కూనపరెడ్డి సత్యనారాయణరాజు, పెనుగొండ, ప.గో. జిల్లా, 113. సౌదామినీ నాగరాజన్, వైజాగ్, 114. పి. హైమవతి, మంచిర్యాల, 115. ఈ. కృష్ణకుమారి, విజయవాడ

# చతురంగం - 59

రూ.150/- బహుమతి

గడువు తేది : ఫిబ్రవరి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | ■ | 3 | 4 | | ■ | 5 | 6 |
| 7 | | ■ | 8 | | | ■ | 9 చా | | |
| | ■ | 10 | | | ■ | 11 | | | |
| 12 | 13 | | ■ | 14 | 15 | | ■ | | ■ |
| ■ | | ■ | 16 | | | ■ | 17 | | 18 లం |
| 19 | | | ■ | ■ | 20 భు | 21 | | ■ | |
| 22 | | ■ | 23 | 24 | ■ | 25 | | | ■ |
| | ■ | 26 | | | 27 | ■ | | ■ | 28 |
| 29 | | | ■ | 30 | | 31 తం | ■ | 32 | |
| | ■ | 33 | | | ■ | 34 | | | |

పంపినవారి పేరు: ---------------------------------------------

వయసు (      ) చిరునామా : ---------------------------------------

---------------------------------------------------------------

------------------ పిన్ : ------------ ఫోన్ : ------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర,** ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# రొమాంటిక్ స్పెషల్‌గా జన్మదిన సంచిక

చక్రాలకుర్చీకే పరిమితమైన ఆ రచయిత దగ్గరకు అతడి రచనలపై పరిశోధన చేస్తానంటూ వచ్చిన ఓ అద్భుత సౌందర్యరాశి రేపిన అలజడి ఎలాంటిది? చదవండి ప్రసిద్ధ రచయిత **అవతార్ కృష్ణ రాజ్‌దాన్** కాశ్మీరీ కథ **సౌందర్య భావన**

తనను ఆటోగ్రాఫ్ అడిగిన ఆ ముగ్ధమోహన రూపం ఎన్నేళ్లైనా అతడ్ని వెంటాడుతూనే ఉంది. ఆమెను మళ్లీ చూడాలనుకున్న ఆ రచయిత.. ఆమెను చూసి నిర్ఘాంతపోయాడు. ఎందుకు? జ్ఞానపీఠ గ్రహీత **రఘువీర్‌చౌదరి** గుజరాతీ కథ **తెల్లగులాబీ**

ఆమె సౌందర్యం అతడిలో గాఢమైన ముద్రవేసింది. అతడి హుందాతనం ఆమె మనసును గెలిచింది. కానీ ఆమెను శాశ్వతంగా సొంతం చేసుకోవాలనే అతడి తొందరపాటుతనం చివరికెలా పరిణమించింది? **బానో కుద్‌సియా** పాకిస్తానీ ఉర్దూ కథ **జుబైర్**

ఆ మందు వల్ల అతడి భార్యలో ఊహించిన దానికంటే ఎక్కువ మార్పు వచ్చింది. మాటవరసకనే 'నిన్ను వదిలి ఒక్కక్షణం ఉండలేను' అనేమాటను నిజం చేయడానికి విశ్వ ప్రయత్నం చేసింది. దాని ఫలితమేంటి? చదవండి **జాన్ కోలియర్** అమెరికా కథ **అతిప్రేమ**




ఇంకా ఫిబ్రవరి సంచికలో..

- ★ ప్రముఖ రచయిత **సలీం** రాసిన భావరసాత్మక తెలుగు కథ **నిశిగంధ**
- ★ సినీగేయ రచయిత **భువనచంద్ర** అందించిన తెలుగు కథ **బొట్టు**
- ★ జ్ఞానపీఠగ్రహీత **మహాశ్వేతాదేవి** **ఇది అబద్ధం కాదు**

35 ఏళ్లనాటి విపుల కథలో!


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# ఆమె ప్రతీకారం పర్యవసానం?

మార్చి చతురలో..

కలవారి అండదండలతో కష్టపడి చదువుకున్నాడా పేదింటి అబ్బాయి. కలెక్టరు కూడా అయ్యాడు. అతనిపై కన్నేసిన ఆ కలవారింటి అమ్మాయి పెళ్లి చేసుకోమని వెంటపడింది. కానీ అతను కాదన్నాడు. ఆమె చెల్లెలినే మనువాడాడు.
తనను కాదన్నాడన్న ఆగ్రహంతో అతనిపై కక్షసాధింపు మొదలెట్టిందా కలవారి అమ్మాయి. ఆ తర్వాత ఏమైంది?
ఉన్నత ఆశయాలతో లక్ష్యాలతో కలెక్టరైన ఆ పేదింటి కుర్రాడి జీవితం ఎలాంటి మలుపులు తిరిగింది?
సమాజంలోని విభిన్న మనుషుల మనస్తత్వాలకు అక్షరరూపం
**డా. శ్యామ్ సఖా శ్యామ్**
హిందీ నవలకు
**ఆర్. శాంతసుందరి**
అనువాదం
**ఏమీ లాభం లేదు!**
చతుర కానుక!



**బోనస్‌గా...**

- **పెద్దకథ:** విభిన్న అభిరుచులు ఆశయాలు గల ఆ యువతీయువకులు ఒక్కటైన విచిత్ర పరిస్థితి.. **ఈ తరం ప్రతినిధి**
- **నవలావలోకనంలో..** తోటి మనిషి గురించి తెలియని ఎన్నో విచిత్ర పరిస్థితులకు అక్షర చిత్రణ **పెద్దిభొట్ల సుబ్బరామయ్య ముక్తి**

**CHATURA** Telugu Monthly, Dt. of publication : Feb 1, 2016.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978